# ఆనందమయి.

## ప్రథమ భాగము



గ్రంథకర్త,
పోడూరి రామచంద్రరావుగారు, బి. యె.



ఓం

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# ఆనందమఠము

## ప్రథమభాగము.



### మొదటిప్రకరణము



### ౧. గుఱ్ఱపుదాటు.

అది రాత్రి. అపుడే మేజస్ట్రేటు కచేరీయందు టంగుటంగుమని పదిరెండుగంటలు కొట్టిరి. పట్టణమంతయు శాంతదేవతచే నావహింపఁబడినదోయన నిశ్శబ్దముగ నుండెను. పాటలీపురవాసులెల్లరును గుండెలపై చేతులు వేసికొని హాయిగ నిదురించుచుండిరి. అప్పుడప్పుడు పురరక్షకభటులచే వేయఁబడుయీలలును, తీతువులఱతములును, ఒకటిరెండుస్థలములయందెవ్వఁడైన నిద్రావస్థయందు పలువరించుమాటలుఁ దక్క యితరధ్వను లెవ్వియు లేవు. అట్టిసమయమున నొకరౌతు గుఱ్ఱమును వేవేగ తోలుకొనుచు నాయూరు ప్రవేశించెను. ఆహయఖురఘట్టనమాపురప్రజల నిద్రాభంగముఁ గావించెను. అంత నెల్లరును తమయింటిగుమ్మములనుండియు, గవాక్షములనుండియు, నారౌతు నాత్రముతోఁ జూడసాగిరి. అతఁడు తల కొకగుడ్డ చుట్టుకొనియుండెను. నాగరికతజూపువస్త్రములు ధరింపక నలువదినెంబరునూలుతో నేయఁబడినమోటుగుడ్డలను ధరించియుండెను. ఆతఁడెక్కినగుఱ్ఱమును, పొలములు దున్నుకొనుట కుపయోగించు దేశవాళీమోటుతట్టు.

తనదెస నాశ్చర్యముతో జూచువారి నాతఁడు లెక్క సేయక వేగము పురవీధులఁ గడచి, యూరికుత్తరముననున్న పురరక్షకాధికారి(Mayor) గృహము నాతఁడు సమీపించెను. అయ్యది యొకటిరెండంతస్తుల మేడ. దానికుమ్మమునకు త్రాడొకటి వ్రేలాడుచుండెను. గొప్పవారిదర్శనము గావించుకొనఁదలఁచినవా రాత్రాటిని లాగినచో, లోనున్నగంట మ్రోగి, వారినివలకువచ్చునట్లు చేయుట కట్టిది యుపయుక్తమగును. ఆపల్లెటూరిరైతు తనగుఱ్ఱమునధిరోహించి, విరామము లేక యాగంటను మ్రోయింపఁజొచ్చెను. దాన నాయింటివారెల్లరును మేల్కాంచిరి. ఒక సేవకుఁడు కన్నులు నులుముకొనుచు కోపముతో తలుపు తెఱచి "ఎవరు వారు? ఇట్టియర్ధరాత్రమున మంచిచెడ్డలు తెలియక గంటవాయించెదరు? రాత్రియనక పగలనక యెల్లవేళలు పనిసేయుచుండవలసినదేనా? ఇఁక నింటిలోనివారిని బ్రదుకనీయరా?" యనివిసుక్కొనుచు పల్కెను. దాని కాజానపదుఁడును "అయ్యా! కోపపడకుఁడు. తొందరచే నట్లు చేసితిని; అత్యావశ్యకమగు పని యున్నందున మేయరుగారిని వెంటనే చూడవలసియున్నది. కనుక దయయుంచి లేపుఁ"డని మారువల్కెను.

"మేయరుగారిని లేపవలసిన యావశ్యకత లేదు. మేయరుగారే కాక వారియింటగల పశుపక్ష్యాదులు నాయపూర్వధ్వనికి మేల్కాంచినవి" అంత చేత నొకదీపికఁబూని మేయరుగారు వీధిలోనికేతెంచిరి.

"నేనే మేయరును. ఇట్టి సమయమున నాతో నేమి పని యున్నది?" అని ప్రశ్నించెను.

ఆమోటుగాయితు సేవకుని ప్రక్కకు త్రోసివైచి, ముందు కరుదెంచి నిలువఁబడెను, వానికి మర్యాద తెలియదు. మేయరుకు వందనమైన నర్పింపలే[illegible]నిప్పు నార్పుయంత్రమును శీఘ్రమే పంపఁగోరెదను." అని ప్రత్యుత్తరమిచ్చెను.

"నిప్పు నార్పు యంత్రమా?"

"అగును. వెంటనే పంపుదు. ఆలస్యముతగదు"

మేయరు తల యూచుచు "ఉహు" యని యలవాటుచొప్పున ననుకొనెను. వానికేమియు తోఁచుటలేదు. అట్టిస్థితిలో నాశ్చర్యమేమి జనింపదు?

ఆయంత్రమును శాలనుండి వెడలించుటకును, పనివారల సమకూర్చుటకును, ప్రజలందఱిని మేల్కొలుపవలెను. ఇదివఱలో విప్లవకారులచే పీడింపఁబడుచు, నిద్రాహారములెఱుఁగక, కనులు వాయలు వాచి యున్న పౌరుల కిది భయోత్పాతముగ నుండక మానదు. అందుచే సురేంద్రుఁడు,

"ఏమి? అంత యెక్కుడు మంటలా?" యని యడిగెను.

"ఎక్కువ కాకేమి? చెట్లు సైతము విఱిగి పడునట్లు గాలి వీచు చుండగా నెక్కువ కాకుండునెట్లు?"

"ఉహు!" అని సురేంద్రుఁడనుకొనెను. తాను మేయరైన తరువాత ప్రజలచే నిట్లు మేల్కొల్పఁబడుటకిది మొదటిసారి కాదు. ఇదివఱలో నాతఁడనేకమారులు నాటికి సాహాయ్యపడెను. మంటలార్పించెను.

ఇదివఱలో ననేకమారులు గడ్డిమేటులంటుకొనినను, పూరిగుడిసెలు తగులఁబడినను, ఇంతకన్న నెక్కువ తొందరలు గలిగించియుండిరి. అందుచే నాతండామాటలను విశ్వసింపక.

"ఏమి యంటుకొనినవి" యని ప్రశ్నించెను.

ఈయాలస్య మా కాపువానికి చాల విసుగు పుట్టించెను.

"ఎన్నిమారులు చెప్పవలెను? ఇండ్లు, నాటకిండ్లు, పశువులశాలలు, ధాన్యపుగాదెలు, ప్రాతకోటయు. నన్నియు నంటుకొనినవి. ఇఁక కొంతయాలసించినచో నానందభవనములో పూరిపుడకయైన నుండ"దని కోపముతో ననెను.

"ఏమీ? ఆనందభవనమే! అంటుకొనుటయే" అని సురేంద్రుఁ డాత్రముతో ననెను.

"అగును" అని ప్రత్యుత్తరమువచ్చెను.

"ధనపురంజమీందారుగారిదే?"

"నిశ్చయముగా వారిదే"

"మూర్ఖుఁడా! మొదటనే యిదియెందులకు చెప్పవైతివి?"

అతని సందేహమొక్క క్షణములో నివారణమయ్యెను. సేవకు నిఁజూచి, "త్వరగా నాకోటును, టోపీని తీసికొనిరా; ఆగు; అక్కరలేదు. నాభార్య తీసికొని రాఁగలదు. జాగుసేయుటకు వీలులేదు. శీఘ్రమే మాదిగవానిని నగారావాయించుమని చెప్పుము. అక్కడ నుండి పోయి యంత్రముల నడపువాని కంతయు నెఱింగించి యంత్రము తీసికొని మధుపురమునకు పొమ్మని చెప్పుము. ఇక్కడ నున్నట్లుగా రావలెను. వచ్చినంతనే బండిని సిద్ధము చేయుము. త్వరలోబోవలెను. దారిలో "మంటలు, మంటలు. ఇండ్లు తగులఁబడుచున్నవి. లెండు లెండ"ని యరచుచుఁ బొమ్ము. అందఱిని కచేరిసావడి దగ్గరకు రమ్మని చెప్పు"మని యాజ్ఞాపించెను. కొన్ని మాటలు వినిపించుకొనకుండగనే యాసేవకుఁడు పరుగెత్తెను. మేయరు పల్లెటూరివాని వైపు తిరిగి "తత్క్షణమే నీవు గుఱ్ఱము మీఁద పోయి జమీందారుగారితో "మేము వచ్చుచున్నా"మనియు, నధైర్యపడవలదనియు చెప్పుము. పొ"మ్మని చెప్పెను. కాని వాఁడు కదలలేదు.

"ఆనందభవనమున కరుగుటకు ముందు నాకింకొక పని యున్నది."

"ఏమిటది?"

"నేను డాక్టరుగారిని తీసికొని పోవలెను"

"డాక్టరుగారినా? ఎందుకు? ఎవరికైన నపాయము జరిగినదా?

"అగును. జమీందారుగారికే"

"ఏమి మూర్ఖత! మంటలలోఁ జొరబడెనా యేమి ?"

"లేదు. లేదు. ఆయనను రెండు మారులు తుపాకితో కాల్చిరి.

మేయరుగారాశ్చర్యముతో కొంచె మెచ్చుతగ్గుగా చేతిలోనిదీపము వదలివైచెను.

"హా! దైవమా! ఆయనను చంపిరా యేమి?"

"లేదు, నేను బయలుదేరునప్పటికాయన జీవించియే యుండెను.

"జమీందారిణియో!"

"మనోరమగారా! ఆమె జమీందారుగారికి పరిచర్య చేయుచున్నది. ఆయనగాయములకు కట్లు కట్టుచున్నది. వారి కుమార్తె లిరువురు నచ్చటనేయున్నారు"

సురేంద్రనాథుఁడత్యాశ్చర్యముచే కంపించెను

"ఇయ్యది ద్రోహు లెవ్వరో చేసిరని శోచుచున్నద"

"అగును"

"ఎవరై యుందురు? ఎందులకుచేసియుందురు?"

"అదియే యిప్పటి సందేహము"

"జమీందారుగారు కొంచెము కోపిష్ఠి. అయినను చాలమంచివాఁడును, సన్మార్గుఁడునని యందఱు నెఱుంగుదురు."

"అది యందఱికి తెలియును."

"అతండెవరికిని హానిచేసినట్లు లేదు"

"అట్లే అందఱును చెప్పుకొనుచున్నారు"

"ఇంక మనోరమ——"

"ఆమె దేవతాస్వరూపిణియే"

“కావున వాఁడొకప్పుడు కొత్తవాఁడై యుండవలెను. ఇపుడెక్కడ చూచిన దొంగలును ఘాతుకులును గలరు. కొత్తవారనేకులువచ్చుచున్నారు. దొంగయు మనిషియే. మంచివారెవరో చెడ్డవారెవరో తెలిసికొనుట చాలకష్టముగానున్నది.” ఆ కాపువాఁడు తలయూచుచు “నేనటులనే తలంచుచున్నాను. అందుచేతనే డాక్టరుగారితో చెప్పి పోలీసు స్టేషనులో చెప్పవలెనని తలంచితిని” అనెను.

“అది నేను చేసెదనులే. నేను గవర్నమెంటు ప్లీడరుగారితోఁగూడ చెప్పెదను. నీవు త్వరగాపోయి మనోరమగారితో మేము వెంటనే వచ్చుచున్నామనియు, ధైర్యమును వీడవలదనియు చెప్పుము”

కాపువాఁడు గుఱ్ఱమును పరుగెత్తించెను. దత్తుగారి సేవకుఁడు రోజుకొనుచు పరుగెత్తుకొనివచ్చెను. అపుడే అపాయమును సూచించునగారాధ్వని వినంబడెను. సురేంద్రుఁడు బాడిసాయత్తపఱచుమని సేవకుని కాజ్ఞయిడెను. వీధులలో కలకలము వినవచ్చెను. ఏవంకచూచినను కేకలిడువారును, చప్పటులు చరచువారును పరుగులిడువారునై జనులు కానవచ్చుచుండిరి.

“మదనమోహనుని కలిసికొనఁగలననుకొందును” అని సురేంద్రుఁడు పైకనెను

మదనమోహనుఁడు గవర్నమెంటు ప్లీడరు. ప్రాసిక్యూటింగు ఇనస్పెక్టరు. ఆయనకు ౪౦ ఏండ్లున్నవి. దృఢకాయుఁడు,ఆజానుబాహువు,పచ్చనికాంతిగల యందమైన శరీరము కలవాఁడు· అస్ఖలితబ్రహ్మచారి.అతనికి పుస్తకములనిన పరమానందము. ఆతనికి సాలునకు ౫౦౦౦ రూపాయిలువచ్చు ఆస్తికలదు. దానినంతయు నాతండు తిండికిని,పుస్తకములకును ఖర్చుపెట్టును. ఆతనియింటిలో ౨౦౦౦౦రూపాయీల విలువగలిగిన పుస్తకభాండాగారమున్నది. అందాతఁడు పగలెల్లను గడపుచుండెను. గవర్నమెంటువారి పనియున్న యొకటి రెండుగంటలు తప్ప ఎల్లవేళల

యందాతఁ డేదియో గ్రంథపఠనము చేయుచునే యుండును. రాత్రి యందు పదిరెండుగంటలవరకు గూడ చదువుచునే యుండును. అతఁడు మాట్లాడునపుడు కూడ ఆంగ్లకవిశ్రేష్ఠుల నుండియు, హిందవకవిశిఖామణులనుండియు నీతివాక్యముల నెత్తి చెప్పుచుండును. ఆతనికి కాళిదాసు భవభూతి, షేక్స్పియర్, వర్జిలు మొదలగు మహామహులయం దత్యంత భక్తి. ఎల్లపుడును వారినే స్మరింపుచు వారి కావ్యములలోని భాగముల నెత్తిచదువుకొని యానందింపుచుండును.

నవీనమోహనుఁడును తక్కినవారివలెనే మేల్కాంచి, దుస్తులను ధరించుకొనుచుండగా భటుఁడు "సురేంద్రనాథదత్తుగారు వాకిట నిలచియున్నార"ని యెఱింగించెను. లోనప్రవేశపెట్టుమని మోహనుఁడానతిచ్చెను. సురేంద్రుఁడు లోనికి వచ్చినంతనే "ఈగడచినరాత్రి యేమిజరిగెనో నీకు తెలియుననుకొనెద" ననెను. గొప్పవిపత్తు తటస్థించినది అని విషాదముతోఁ బలికెను. ఆతని కంఠధ్వనిచే వాని విచారమును సూచింపుచుండెను.

"ఏమిదత్తా! ఏమిసంభవించినది. ధైర్యమును వీడకుము"

"ఆపదలందు ధైర్యగుణము......సజ్జనాళికిన్" అనిభర్తృహరి నుడివియున్నాఁడు" అనిమోహనుఁడనెను.

"దుర్మార్గులెవరో యానందభవనమునంటించినారు!"

"నిజమే!"

"అంతియేకాదు. ధనపురంజమీందారుగారిని తుపాకితో కాల్చిరి. ఆకాల్పున కాతఁడు చనిపోయియే యుండునేమో!"

"హా!"

"నగారా వినఁబడుచుండుటలేదా! నేను అంటుకున్న స్థలమునకుఁ బోవుచున్నాను. నీతో చెప్పుటకైవచ్చి యుంటిని. నీవు తగిన చర్యను" తీసికొందువుగాక!

"సరే! ఆనుర్మార్గులను పట్టుకొనుటకై ప్రయత్నింతము; రమ్ము" అని మోహనుఁడనియె.

వారు చాందినీచౌకును సమీపించినప్పటికా ప్రదేశమంతయు పగటివలె జనసమ్మర్దమైయుండెను. పాటలీపుర ప్రజలకు సాహసము మెండు; వారు కొంచెమాపద సంఘటిల్లినదని వినినచో నూరకుండఁ జాలరు. ఈవిచారకరవార్త తెలిసినంతనే వారందఱును చాందినీచౌకు లో మూగసాగిరి. ప్రప్రథమమున వారీవర్తమానము నమ్మరైరి. డాక్టరుగారి గుఱ్ఱపుబండియు, దానివెనుక హయారూఢుఁడగు రైతును వారిని దాటి తొందరగ నానందభవనము వంక కరుగుట చూచినంత నే వారికి నమ్మకము కలైను. వెంటనే వారెల్లరును ఆనందమార్గము ను బట్టి పోవఁదొడంగిరి. ఇంతలో నగ్నివార్పు యంత్రమును, దానిని నడపు మనుష్యులునుకూడ, నచ్చటికివచ్చిరి. " అందఱును వచ్చిరా'' యని వారిలో ముఖ్యుఁడగువానిఁ బిలిచి మేయరడిగెను. ''ఒకరిద్దఱు తక్కువగా నందఱును వచ్చిరి. జమీందారుగారి పేరు వినిన నెవరు రా కుందురని వాఁడు ప్రత్యుత్తరమిచ్చెను. "సరియే మీరెల్లరు నచటికి నేగుఁడు. నేను నవీనమోహనుగారిని గలిసి మేజస్ట్రీటుగారిని తీసికొని మిమ్ము దారిలో కలసికొందు"నని బండిని మేజస్ట్రీటుగారింటివైపునకు మరలించెను; మేజస్ట్రీటు రాధాకాంతముఖర్జగారు, వీరివైపునకేవచ్చు చుండిరి; వారిదివరకే యీసంగతిని వినియుండుటచే వారు చాందినీ చౌకునకే వచ్చిరి.

ఆయన నవీనమోహనునివలె కాదు; కేవలమును స్వలాభపరా యణుఁడు. గర్విష్ఠి. అతనికి 30 ఏండ్లు దాటవచ్చుచున్నవి. ఇంతవఱకాతం డెప్పుడును నవ్వినట్లుగాని సంతోషముతో మాటాడినట్లుగాని లేదు. అతండందఱికన్న నెక్కుడువాఁడని గర్వపడుచుండెను. నిజముగ నా యూరిలోని యధికారులలో నాతండెక్కుడువాఁడే. అతనికీయూరిలో

తగినంత పని లేదని విసుగుకొనుచుండును; ఆతఁడేదైన గొప్ప కేసు వచ్చినా, పేరు పైకి వచ్చినా ; ఘనుఁడనని పించుకొందునాయని సర్వకాలములయందు చింతించుచుండును ; అందుచే నాతఁడు రాజకీయవిషయములలో పాల్గొనుచుండును ; ఈ కాలమున కూడ నే రావుసాహేబు బిరుదమునో, యేదివాను బహదూరు బిరుదమునో యభిలషించి ర తనమువారి మెప్పువడయుటకై తమ కాలము నెల్ల వెచ్చబుచ్చువారల ననేకులను చూచుచున్నాము; అట్టివారిలో నీతఁడొకఁడని చెప్పవచ్చును; అతఁడీమధ్య కలకత్తాలోని యొక గొప్పజమీందారుగారి బావు గురాలొక పిల్లను వివాహమాడ నుద్యమించుచుండెను; ఆజమీందారు గొప్పవాఁడు; రాజకీయవేత్త, ఆయనకు గొప్పబిరుదులు కలవు. అట్టివారి ప్రాపు దొరకినచో తనకుకూడ మేలు కలుగవచ్చునని యాతఁ డెంచుచుండెను ; సురేంద్రుఁ డాతనికేదో చెప్పఁబోవుచుండెను, అంతలో ముఖర్జీగారు "మీరు చెప్పనక్కరలేదు" నేనదివఱకే వినియున్నాను. ఆపల్లెటూరివానిని ప్రశ్నించి సర్వమును తెలిసికొనియున్నానని పల్కెను. నవీనమోహనుని దిక్కుఁజూచుచు "మనము శీఘ్రముగ నాస్థలమున కేగవలె ననుకొందు" ననెను.

"నేను నదియే చెప్పవలెననుకొనుచున్నాను" అని నవీనమోహనుఁ డనెను.

"రక్షకభటులకుకూడ కబురు పంపవలెను"

"సురేంద్రనాథుఁడిప్పుడే వర్తమానము చేసియున్నాఁడు"

"చంపుటకే ప్రయత్నములు సలుపఁబడినట్లు తోచుచున్నది"

"నిశ్చయముగా నంతియే"

"అయినచో మనమందఱముకలసి పనిచేయవలసియున్నది. నేను విచారణావిషయముం జూచుచుండెదను. మీరు వానిని పరీక్షసేయుఁడు; నవీనుఁడు చిఱునవ్వు నవ్వెను.

"మనమిఁక పోవుదము. నాబండి సిద్ధముగానున్నది" అని సురేంద్రుఁడనెను.



## ౨వ ప్రకరణము

### పరశురామప్రీతి

అడ్డుత్రోవను పోయినచో నానందభవనము ఊరికొక మైలు దూరములోనుండెను; కాని, రాజబాటనుపోయిన నొకక్రోశముండును; అది జమీందారుగారు నివాసమున్న పట్టణమున కొకింత దూరము లోనున్న మధుపురములో విలాసార్థముకట్టఁబడినది; మనము పైప్రకరణములో చెప్పిన యధికారత్రయము రాజబాటను తమశకటమును తోలుకొనిపోవుచుండెను. కొలఁదిదూరములో నేయంత్రములరెంటిని నడపించుకొనుచు నడ్డుత్రోవను పోవనుద్యమించుచున్న పురజనులను వారు సమీపించిరి; వారిలో కొందఱు వెలిగించుటకై కాగడలను కొందఱు, నిచ్చెనలను కొందఱు వలయుపనిముట్లను పట్టుకొనిపోవుచుండిరి.

"నడుపుఁడు, నడుపుఁడు" అనిసురేంద్రుఁడు సహజమైన దయార్ద్ర హృదయముతో హెచ్చరించెను; వారిగుఱ్ఱము దౌడు తీయుచుండెను; మరికొంత సాగకనే గుఱ్ఱపురౌతొకండెదురయ్యెను. ఆగుమని నవీనమోహనుఁడు కేకవైన నాతండు గుఱ్ఱమును నిలిపెను.

"నీవానందభవనమునుండివచ్చుచుంటివా?" యనిసురేంద్రుఁడు పృచ్ఛచేసెను.

"అగును"

"జమీందారుగారెట్లున్నారు?"

"ఇప్పుడే ఆయనకు స్పృహవచ్చినది"

"డాక్టరేమనుచున్నాఁడు"

"బ్రదుకవచ్చుననుచున్నాఁడు. నేను కొన్ని మందులను తెచ్చుటకై యంగడికి పోవుచున్నాను. ముఖ్రీగారు సంభాషణను బాగుగా వినుటకై బాడిలోనుండి తొంగిచూచుచుండిరి."

"ఎవరినైన ననుమానించుచున్నారా?" అని యాయన యడిగెను.

"లేదు"

"మంట లెట్లున్నవి?"

"నీరు కాలవలసినంత కలదు. కాని వానికి యంత్రములు లేవు. యంత్రసాహాయ్యము లేనిది, అంతగొప్ప మంట నెట్లార్పఁగలరు? గాలికూడ నెక్కువగా వీచుచున్నది. దైవకృప యెట్లున్నదో తెలియరాదనుచు నా బాటసారి తనగుఱ్ఱమునదల్చెను. సురేంద్రుఁడును నడగనిబోలెను నదల్చెను. కాని యాతురంగ మిదివరలో నట్టిప్రహారముల ననుభవింపని కారణమున ప్రక్కలకు లాగఁదొడంగెను. ఆతనికి విసుపుజనించి కొట్టుట మానెను. గుఱ్ఱమును బాగుగ నడువఁదొడంగెను.

సన్మార్గులును, సచ్ఛీలురును నగు జమీందారుగారికిని పతివ్రతా శిరోమణియు, దైవభక్తిపరాయణయు నగు వారి భార్యకు నెగ్గు చేయనుద్యమించుట మిగుల నప్రియముగా నున్నది. అనుచు గుణావగుణములను తనకు తెలిసినంతవఱకు సురేంద్రుఁడు వర్ణింపసాగెను.

ధనపురముజమీందా రొక సుప్రసిద్ధమైన పురాతనకుటుంబములోనివాఁడు; షోడశవర్షప్రాయుఁడై యున్నపుడు దొరతనము వారి సేనలో నొక ముఖ్యోద్యోగస్థుని పదవిలోఁ బ్రవేశించి యనతికాలములో పేరెన్నిక గాంచిన యోధుఁడై వెలసెను. నలువదియారవయేట నొక చిన్న సేనకు నాయకుఁడై మరియొక గొప్పపదవిఁ బొందఁబోవుతరి నాతని తండ్రి గతించుటయు, నాతండాపదవిని పరిత్యజించి, పాటలీపుత్రములోఁ జేరి యానందభవనమున వసియింపుచుండెను,

కొన్ని సంవత్సరము లొంటరిగ వాసము చేసిన తరువాత నాథ ఏనముకు బాగుచేయించి, కలకత్తాపట్టణమున ధనికుఁడగు నొక జమీం దారుకుమార్తెను సవర్ణాన్యావతి యను మనోరమ యను నబల ను పరిణయ మయ్యెను. ఆమె పదునారేండ్ల బాలిక. ధనికుఁడైన వాని సుతయయ్యు స్త్రీ స్వాతంత్ర్యము గడపిన పురుషుని వివాహ మాడిన యనంతరమును మానవపుత్రెల్లవారికి వాత్సల్యము కలుగఁజే య్యును పేదవారికొసఁగుటచే యువ్వనేమి ధనాశచే లోఁబడినదనుకొనవ చ్చునుగాని యిట్టి ధనికురాలొక్కరి వివాహమాడ నొప్పుకొనెనా యని ముక్కున వ్రేలైచికొనని వారులేదుగాని సుగవానుగారి మధు పురమున లేక కొందఱామె వికారరూపము గలదియో, కుంటిదో, గ్రుడ్డిదో యని యనుమానింపఁ జొచ్చిరి కాని మనవాఁడామె మగని గృహప్రవేశము చేసినపు డెల్లరును పరమానందభరితులైరి.

ఆమె రూపము వర్ణనాతీతమై యుండెను. ఆమె పసిమి యూరువన్నె పసిఁడిచాయచే నొప్పారు శరీరలతయు, చంద్రబింబము ననుకరించు ముఖమును, పద్మరేకులను పరిహసించు నేత్రద్వయమును తుమ్మెద లపింఛముబోలు కేశభారమును, ఉన్నదో లేదో యను నొప్పునడుమును గలిగిన నొక నారీశిరోరత్నమై యుండెను. ఆమె నిజముగా నతని ప్రేమించినదా యనువారును, ముప్పదేండ్ల తారతమ్యముగల యీ దాంపత్యమేమి యనుకూలముగా నుండఁగలదను వారునై పాటలీపుత్రాంగ నలు బహువిధములఁ జెప్పుకొనుచుండిరి.

కాని వారిసంభాషణలోని విషయములెల్ల వమ్మయ్యెను. పెక్కుయోజనములవఱకు నామె సంసారసౌఖ్యమును, దయార్ద్రహృ దయమును, పతిభక్తియు మార్మ్రోయసాగెను. వారికి కాలక్రమమున నిరు వురు బాలికలు కల్గిరి. ఇదియే వారి సంసారము సుఖముగా నుండెననుట కుఁ దార్కాణము.

యనువారును, "పెట్టెలు, పెట్టె"లనువారును"వస్తువులనుమరచినారా" యనువారునునై పలుదెసల పలువురు పరువులిడుచుండిరి.

"సమయము మించినది. మంటలనార్పుటయు, భవనమును రక్షించుటయు, కష్టటమని తలంచెదను" అని ముఖర్జీ నుడివెను.

"ఎంతగొప్ప మేడ! ఎంతవిలువయగుసామానులు! అంతయు నశింపవలెనుగాబోలును. ఆహా! దైవఘటన" యనుచు సురేంద్రుఁడు బండినుండి నేలకురికి తగులఁబడుచున్న స్థలమునకు పరుగెత్తిపోయెను. అచటి సంక్షోభము వర్ణింపనలవికాదు కాని, మనమెల్లరము సాధారణముగాచూచుచుందుమదే.ఎచ్చోటనరసినను పెట్టెలు, పరుపులు, మంచములాదిగాగలసామానులు చిందరవందరగా పడియుండెను ఇంకను సామాను రక్షించుటకై పలువురు పరుగెత్తుచుండిరిగాని వేడిమికాగలేక వెనుకకు మరలుచుండిరి. ఆభవనము దుర్నిరీక్ష్యమై సమీపించుటకు వీలులేకుండెను. సురేంద్రనాథుని జూచినంతనే"మేయరుగారు వచ్చుచున్నా"రనివారెల్లరును నుడువసాగిరి.

"అగుచువచ్చితిని. స్నేహితులారా! కాలమును వృథాగా పాడుచేయకుఁడు.మనము సాధ్యమైనంతవఱకు సామానును తప్పింప బ్రయత్నింపవలెను. అందఱు వరుసగా నిలువఁబడుఁడు. నీరును తెండు!"

అని చెప్పుచుండగనే నిప్పునార్పుయంత్రములు సమీపించెను; అంత వారు మంటల నార్పఁ దొడంగిరి; సురేంద్రనాథుఁడు జమీందారుగారి క్షేమము నారయుటకు వెనుకకు తిరిగి యొకభటునిపిలచి "జమీందారుగారెక్కడ"ని యడిగెను.

"ఆగుడిసెలో నున్నారు. డాక్టరుగారు వారినటకుఁ దోడ్కొని పోయినా"రని వాఁడుచెప్పెను.

"మనమచటికిఁ బోయి వారి స్వస్థతనరయుదము రం"డని తన సహచరులతో సురేంద్రనాథదత్తనెను. వారా కుటీరమును సమీ

పించిరి. ఆపర్ణశాలలో నొకమూల దిండులకానుకొని జమీందారు కూర్చుండియుండెను. అతని వక్షస్థలము నుండి రక్తము స్రవించు చుండెను. వానికి సమీపమున నాలుగేండ్లు వయస్సుగల పిల్ల యొక చిన్న పరుపుమీఁద పరుండి యుండెను. ఆపిల్ల సమీపమున సెనిమిదేండ్ల బాలిక యొకర్తు కూర్చుండియుండెను. డాక్టరు రమేశచంద్రుఁడు చొక్కా చేతులను పైకిచుట్టుకొని వానిని పరీక్షించు చుండెను.

మనోరమయు నిశ్చలభావముతో తదేకధ్యానముతో భర్త నారయుచుండెను. ఆమె హస్తమున కాచపాత్రిలో నొక దీపము ప్రకాశింపుచుండెను; ఇంకొకమూల నిరువురు పరిచారికలు పైటచెంగులచే మొగములను కప్పుకొని వెక్కి వెక్కి యేడ్చుచుండిరి. సురేంద్రుఁడును పొరలి పొరలి వచ్చుదుఃఖము నాపుకొని లోనికివచ్చెను. జమీందారుఁ డాతనిఁ జూచినంతనే "అదిగో! మన సురేంద్రుఁడు వచ్చినాఁడు. మిత్రుఁడా! దగ్గరకురమ్ము; చూచితివా! ఈదినమెంతదుర్దినమో? ఇఁక నా రు బొగ్గులు తప్ప నొక పూరిపుడకయైన మిగులదు" అని విచారముతో ననెను.

"అవును; చాల విచారకరమైనసంగతియే; కాని మేమనుకొనినంతకష్టము సంభవింపలేదు. దైవకృపచే నీవు సురక్షితముగా నుండినందులకెంతయు సంతోషముగానున్నది."

"ఏమియు నిశ్చయములేదు; నాకిపుడు చాల బాధగా నున్నది." మనోరమ దేహము కంపించెను. గద్గదస్వరముతో "నాథా! నాథా!" యని పిలిచెను.

"సఖి! నేను ధైర్యమును విడనాడితిని; క్షమియింపుము." అని జమీందారుఁడనెను.

ఇంతలో నాతని గాయములనుండి రక్తము స్రవింపసాగెను.

ఆలో ననేకసారులు చిన్నగుండ్లే ప్రాణాపాయము కలిగించుట చూచి నాను." అని యింక నేదో చెప్పఁబోవుచుండగా ముఖర్జి,

"డాక్టరుగారూ! ఇక్కడ నేరము జరగినందున వచ్చినాను. దోషిని కన్గొని శిక్షించుట మన విధి. కనుక మీసాహాయ్యమును దొరతనమువారి పేరిట నపేక్షింపుచున్నాను." అని వానిమాటల కడ్డముగ తాను మాట్లాడెను.

---

## ౩ వ ప్రకరణము.

(రోగి.)

డాక్టరునకు లోన నసిష్టముగానున్నను నీసమయములో వేఱు మార్గములేదు. అట్టి తరుణములో ముఖర్జి "అయ్యా! నేను రోగితో కొన్ని విషయములను ముచ్చటింపవలసి యున్నది. వీలగునా?" యని ప్రశ్నింప,

"నిజస్థితిని బట్టి విచారించినచో నతనిని మాట్లాడించుట కియ్యది తగిన యదను కాదు. ఆతఁడీవఱకే చాలశ్రమపడి యున్నాఁడు. అత్యావశ్యకమైనచో—"అనియేమో చెప్పఁబోవుచుండగా,

"మాట్లాడింపక తప్ప"దని ముఖర్జి నుడివెను.

"అట్లయినచో త్వరితముగా కానిండు. ఇంక నసతికాలములో జ్వరము ప్రవేశింపఁగలదని రమేసుఁడనెను.

నవీనమోహానునకిది చాల కష్టముగా నుండెను. ఆతెండు ముఖర్జీని వారింపఁజూచుచు, "ముఖర్జీ! వ-"అనుచుండగ నే మెడ్కాఫ్ రోగిశయ్యప్రక్కకిరిగి,

"అయ్యా! మీకు నాతో కొంచెము మాట్లాడుటకు శక్తి కల దా" యనియెను.

"ఆహా! ఉన్నది."

"అట్లయినచో నిన్నరాత్రి జరిగిన సంగతి సాధ్యమైనంత వఱకు విశదముగా తెలపిందు."

డాక్టరును భార్యయు లేవదీయగా జమీందారు దిండున ఆనుకొని కూర్చుండి యీరీతిగా చెప్పఁదొడంగెను.

"నాకు తెలిసినది మీకేమియు లాభింపఁ జాల దనుకొనెదను. రాత్రి సుమారు పదునొకండు గంట లప్పుడు నాగదిలోని దీప మా ర్పుకొని పరుంటిని. కొంచెముసేపైన పిదప కిటికీతలుపుమీఁద మెరపు మెరసినట్లొక కాంతి ప్రసరించెను. నేను నిద్రలో లేనుగాని స్వప్నావస్థ యందుంటిని. ఆకాంతి చూచినంతనే యాశ్చర్యభయసంభ్రమము లొక్కమారు నన్నావేశించెను. లేవ లేదుగాని, యియ్యది దేమై యుండు నాయని నాలో నేను వితర్కించుకొనుచుండగా గోడలు కూలిన ట్లొక గొప్పధ్వని వినంబడెను. తటాలున పరుపునుండి క్రిందకు దుమికి నంతనే యిండ్లంటుకొనినట్లు మంటలు కనఁబడెను. పొడ్డిలో వేయి గజముల మెండుకట్టెలున్న సంగతి స్ఫురణకు వచ్చుటయుఁ దత్క్షణమే పెరటిలోనికి పరుగెత్తితిని; అపుడు నాకు కల్గిన యాశ్చర్యమేమని వ ర్ణింతును! తలుపు తెరచుటకైన నశక్తుఁడనై యుంటిని. కాని, మొట్లో ప్రయత్నము మీఁద తీయఁగల్గితిని. గుమ్మము దిగుచుండగనే పక్క లో "చురుక్కు" మని నొప్పియు, వెంటనే తుపాకిని కాల్చినట్లు ధ్వని యు వినవచ్చెను." అని చెప్పుచుండగ మాటల కడ్డము తగిలి,

"మీరు చెప్పునది స్పష్టముగానే యున్నది. కాని మీరు తలు పు తెరచిన తత్క్షణమే దెబ్బతగిలినదా" అని ముఖర్జీయడిగెను.

"అగును"

"అట్లయిన నాదుర్మార్గుఁడెవఁడో మీకొఱకా సమీపమునసే పొంచియుండవలెను. మీరు మాటలను చూచినంతనే యీవలకు వత్తురనియు, వచ్చిన వెంటనే చంపవలెననియు నూహించి యుండును"

"నాయభిప్రాయము నదియే."

మేజస్ట్రీటు నవీనమోహనుని దిక్కైయి "అట్లయిన మనకు ముఖ్యవిషయము హత్య; దానికి సాహాయ్యము చేయుటకు కల్పింపఁబడినది మాట; దీనిమూలమున తన కార్యము నిర్వహించు కొనుటకై వాఁడు సంకల్పించి యుండును." అని జమీందారుతో "అయ్యా! మీరు చెప్పుఁడు."

"నన్ను తుపాకితో కాల్చిరని గ్రహించినవెంటనే గుండు వచ్చిన వైపు పరుగిడ మొదలిడితిని. కాని రెండడుగులైన వేయకుండగనే మెడమీఁదను భుజముమీఁదను మరల దెబ్బలు తగిలెను. ఈదెబ్బలు మొదటివాని కంటె గాఢముగ తగులుటచే నాకు తలతిరిగి చేష్టలుడిగి నేలమీఁద బడితిని."

"అయితే మీరా ద్రోహిని జూడలేదా?"

"నేను పడుచుండగా నెవ్వఁడో కట్టెలగుట్ట వెనుక నుండి పరుగెత్తికొని పోయినట్లు నాకుఁ గనిపించెను."

"మీరు వానిని గుర్తింపఁగలరా?"

"గుర్తింపలేను."

"మీరు వాఁడేదుస్తులు ధరించియుండెనో చెప్పఁగలరా?"

"చెప్పలేను. నాకండ్లు పచ్చబడినవి. నాకేదోనీడ పరుగెత్తిపోయినట్లు మాత్రము కనిపించినది."

రాధాకాంతుఁడు నిరాసచే నిట్టూర్పు విడచెను.

"సరే కానియ్యండి. వానిని పట్టుకొన ప్రయత్నింతము."

"ఇంక నేనేమియు చెప్పఁజాలను; నేను స్పృహ తప్పి పడిపోతి

ని.మరల కొంతసేపటికి స్పృహ వచ్చినప్పటి కిచ్చట పరుపుపై పరుండి యుంటిని"

రాధాకాంతముఖర్జి యీవిషయములను పొల్లుపోకుండగ తన పుస్తకములో వ్రాసికొనెను. అది పూర్తియయిన తరువాత, "నీక మనము వివరములను తెలిసికొనవలెను. నీవు పడిపోయిన తరువాత నిచటికి వచ్చులోపుగా జరగిన సంగతులను తెలిసికొనుట యత్యావశ్యకము. ఆవిషయములను చెప్పఁగలవారెవరైనఁగలరా!"

"నాభార్య చెప్పఁగలదండీ;"

అనంతసేన్ ముఖర్జి మనోరమవైపు చూచెను. ఆమె ధరియించిన వస్త్రములను బట్టి పరదాలో నుండి యొకస్త్రీకముగ మేలుకొనిన దానివలెఁ గన్పట్టలేను. "ఊఁహూ" అని యూతఁడు తలయూచెను.

"ఈ శయ్యాం బవళింపు చున్న యీచిన్నకూఁతున కాటలమ్మ చూపి చాలబాధ పడుచున్నది ; అందుచే రాత్రియంతయు నాభార్య దానిని కనిపెట్టి యున్నది ; ఆమెగది యగ్నిహోత్రము పుట్టిన దాని కావలి భాగమున నుండుటచే నామె కేమియు కన్పింపఁజాలదు," అనెను; జమీందారు,

"అట్లయిన నామెకీసంగతి యెట్లు తెలిసెను?"

తన నడుగకుండగనే మనోరమ ముందునకు వచ్చి "నాపతి చెప్పినట్లు నేను రాత్రి నాచిన్న కుమార్తెను కనిపెట్టికొని యుంటిని. నేను చాలసేపు మేల్కాంచి యుండుటచే డస్సి కొంచెము కునికిపాట్లను పడుచుండగా నొక విపరీతమైన ధ్వని వినంబడుటచే మేల్కాంచితిని. ఇంతలోననె రెండవమారు కూడ నారీతి ధ్వనియే వినంబడుటయు నాకు భయము, నాశ్చర్యమును కలిగెను;అప్పటి కప్పుడే మంటలు చాలవరకు వ్యాపించుటచే నది పట్టపగలువలె కాంతివంతమై

యుండెను! నేను త్వరగా మెట్లుదిగిపోవ నైదారు గజముల దూరము లోఁ బడియున్న నాయుగని దేహము గన నయ్యెను; నే నాయన మీఁద పడి యేడ్చితిని; కాని, ఆయన నాయేడ్పు వినలేదు కదలనైన లేదు; నేనాయన చనిపోయె నేమోయని యెంచి సాహాయ్యమునకై కేకలు వెట్టితిని."

"మంచి పని చేసినా"రని. ముఖ్య.

"చాలసేపు వరకిట్లే నేనొంటిగ నాతండ్రిమీఁద బడియేడ్చుచుంటి ని; కొంత కాలమునకు పొలము కాపులు కొందఱు మాటలను జూచి పరుగెత్తికొని వచ్చి, నన్నుఁ జూచి యీతని శరీర మచట నుండి యొక సురక్షితమైన స్థలమునఁ జేర్చిరి. గాలి యనుకూలముగ వీచు చుండుటచే మంట వ్యాప్తి గాలేదు; ధాన్యపు గాదులును; పసుల కొట్టములును నుండునుండుటయేగాక మేము నివసించుచున్న మేడయు పలుతావుల నుండ దగులుకొనెను; నాకష్టము నుతియే లేదు. అందుచే పిల్లలమూట నురచి పోతిని. నాయన్న గదికికూడ నిప్పు తగుల్కొనెను. అపుడెవఁడో ధైర్యశాలి యొకండు నాయిద్దరు బాలికలను రక్షించి పుణ్యము గట్టుకొనెను; రమేశచంద్రుఁడుగారు వచ్చి నన్నోదార్చుటకు దయతో ప్రయత్నించుచుండగా కొంత కాలమునకు నాకు మరల స్పృహ వచ్చెను. అంత దనుక నీలోకమునే యెఱుఁగను; ఈ యగ్ని మాసర్వమును నాశనము చేయునను కొనెనను గాని పరమేశ్వరు నికృపవలన నాభర్త యారోగ్యవంతుఁడుగా నుండిన నంతియే చాలును"

ఇంతవరకును రమేశుఁ డీయనవసర ప్రసంగములనుఁ జూచి విసువుచెందెను. అందుచేత నతం డా సమీపమునగల యొక బల్లమీఁద జమీందారుని శరీరము నుండి తీసిన చిన్న చిన్న ఱల్లను వరు

సగాఁ బెట్టి చూచుచుండెను. మనోరమ తన యాఖరు వాక్యమును ముగింపగనే తన యాసనము నుండి లేచి నిలువఁబడి మేజస్ట్రేటు వంక తిరిగి,

“ఇంక రోగిని వదలెద రనుకొందునా” నని ఖండితముగాఁ బల్కెను.

రాధాకాంతముఖర్జి యాగ్రహపరవశుఁడు కాలేదు. అతనికి రోగిని వీలయినంతత్వరగా వదలుట యత్యావశ్యకమని తెలియును; అందుచే మొగము చిట్లించుకొని,

“అయ్యా! మీపని ముఖ్యమైనదని నాకు తెలియును; కాని నాపని దానికంటెను ముఖ్యమనుట నిశ్చయము”

“ఓ”

“ఆకారణమున నింక నాల్గు నిమిషములు వ్యవధినీయ వేడెదను.

“నాలుగు కాకపోయిన పది తీసికొనుఁడు; కాని యాలస్యము చేత నమృతము విషమగుననుట మనము కాలము వెచ్చబుచ్చ కూడదు. ఆలస్యమైనచో రోగి బ్రతుకఁ జాలఁడని తెలిసికొందురు గాక.

వారొకరి నొకరు ద్వేషభావములతో చూచుకొనుచుండిరి; అట్టి సమయములో నిజముగ తగవులాడరు గాని, అట్లు చేయుదురేమో యన్నట్లుండిరి. మనోరమయు నిది గ్రహించి వారిని వారింపనుద్దేశముతో నేదియో చెప్పఁబోవుచుండెను. ఆమె ప్రయత్నములు నిష్ఫలములై యుండును గాని యంతలో సురేంద్రనాథుఁడును, నవీనుఁడును వారినిరువురను పిలుచుచు లోనికేతెంచిరి. అంత రమేశ ముఖర్జీలు వారి వైపునకు తమ దృష్టుల ప్రసారించిరి; ముఖర్జీ నిజకార్యమును పరిత్యజింప నిచ్ఛలేనివాఁడై రోగి నుద్దేశించి,

“అయ్యా! మిమ్ముల నింకొక ప్రశ్న యే యడుగవలసియున్నది. నేరము జరిగినపుడు మీరెటు లేస్థలమునందుండిరో చెప్పఁగలరా? హాంతి

కుఁ డెచ్చట నుండియుండునని తలంతురో చెప్పఁగలరా ? జమీందా రును మిగుల కష్టముతో,

"నేనిదివరలో చెప్పినట్లు గుమ్మముదగ్గర దొడ్డివైపునకుతిరిగి నిలువఁబడియుంటిని. నేరస్థుఁడు నాకుడిచేతివైపున నిరువదిగజములదూరములోనుండిన కట్టెలగుట్టలచాటునుండియుండవచ్చును."

ముఖర్జియు నీయుత్తరములను జాగరూకుఁడయివ్రాసికొని డాక్టరుతో 'అయ్యా! మీమాటలువిన్నారుగదా! గాయములను పరికించి ద్రోహియెంతదూరమునసునుండియుండునో చెప్పఁగలరా?"

రమేశుఁడును నిందాగర్భముగ "నేను సోదెలుచెప్పువాఁడనుకా" నని ప్రత్యుత్తరమిచ్చెను.

"డాక్టరుగారూ! నేనుదొరతనమువారిపేరట మీసాహాయ్యము నపేక్షించుచున్నాను. అట్లుచేయుట మీవిధి. లేనిచో మీపై తగినచర్యతీసికొనవలసివచ్చునని భయపడుచున్నాను. మీశాస్త్రమునను సరించి యీప్రశ్నకు సమాధానము నీయవచ్చును." అని ముఖర్జి కోపముతోపల్కెను. రమేశుఁడును హేళనతో చిరునవ్వునవ్వుచు,

ఆహా! మావైద్యశాస్త్రమునకు యింతగతిపట్టినదా, నేను Devergie Orfila Casper Tardiew. మొదలగు మహామహులగ్రంథములను పెక్కుమారులు చదివితిఁ గాని యెవ్వఁడును తానిట్టిప్రశ్నకు తగుసమాధానమునీయఁగలుదునని వ్రాయసాహసింపలేదు; ఈవిషయము చాలముఖ్యమైనది. చావుబ్రదుకులపై నాధారపడియున్నది. న్యాయశాస్త్రప్రవీణులు వేయు విషమప్రశ్నలకిట్టితరుణమున సరియగుసమాధానము లీయనసమర్థుఁడనని మనవిసేయుచున్నాను. అని యెను.

అతఁడు చెప్పినది నిజమే. ఎంతటివానికైన నా కార్యము దుస్సాధ్యమే. ఆ కారణమున ముఖర్జీ మారువలుకఁజాలకుండెను. విన్నబోయిన ముఖముతో "అయ్యా! మిమ్ములనిప్పుడు భోగట్టాకొరకై యడుగుచున్నాను. తరువాత మీరు బాగుగ నాలోచించి వ్రాసి యీయవచ్చును" అని పల్కెను.

"అట్లయినచో సరియే" అని రమేశుఁడు కండ్లజోడును చేరుమాలుతో తుడిచికొని మరల ధరించి "నేను గ్రహింపఁజాలినంతవరకు జమీందారుగారు చెప్పినది సరియని తలంచెదను. ఈ గాయములను పరికించినచో మొదటిసారి తుపాకి దగ్గరనుండియు, రెండవది దూరమునుండియు ప్రయోగింపఁబడినట్లు తోచుచున్నది. దగ్గరనుండి ప్రయోగించినచో" అని యేదియో చెప్పఁబోవుచుండగనే సురేంద్రుఁడు "గుండు ఎంత దూరము పోవునో తెలిసికొనవచ్చును గదా" యనియెను.

రమేశుఁడు "చిత్తము. నాకు తెలియదు లెండి. మీబోంట్లు తలంచినట్లుగ నీ కార్యము సులభసాధ్యము కాదు. అందునను, వివిధముల గుతుపాకులువచ్చుచున్న యీ కాలమున నేదియు నిర్ధారణచేయుటకు వీలు లేదని మనవిచేయుచున్నాను."

ఇంతలో బయట నేదియో గొప్ప కలకలము వినవాయెను. అందఱు నాధ్వనికి కారణమరయుటకై వీధిలోనికి పరుగెత్తిరి. రమేశుఁడు మాత్రము నిశ్చలముగ తన పనిముట్లను శుభ్రము గావించుకొనుచుండెను. ఒక మేడ వీధిలో కూలబడినట్లును, దానిక్రిందపడి యిరువురు మృతినొందినట్లును, తెలియవచ్చెను. జమీందారుఁడు వార్త విని విచారించెను. పురజనులాగ్రహావేశులై "నేరస్థుఁడు పట్టుపడినచో చంపుదము. సరకుద"మని యరచుచుండిరి. సురేంద్రుఁ డుత్సాహముతో వారలనుద్దేశించి "మిత్రులారా! చూచితిరా యెంతటిఘోరకార్యము జరిగినదో? మనమీదుష్టునెట్లయిన పట్టుకొని తగుశిక్షచేయింపవలెను. కావున

మీరందరును తగినసాయము చేయుదురుగాక యని ప్రార్థించెదను. మీలోకొందరైన నించుక తెలిసినవా రుండవచ్చును. వారుతమకు తెలిసినంతవరకు చెప్పినచో నపరాధిని బయటికిదీయవచ్చును. కనుక దయచేసి వెలువక మీరందరు నీకార్యమునకు తోడ్పడుదురుగాక" యని యుపన్యసించెను. అపుడచటివారిలో గుసగుసలు బయలువెడలెను. అందులోనొకడు బిగ్గరగా నిచట నాసంగతులెఱింగినవాడొకడున్నాడని పల్కెను.

"ఎవరువారు"

"శివసింగు అతడు మొదటినుండియు నచ్చటనేయుండెను. అతడే పిల్లలను చావునుండిరక్షించినవాడు"

"ఏడీ? ఎక్కడనున్నాడు?" "శివసింగ్ శివసింగ" అను కేకలు నలుదిక్కులనుండి బయలువెడలెను.

ఆనందభవనముదగ్గిర చేరిన యీపల్లెవారికీసమయమందు కలిగిన యాగ్రహమును వారుచేయుగోలయు వర్ణింపశక్యముకాదు. పట్టణములందు నివసించువారికి చోరభయముండదు. వారిగృహములను విత్తమును రక్షించుటకు పోలీసువారుందురు. అగ్నిభయమును చాలతక్కువ. కొంచెముగా నగ్నిహోత్రిస్పర్శ తగిలినంతనే పలువురుసాహాయ్యముచేయుటకు రాగలుందురు. జనాకీర్ణమగుతావులందు పరస్పరసాహాయ్యమున కేమిలోటు? అదియుగాక నిప్పునార్పుయంత్రములుండును. కాని మధుపుర మొకచిన్నపల్లె. అందుగృహములుచాలతక్కువ. దూరముదూరముగ కట్టబడియున్నవి. కాపులకు పూరిగుడిసెలు మాత్రమేకలవు. ఆనందభవనముతక్క! నాగ్రామమందు పెంకుటిండ్లేలేవు. ఆకారణమున నగ్నిప్రజ్వరిల్లినచో సాహాయ్యమువచ్చులోపలనే సర్వమును పావకునకాహుతి కావలసియుండును. కాని పల్లెటూళ్లలో

ప్రేమయు, పరస్పరసాహాయ్యమును, సానుభూతియు, వరలుచుండును. పట్టణములలో నొకరిజోలి నొకరికుండదు. పల్లెలలో నందరునుకలసి మెలసిపనిచేసుకొనుచుందురు. ఆకారణమున నాడుధనపురీశునకుజరిగిన యాపదవారికెల్లరకు విచారము గలుగజేసెను. సురేంద్రునియుపన్యాస మాగ్రహమునినుమడింపజేసెను. కావున, వారు నేరస్థునిగనుగొనుటకు చేతనయినంతవరకు పాటుపడనిశ్చయించుకొనిరి. శివసింగునకీసమాచారము తెలియునని వినినంతనే వారెల్లరు వాతని నన్వేషించి తీసికొనివచ్చిరి.

శివసింగెవ్వరు? ఆతనిచరిత్ర చిత్రమైనది. ఆతనినెఱుంగనివారా గ్రామమున లేరు. సామాన్యులే పల్లెటూరులో నెల్లరకు తెలిసియుండగా, నేదేనియసామాన్యవర్తన కలవారిమాట వేరుచెప్పవలెనా! శివసింగున కాకలిగా నున్నప్పు డన్నముపెట్టుటయందును, ఆదరించుటయందును వారికి చాలయిష్టము.

శివసింగు మూర్ఖుఁడు, వానిచరిత్ర యించుక ముచ్చటింపవలసియున్నది. ఇరువదివత్సరములకు పూర్వము మధుపురమునకు సమీపమున నొకధనికుఁడు భవననిర్మాణసందర్భమున పెక్కురుపనివాండ్రను నియోగించెను. వారిలో స్ఫురద్రూపియగు పనివాఁడొకఁడు తద్గ్రామవాసియగు నొకపనికత్తెను మోహించి యామెతో నించుక కాలము సుఖింప నామెగర్భవతియయ్యెను. వాఁడామెను త్యజించి ప్రచ్ఛన్నముగ నొకనాటిరాత్రి పలాయనుఁ డయ్యెను. అప్పటినుండియు నామెకాతనిజాడ తెలియలేదు, ఆమె దుస్సాంగత్యముచే గర్భము ధరించిన వార్తతెలసి యజమానులామెను కొలువునుండి తప్పించిరి; ఆమెజన నీజనకులును దుర్మార్గవర్తనయగు తమకూతునింటనుంచుకొన్నచో తమకుకూడ యుదరపోషణము కష్టమగునని యెంచి యామెను వెడలనడపిరి; ఆయనుమానమును దుఃఖమును భరింపలేక యాపడుచు తన

యూరువిడచి పాటలీపుత్రమును ప్రవేశించి బిచ్చమెత్తికొని జీవించుచుండెను; ఆయూరితుంటరిబాలు రామెను పరిహసించి, తిట్టుచు, కొన్నిసమయములందు కొట్టుచు పలుబాములబెట్టుచుండిరి; ఆమె యిట్లు దుర్భరముగ జీవనమునడుపుచు నొకనాటి వేకువజామున మగశిశువుంగాంచెను; ఆమెపాట్లుజూచి జాలినొంది గ్రామవాసు లామెకుమారునికై పాతగుడ్డలును, నూనెయు, తిండికి బియ్యము నొసంగి యాదరింపుచుండిరి; ఆమె కొంతకాలమునకు రోగగ్రస్తయై కృశించి దిక్కులేని యాపాపని వీడి ప్రాణములను వదలెను.

మరునాడు వేకువజామున పొలమునకేగుచు రైతులు కొందరా పిల్లవానింగాంచి, జాలిగొని పెంచుచుండిరి; పదియేండ్ల ప్రాయమువచ్చినంతనే వానిని పసులకాపరిగనియోగించి, వానిని పోషించిన రైతు, వానివలన పనులగొనుచుండెను. కాని, వాడందులకైనతగినవాడుగనుండలేదు. వెఱ్ఱిచూపులజూచుచు, బుద్ధిలేక, మతిభ్రమణముకలిగియుండి, యెవరైన పలుకరించిన, నత్తితోనొకించుక మాటలాడును. అతనిపేరడిగినచో కష్టముతో తనతల్లిపేరు"శివ...శివ..."యనిచెప్పుచుండుటచే వానినాయూరివారందరును; "శివసిం" గ నిపిలువదొడంగిరి.

ఇంచుకవయసు వచ్చినవాడయ్యునేకార్యమునకును పనికిరాకుండుటచే నాతని నారైతు తనగృహమునుండి వెడలగొట్టెను. అప్పటినుండియు నాతడు దిమ్మరియై గ్రామమువెంట సంచరించుచుండెను.

ఈసమయమున డాక్టరు రమేశచంద్రుడాతని జూచెను. అందరు వైద్యులవలె నాతండును దిక్కులేని వీనిపై తనప్రజ్ఞజూపి మందుల నొసంగి బాగుపడునేమో చూడదలంచెను. వానిని తనయింటికి దీసికొనిపోయి, అన్నవస్త్రములిచ్చి పోషించుచు ననేకవిధములగు మందులనొసంగి యాతని నారోగ్యవంతుని చేయుటకు ప్రయత్నించుచుండెను. ఈతనినెట్లయిన బాగుచేసినచో తనయశ మినుమడించుననితలం

చెను. ఒకటి రెండు సంవత్సరములాతనికి చికిత్సలుగావించినను వానికి లాభము లేకపోయెను. కాని శివసింగు పూర్వముకంటె నించుకస్పష్టముగ మాటలాడగల్గెను. ఇంతకు మించినసుగుణము లెవ్వియు గనంబడకుండుటచే నాతని యందిట్టి వైద్యము నిరుపయోగమని తలంచి రమేశుఁడాతని వదలివైచెను. శివసింగును, మరల దేశమునాశ్రయింపవలసిన వాఁడయ్యెను.

ఒకనాఁ డీతని చరిత్రమును రాతను వినినమనోరమ యాతనింబిలువనంపి, దయార్ద్రహృదయముతో నాతని కాహారాదికములనిచ్చి పోషించుటకియ్యకొనెను. అప్పటినుండియు శివసింగు నాథవనమునందే వసియించుచు, మనోరమను తల్లివలె జూచుకొనుచు, విశ్వాసపాత్రుఁడై, యుండెను. కాని తిరుగుట కలవడిన వాఁడగుటచే శివసింగు వర్ష కాలమున తక్క మిగిలిన కాలములందు సంచారము చేయుచు నరణ్యములందు కాయకసరు, నేరికొని తినుచు కాలముగడుపుచుండెను. కొన్నిమాసములవరకు నాతండెవ్వరికిని కనఁబడకయే వర్తింపుచుండెను. ఆరణ్యజీవనమున నాతండు నాగరికతాలేశమైనను గానివాఁడై క్రూరమృగములవలె కొండగుహలయందును, వృక్షములమీఁదను వసియింపుచుండెను.

కొంత కాలము గడచునప్పటి కాతని యందొకమార్పు గల్గెను. పూర్వమువలె నిరంతరసంచారము గట్టిపెట్టి యింటియందే నివసింపుచు మనోరమ పిల్లలనెత్తికొని యాడించుచు, వాడు చిన్న చిన్న పనులను సేయుచుండెను. పరిచారకులతో గలసి వర్తించుట, తపాలాఫీసునకు పోయి జాబులు తెచ్చుట, పూఁదోటకు నీరెత్తుట మొదలగు పనులాతని కలవడెను. కాని గ్రామస్థులతో కలసియుండక, వేరుగా, నొంటరిగ వసియించుచు మనోరమపరిభృతులతో దప్ప నితరులతో మాటలాడనొల్లకుం

డెను. ఇట్లుండుటచే నాతండు వెఱ్ఱివాఁడు కాఁడనియు, పోకిరిపోతనియు కొందరు తలంచుచుండిరి.

"ఇదిగో శివసింగు. వచ్చినాఁ"డనుచు వారు కొంతపాటిగ నఱచిరి.

అందఱును దాఁటిపోనుండఁగ, పదునలుగురు మనుష్యు లాతని నలువంకలను పరివేష్టించి బలవంతముగ నీడ్చుకొనివచ్చి యధికారులముందు నిలువఁ బెట్టిరి. అతఁడే శివసింగు జీరాడుచున్న యాతని వస్త్రములును, వెల్లబాఱిన ముఖమును జూచినంతనే యాతని కచటికి వచ్చుట కిష్టము లేనట్లు స్ఫురింపకమానదు. శివసింగు బక్కపలచని పొడుగైన చామనచాయ శరీరముగలవాఁడు; గూనిపడుచును, మొద్దైన ముక్కును, కాయగాచిన కన్నొకటియు, చప్పిడిముక్కును, నెఱసిన మెండ్రికలును గల్గి యనాకారియగు నాతండు చూపరులకు వింతగఁ దోఁచుచుండెను.

"ఇతని నేమిచేయుద"మని కాపులు ప్రశ్నించిరి.

"అతనిని మాట్లాడింతు"మని మేజస్ట్రీటు పలికెను.

---

౮ వ ప్రకరణము.

భోగట్టా

మేజస్ట్రేటున కొంకింత యాశ గలుగఁజొచ్చెను. ఏవిధముగ నైన నీకేసులో జయముగాంచినచో తనకు గలుగఁబోవు లాభమునకు మేర లేదని యాతఁడెంచెను. తనకు గలుగబోవు గౌరవమును, దొరతనము వారొసంగుచు నేరావుబహదూర్ బిరుదమో, లేక యేదివానుబహదూరు బిరుదమునో సంస్మరించుకొనుచు, తనకధికారులప్రాపు చేత నున్నతపదవి గలుగవచ్చునని తలంచుకొనుచు తన యదృష్టదేవత కనేకవందనములొనరించుచుండెను; రమేశుండును నిశ్చలుఁడై యుండెను;

ఇంతలో శివసింగును వెంటగొని కాపులు లోనఁ బ్రవేశించుటయు జమీందారుఁ డాతనిగాంచి వాఁడెట్లు సాక్ష్యమీయఁ గలఁడు; యిచ్చిన ను వెఱ్ఱివాని సాక్ష్యము నెట్లు పాటింపనగునని యాలోచించుచుండెను. రమేశుఁడు పూర్వస్మృతిగల్గి, శివసింగు వసహ్యాభావముతో చూచు చుండెను.

"మీ రాతని సాక్ష్యము పుచ్చుకొనఁ దలంచుచుండిరా యేమి" యని రమేశుఁడు పృచ్ఛ చేయుటయు

"వలకూడదని" మేజస్ట్రేటు బదులు వల్కెను.

"అతఁడు వట్టిమూర్ఖుఁడు; పిచ్చివాఁడు; మతి స్థిరముగా లేనివారి సాక్ష్యములు పాటింపఁజనదని ధర్మశాస్త్రము చెప్పుటలేదా?"

ముఖర్జీ కోపముతో "అయ్యా! మీరూరకొనుఁడు. నా పని కంతరాయములు గల్గింపకుఁడు. నాకు సాహాయ్యము చేయుట మీ విధి."

'అయ్యా! కోపగింపకుఁడు. నా సాయ మపేక్షించుచున్నారు గనుక నేనీకార్యమునకు నాయసమ్మతిని దెలుపుచున్నాను. ఇన్ని కేసులు వచ్చినవి గాని, యొండైన న్యాయస్థానమున వెంగలి యగు వాని సాక్ష్యము గైకొని నేరారోపణ సేయుట తగదని తలంచెదరా? అట్టిదెన్నఁడైన చూచియున్నామా? వానిని ప్రశ్నింపఁదగదు. వాని వాఙ్మూలము నిరుపయోగము. న్యాయవాదియగు నవీనమోహనుఁడైన నాయుద్దేశము సరియని పలుకకమానఁడు.

నవీనమోహనుని యభిప్రాయము తనకు వ్యతిరేకముగ నుండఁ జాలదని రమేశుఁడు తలంచెను. కాని, యాతఁడు పొరబడెను. అందుచే నాతఁడు తన మాటను సమర్థించుకొనుటకై యిట్లు మాటలాడ సాగెను. "అయ్యా! మీకు చిక్కు రాఁగలదు. ఈ వెఱ్ఱివాఁ డెవరి పైననైన నిందారోపణము చేసినచో మీరేమి చేయఁగలరు. వాని మాటలను పాటించి శిక్షింపఁబోయెదరా?

అచటి కాపు లందరును వీరి సంభాషణముల నాలకించు చుండిరి. వారిలో కొందరు "శివసింగు మనమెల్లరము దలంచినట్లు వెఱ్ఱివాఁడు కాఁడు." అనిరి. కొందరు "వాఁడు తలంచినచో బాగుగ మాటలాడఁగలఁడు." అనిరి.

"ఏదియెట్లున్నను నాపిల్లలను రక్షించినందులకు వానికెంతయు కృతజ్ఞుఁడను, శివసింగూ! రమ్ము! నీ కేభయమును లేదు. రమ్ము" ని జమీందారు హెచ్చరించెను.

శివసిం గిదివఱలో ప్రజాసమూహముచే పీడింపఁబడినవాఁడగుటచేఁ జాల శంకించెను. జమీందారుని వాక్యములచే మరల నించుక ధైర్యమువహించి

" నా...కు...భ...య...ము...లేదు." అనిపల్కెను.

రమేశుఁడు మరల నాతని యనుమతిని ఖండితముగా తెలిపెను. జమీందారు నాతనితో నేకీభవించెను. మేజస్ట్రేటుమాత్రము వారితో సమ్మతింపలేదు. న్యాయశాస్త్రప్రకార మాతని కాతరుణములో నేమిచేయుటకైన నధికారముగలదు—అందుచే నాతఁడు—

"మీరెల్లరును నా కభ్యంతరములు చెప్పవలదు." అని శివసింగుతో "అబ్బాయీ! దగ్గరకురా. నేను చెప్పెడుమాటలను చక్కఁగ గ్రహింపుము. నీకేభయమును లేదు. నిన్నటిరేయి జరగిన సంగతులు నీకు తెలియునా?" అని పల్కెను.

శివసింగు "మంటలు" అని ప్రత్యుత్తరమిచ్చెను.

రాధాకాంతుఁడు "అగును. మీయజమానుని గృహమును, సర్వమును దహించివైచిన మంటలు. అంతియే కాక యిరువురు జానపదులును చనిపోయిరి. జమీందారుగారిని చంపుటకు ప్రయత్నములు సల్పఁబడినవి. ఆయన కాయమునుండి రక్తము స్రవించుచున్నది. చూచితివా! మీతల్లి మనోరమగారిని చూచుచున్నావుకదా!

శివసింగు వైఖరినిబట్టి యాతం డిది గ్రహించెనో లేదో తెలిసికొనుటకు వీలుగాలేదు.

"ఏమి యీమూర్ఖత! ఎంత తెలివితక్కువవని!,, యని రమే శుఁడు విసువుతో పల్కెను. ముఖర్జీ చాలకోపముతో

"రమేశా! ఇక్కడ నాకడ్డుమాటలను జెప్పకుము. నా యధి కారమును మర్యాదను నిలువబెట్టుకొనుటకు తగిన సామర్థ్యము నాకున్నది. అవసరము లేనిది నన్ను బాధపెట్టకుము. నాకు సాయము చేయుటయే నీవిధి. నాహితము నే నెఱుంగుదును. ఏటికి నూరక వ్యర్థ ప్రసంగములు చేసెదవు?,, అని మందలించెను. శివసింగును చూచి 'ఈ కార్యము లోక దుర్మార్గుఁడు చేసెను. వానిని నీవే చూచిన ట్లీమనుష్యులు చెప్పుచున్నారు. మేమాతనిని పట్టుకొని శిక్షింతుము. కనుక నీవు వానిపేరు చెప్పవలెను. శివసింగు మాట్లాడలేదు; ముఖర్జీ రైతులతో "వీఁడెవ్వరితో తా నెఱింగియున్నానని చెప్పినాఁ" డని పల్కెను. శివసిం గెవ్వరితోడను చెప్పియుండలేదు. ఆ మధు పురవాసులలో నొకఁడు "శివసిం గెన్నఁడును నిద్రింపఁడు. రాత్రులయందింటిచుట్టును తిరుగుచుండును. కావున వానికీవిషయము తెలిసియుండవచ్చు" ననియెను. ముఖర్జీయు శివసింగుతో "రాత్రి నీ వెచ్చటనుంటివి?" వనెను.

శివసింగు "పె—ర—టి—లో"

"నిప్పంటుకొనినపుడు నిద్రింపుచుంటివా?"

"లేదు."

"మంటలు ప్రారంభమైన దెఱుంగుదువా?"

'ఎఱుఁగుదును"

'మంటలెట్లుప్రారంభమైనవి?"

శివసింగుమాట్లాడలేదు. మనోరమను చూచుచుండును. మనోరమ "చెప్పుము" అనిపల్కెను.

శివసింగు—"వారు—మంట—పెట్టి—నారు"

"ఎవరు"

"ఒక—పె—ద్ద—మ—ని—షి."

ఈవాక్యమునాలించినతోడనే అచటివారెల్లరు నొకరిమొగము లొకరు చూచుకొనిరి. రమేశుఁడు పట్టజాలక

"ఈవిచారణ నషే తుకమును సమ్మతమునుకాదు"అనిపల్కెను మేజస్ట్రీటు వినిపించుకొనకుండగనే శివసింగును,

"ఆమనిషినిచూచితివా" యనియడిగెను.

"అగును"

"ఎవరోయెఱుఁగుదువా"

"ఆహా!"

"అతనిపేరుచెప్పగలవా?"

"ఊఁ"

"చెప్పుము"

శివసింగు భయముచే కంపించెను, గద్గదస్వరముతో,

"క—మ—లా—క—ర్" అని చెప్పి క్రిందబడిపోయెను;అతని కట్లు మార్పిల్లుట యలవాటు; ప్రజలాతనినిజూచి కోపముతో "ఛీ! దుర్మార్గుఁడు; కమలాకరుఁడేడ, ఇట్లొనర్చుటేమి! సర్వముకల్ల; చంపుఁడు; వీనినిచంపినను పాపములేదు;" అనియఱచిరి.

రమేశుఁడు—"కల్ల! కల్ల!" అనియెను.

సురేంద్రుఁడు—"ఉత్తది. వట్టిది" అనెను.

నషేనుఁడు—"నమ్మఁదగిన పీలులేదు" అనునుడివెను.

5

జమీందారు—నేను చెప్ప లేదా; వానినదుగుట పనికిమాలినప నియనెను; రాధాకాంతుడు చిన్నబుచ్చుకొనెను. అతఁడు ధైర్యమువహించుటకు ప్రయత్నించెను గాని, కార్యము లేకపోయెను; అతనిముఖమే వానిహృదయావస్థను చెప్పక చెప్పుచుండెను; నవీనమోహనుఁడాతనితో 'ఇట్టిసందర్భములో విచారణనాపివేయుట యుక్త'మనిపల్కెను.

ముఖర్జీమాత్రమట్లు తలంపలేదు; అతఁడు తప్పుతోవలనడచుచు "తాబట్టినకుందేటికి మూడే కా"ళ్లని వాదించువారిలో నొకఁడు ఎంతయైనను తనదితప్పని యొప్పుకొనఁడు.

"నేనింతటితో విరమింపదలచుకొనలేదు" అనిస్పష్టముగ చెప్పివైచెను; అంతయునిశ్శబ్దముగనుండెను; రాధాకాంతుఁడు శివసింగుతో "అబ్బాయీ! నీవుచెప్పినదేమో తెలియునా? నిర్దోషమర్యాదస్థునిపై నేరముమోపుటకు ప్రయత్నించుచున్నావు; జాగ్రత్త" అని పల్కెను శివసింగప్పుడే నేదదేరెను; అతఁడది వినెనో, లేదోకాని దద్దరిల్లెను; శరీరము కంపించెను; మేన ముచ్చెమ్మటలుపోసెను; కష్టముతో "నిజము చె—ప్పు—చు——న్నా—ను" అనిపల్కెను.

"కమలాకరుఁడానందభవనమునకునిప్పు పెట్టెనా" యనిముఖర్జీ ప్రశ్నించెను.

"అగును"

"ఎట్లు"

శివసింగు తన్నసూయతో జూచుచున్న జమీందారుమొగము నుండి మనోరమమొగమువంకకును, ఆశ్చర్యముతోజూచుచున్న మనోరమనుండి జమీందారును చూచుచుండెను; మేజస్ట్రీటు మరల చెప్పుమని పల్కెను. మొదట ననుమానించినను ధైర్యముతెచ్చుకొని నత్తితో కష్టముమీద నొకగంటలో నీక్రిందనుదహరించిన సమాచారము

నెఱింగించెను. కమలాకరరాయలు జేబులోనుండి కొన్ని కాగితములను దీసి నిప్పుముట్టించి గడ్డిమేటిపై విసరుటయు, గడ్డిమేటికి నిప్పు తగులొ నినపిమ్మట పుల్లలగుట్ట దగ్గరకు శోగిముటయు, తానుచూచినట్లుగా చెప్పెను. అతనిమస్తులవిషయమై ప్రశ్నించుటయు నాతఁడు మోకాలి వరకునుండు తెల్లని షరాయిధరించి, కాకిరంగుచొక్కాయిని ధరించి, మెడలో నెఱ్ఱనిచారలుగల్గినరుమాలు చుట్టుకొనియుండె నని తెలిపెను. అవి కమలాకరుఁడు వేఁటకు పోవునపుడు ధరించుమస్తులని యెల్లరకును తెలియును. అందుచే వారు నవ్వుకొనిరి.

"మంటచేసిన తరువాత నాతఁడేమిచేసె" నని రాధాకాంతుఁడు పృచ్ఛచేసెను.

"పుల్లలగుట్టచాటున దాగుకొనెను"

"తరువాత"

"తుపాకిలో మందుదట్టించి, జమీందారుగారివలకువచ్చిన వెంటనే వానిని కాల్చెను"

ఈమాటవినినతోడనే జమీందారునకు కోపము, నసహ్యాము గలెను.

"ఒకనీచునిచే పెద్దమనుష్యులపై నిందారోపణ సేయించుట తగ సిపని. వాఁడు నిజముగ కమలాకరుఁడు నిప్పునంటించుట చూచియుండిన చోనాకేలచెప్పలేదు?". అనిప్రశ్నించెను.

అపజయమునొందిన వానివలె ముఖర్జియు నాప్రశ్న నే శివసింగు నడిగెను. ఇది నవీనమోహనప్రభృతుల కాశ్చర్యము గలిగించెను. ఇదివరలో గర్వాతిరేకమున పరులమాటలకు లక్ష్యము సేయనివాఁడిట్లుండుటకు వారికి కారణము తెలియలేదు.

రాధాకాంతుఁడలసిపోయెను. ముందుతానేమి చేయవలయునను సంగతి నాలోచించుకొనుచుండెను. అతఁ డప్రయత్నముగ లేచి నిలువఁ

బడెను. ముఖము వెల్లనయ్యెను, మేన ముచ్చెమ్మటలు పోసెను. న్యాయవాది వానిం జేరి "ఇంకను ముందేమిచేయుదువు" అనియడిగెను.

"న్యాయాధీశుని ముందు పెట్టెదను"

"ఏమి? నిజమే?"

"ఇట్టిస్థితిలో నేమిచేయుట? నాకుసాధ్యమైనంతవరకు వీడుచెప్పినది యసంభవమని నిరూపణచేయుటకు ప్రయత్నించెదను. కాని, పర్యవసానము నా యాశలు నిరాశలుగ జేసినవి"

"అందుచేత నిప్పుడు——"

"ఇంకనేదియు ననుమానింపజాలను. ఈభోగట్టాజరుగుసమయమున నిచ్చట పలువురు సాక్షులున్నారు. శివసింగుచే పేర్కొనంబడిన యాతడు స్నేహితుడో, కాడో నిశ్చయింపజాలనిచో నామర్యాదకు భంగముగలుగును." అనిపలుకుచు జమీందారుని శయ్యాసన్నమున జని "ధనపురేశా! మీకును,కమలాకరునకును గలసంబంధము లెట్టివో సెలవిచ్చెదరా?" యనెను.

జమీందారునకాగ్రహమును, సంభ్రమమునొక్కమారుదయించుటయు మీరు నిజముగా నాతుంటరిమాటలను విశ్వసించెదరా యేమి?

అనియడుగుటయు "నేనేమియు నమ్మను. నిజము బైటకు దీయుటయే నాపని" యనిరాధాకాంతుడు మారువల్కెను.

"డాక్టరుగారు వాడున్మత్తుడని చెప్పియుండెరుకదా?"

"ఆర్యా! అనవసరప్రసంగమేల? నేనడిగినదానికి జవాబుదయసేయుడు" జమీందారుడు కోపముతో

"అతనికి నాకు నెట్టి సంబంధమును లేదు."

మీకును వానికిని వైరమున్నదని చెప్పికొనగా వింటినే?"

"నాకును వానికిని వైరములేదు. నేనెన్నడును మను ప్రక

“అగును; ఆకారణమువలనే మీరొకనాఁడు కమలాకరునితో వానినిగొల్లను జాగ్రత్తచేసికొననిచో తుపాకితో కాల్చివేయుదు మని పలుకలేదా?”

“అగును; నాకపుడు మితిమీరినకోపమువచ్చినది. అందుచేత నట్లంటిని. అది నాతప్పు; నేను వాని నూరక బెదరించితిని”

అదియే సంగతి; మీరిరువురు నాయునపాయులైనిలచి యొండొరులను కాలుదూటలాడుకొనిరి. ఆతఁడు మిమ్ము తుపాకితో కాల్ప జూచెను. అదిపలువురుచూచిరి. ఆసంగతి నాకాతఁడు చెప్పియున్నాఁడు;

---

## ౧౧వ ప్రకరణము

### నేరస్థాపనము

శివసింగు పట్టిమూర్ఖుఁడని యెఱుఁగనివాఁ డా యూరనొకఁడైన లేఁడు. ఆయూర నేవంక జూచినను ప్రజలు గుంపులుగఁ జేరి గుసగుస లాడుకొనుచుండిరి. ఇదివరలో జమీందారునకును కమలాకరరాయలు నకును కలహమున్నట్లును, అందు నిందార్హుఁడు జమీందారుఁడై నట్లు నందరు నెఱిఁగియుండిరి. వారిలో కొందరు కమలాకరుఁడు జమీందారు బాధపడలేక చిట్టచివరకీపని చేసియుండును. అనియు, మరికొందరు “చీ మర్యాదకుటుంబములోనివాఁడును, ధనవంతుఁడును, సన్మార్గుఁడునగు కమలాకరుఁడట్లుచేయునా” యనియు పలుతెరంగుల మాటలాడుకొనుచుండిరి. వారిలోనొక స్త్రీయు, నిరువురుపురుషులును తాముదలచుకొన్నచో నందఱ నాశ్చర్యపరవశులుగ జేయజాలుదుమని యు,తమకు తెలిసినసంగతు లెవరికిని తెలియవనియు డంబములుకొట్టుచుండిరి. ఈనేరమువిషయమై వారికేదయున తెలిసియుండ వచ్చునని

తలంచి వారి నాగాస్త్రిమస్థులు మేజస్ట్రేటుసమ్ముఖమునకు తీసికొని పోయిరి. అపుడు ముఖర్జి జమీందారుతో పైప్రకరణములో చెప్పినట్లు గా ప్రసంగింపుచుండెను. వీరుప్రవేశించినంతనే మరల నేదయిన నపాయము గల్గెనేమోయని సురేంద్రుడాత్రముతో వారిని సంగతియేమి యని ప్రశ్నించెను.

"ఇక్కడ మరికొందరు సాక్షులున్నారు"

ఇదివినినంతనే ముఖర్జిముఖచంద్రుడు వికాసవంతమయ్యెను. సమయము చిక్కినప్పుడు ప్రజలనుండి వీలయినంతవరకు విశేషములు తెలిసికొనకున్నచో పిమ్మట చేయుకార్యము లేదని యెఱింగినవాఁడ గుటచే నాతఁడు వారిని లోనికి గొనిరమ్మని యాజ్ఞయిచ్చెను.

అందు మొదటివాఁడు మధుపురములో నించుక ధనవంతుఁ డగు నొకకృషీవలుని కుమారుఁడు. ఆతఁడాయూరి నీటుకాండ్రలో నొకఁ డని పేరుగాంచెను. కొంచెము మందగాఁడు; అతఁడెవరిభయమును లేక ధనమును పాడుచేయుచు, తలిదండ్రులు చెప్పినట్లు నడచుకొనక, సుం దరములగు వస్త్రములను ధరింపుచు, జారుఁడై వర్తింపుచుండెను. ఇరువదియైదేడుల ప్రాయమువాఁడు; అతనిపేరు, వృత్తి, కులము మొద లగు వానిని వాడుకప్రకారము తెలిసికొన్న పిమ్మట వానికి తెలిసిన విషయములను చెప్పుటకనుజ్ఞయయ్యెను. ఆయాదవుఁడు గర్వముతో నల్దెసలపరికింపుచు, నేనారాత్రికొంచెము పనిమీద బైటకేగితిని; సీతా సదనమున కావల నొకరిని కలసికొనవలసియుండెను; ఆకారణమున నే నడ్డుత్రోవం బట్టిపోవుచుంటిని; గతరాత్రి వర్షము మిక్కుటముగాకురి యుటచే వాగులన్నియు నిండియుండునని నాకు తెలిసినను, తొందరగా నచటికిపోవలసినవాఁడనగుటచేత నామార్గము బట్టితిని. అనిచెప్పు చుండగా,

"అనవసరప్రసంగమును విసర్జించి, నేరమునకు సంబంధించిన విషయములను చెప్పుమని మేజస్ట్రేటు పల్కెను."

"నేను వాగును సమీపించునప్పటికి సుమారెనిమిదిగంటలు కావచ్చును. బట్టలు తడుపుకొనకుండగా నావలిప్రక్కకెట్లుపోవుదునా యని యాలోచించుకొనుచుండగా కమలాకరుఁడును సమీపించెను. నన్ను గాంచినంతనే యాతఁడాశ్చర్యపడెను. నేను నాతని నచట కాని సమయములో చూచుటకు శంకించితిని. నేనాతనితో "అయ్యా! మీరాండి?" అంటిని.

"అగును నేనే"

"మీరీపాడుత్రోవకు వచ్చినారేల?"

"వాగులన్నియు నిండినవని నాకుదెలియదు. పనితొందరచేత నిల్లువచ్చితిని; మరియు కొన్ని పక్షులను కొట్టుకొనవచ్చుననియు తలంచితిని తన తుపాకిని చూపును; నేనేమియుననలేదు; ఇపుడంతయు పరికించిచూడగా నీరడునేకీభవించుట నాకాశ్చర్యము కలుగజేసినది;"

రాధాకాంతుఁడు నిదియంతయు వ్రాసికొనుచు కమలాకరుని దుస్తులెట్టివిదాల్చియుండెనని ప్రశ్నించెను; వాఁడును శివసింగు చెప్పినట్టి వానినే మరల వర్ణించెను; అదివిని జమీందారిణియు జమీందారుఁడును ఒకరి మొగము నొకరు చూచుకొనుచుండిరి. వాకాక్క చేతులను పైకిముడచికొనెనన్నమాట వారికి నమ్మకము పుట్టించెను; వానిని పొమ్మని రెండవవానిని ప్రవేశపెట్టుమని మేజస్ట్రేటు చెప్పెను

రెండవసాక్షి దుర్మార్గవర్తనుఁడగు నొకముసలివాఁడు దొంగతనము చేయుటను ప్రతీతిగలదు. అతఁడు మొదటిసాక్షివలెగాక యనుమానించుచు మెల్లగ నిట్లు చెప్పసాగెను. "సుమారుపదునొకండు గంటలప్పుడు రంగాపురము సమీపారణ్యములో పోవుచుండగా" అనుమాటలకడ్డమువచ్చి "కట్టెలను దొంగిలించుచుంటివా" యనిముఖర్జీ పృచ్ఛచేసెను.

"దైవముతోడు. నేనట్టిపని యెన్నడును చేయలేదు. నేనా? కట్టెలను దొంగిలించుటయా? రాత్రియరణ్యములో పరుండి తెల్లవారు ఝామున పూలనేరి దెచ్చుటకయి పోయితిని. నేను నెమ్మదిగా పోవు చుండ, వెనుక నడుగులచప్పుడయ్యెను. సహజముగా భయపడితిని."

"నీవు దొంగతనము చేయుచుండుటచేతనా?"

"కాదు. నేనొకచెట్టుచాటున దాగుకొనుచుండఁగా కమలాకరుఁడు గానవచ్చెను. చీకటిలోనైన నేనాతని గుర్తింపఁజాలితిని. అతఁడు చాలకోపముతోనున్నట్లు తనలో తా నేవోమాట్లాడుకొనుచు, తిట్టుకొనుచుండెను.

"అతనిచేతిలో తుపాకి యుండెనా?"

"ఉన్నది. అదిచూచియే నేను భయపడితిని."

మూడవసాక్షి వనమాలి యను నొకముసలియాపె, ఆమె నివసించుగుడిసెయు నాయరణ్యసామీప్యముననుండెను. ఆమె మొదట నించుకసంకోచించిన పిదప కారము చెప్పసాగెను.

"నాకు తెలిసినది. కొంచెమయినను చెప్పెదను. మాయింటికి కూలివాండ్రు బియ్యముకొనుటకై మరునటిదినము రానైయుంటచే బియ్యముకొనుటకు యెద్దునుతోలుకొని పాటలీపుత్రమునకేగితిని. అంగడివాఁడు బియ్యము నిచ్చుటలో చాలవాలసించెను. రాత్రిపదికంటలగునరికి వర్తకుఁడు బియ్యమిచ్చెను. నేనామూటను యెద్దుపైవేసికొనివచ్చుచుండఁగా నెద్దుకాలికి రాయితగిలి పడిపోవుటయు నేనామూటను మరల దానిపై పెట్టజాలక యెవరైనసాయముచేయువారికయి వేచియుంటిని. ఇంతలో కమలాకరుఁడువచ్చెను. అతఁడు నాకోర్కెప్రకారము మూటను యెద్దుపైనిడి మాటలాడకుండఁగ తనదారిని తాను పోయెను."

ఇంతవరకు మేయరు గుమ్మములో నిలిచియుండెను. సాక్ష్యము ముగియుటతోడనే తలుపుమూసి లోనికివచ్చెను.అతఁడు వారితో "మనము మనగృహములకేగవచ్చును. న్యాయాధిపతి యిష్టానుసారము జరుపవచ్చును." అనిపల్కెను. రాధాకాంతునకంతయు నగోచరముగ నుండెను.ఈచిక్కులనుండి బయటపడుట యెట్టులాయని యాతఁడాలోచించుకొనుచుండెను. అచటివారందరు నాస్తితియందే యుండుటచే వారు నేమియు పలుకరైరి.కొంతకాలమునకు "శివసింగును విచారింపబూనుట తప్పుకాదని ఋజువయినదికదా? ఇపుడు వినిన దానినిబట్టి మీకు మాత్రి మనుమానము కలుగుట లేదా? మీలో నెవ్వఁడైన నాతఁడున్మత్తునివలె మాటలాడెనని తలంతురా? మొదట నాతఁడు నేరస్థునిగురించి చెప్పినపుడు మీరెవ్వరును నమ్మజాలకుండిరి. కాని యిపుడు సాక్షులందరు నాతడు చెప్పిన దానిని సమర్థించిరి. కనుక నేరము ఋజువుకాలేదో " యని పల్కెను. మరల నుత్సాహపూరితుఁడై యాతఁడు,

కమలాకరుఁడు రాత్రి మధుపురములో నున్నట్లు స్పష్టమయినది. అతఁడచటికెట్లువచ్చెను? ఇతరులు చూడకుండునట్లుకదా, అతని భవనమునకును మధుపురమునకును మధ్య రెండుబాటలున్నవి! ఒకటి రంగాపురమునుండియు, రెండవది పుంతమార్గమునుండియు. అతఁడీరెంటినివిడచి గుడ్డలు తడియుననియైన శంకింపక వాగులకడ్డముపడివచ్చెను. మరలిపోవునపుడు రాత్రి యనిశంకింపక, దారితప్పుదునేమోయని సంకోచింపక, అరణ్యమనియైన నాలోచింపకయే తిరిగిపోయెను.ఇదంతయు నిశ్చయముగ నితరులకు కనబడకుండుటకేగదా? దారిలో నాతనిని చూచినవారెవ్వరు? జారత్వవిషయము పోవుచుండిన నీచుఁడగు నొకదొంగతనముచేయు ముసలివాఁడు, దైవవశమున నట్లుపోవుచుండిన ముసలిదొంకతె. అతఁడు తనప్రయత్నములన్నియు సరిగాచేసుకొన్నను

భగవత్కృపావిశేషమున నాతనినేరము బైటపడెను. ఆతని ప్రయత్నములకు విఘాతముకల్గెను."

దైవమా యని రమేశుఁడు మూల్గెను. రాధాకాంతుఁడు వినిపించుకొనలేదు. పూర్వముకన్నవడిగ నతఁడు "పోనీ! అతఁడు బయలుదేరిన వేళనుబట్టి వేరు విధముగ తలంపవచ్చునా? కూడదు. అతఁడిచటికివచ్చినదెపుడు? చీకటి పడినతరువాత నెనిమిదిగంటలప్పుడు. అతఁడు సుమారు తొమ్మిదిన్నరగంటలపుడు మధుపురముచేరియుండును. అప్పటికింకను నేరము జరిగియుండలేదు. మరల నాతఁడింటికెపుడుపోవుచుండెను? ముసలివాఁడును వనమాలియు పదునొకండుగంటలకని నుడివక్కాణించుచున్నారు. అప్పటికప్పుడే తారానాథుఁడు తుపాకిదెబ్బ తినుటయు, నానందభవనమునకు నిప్పుపెట్టుటయు జరిగెను. అపుడు కమలాకరుఁ డేస్థితిలో నుండెను? మొదట నాతఁడిచటికివచ్చునపుడు నిశ్చలుఁడై యుండెను. అతఁడాయువకునిఁ జూచి యాశ్చర్యపడెను, ఎటునుండి యెటువచ్చెనోయని తనయాగమనమును నకారణముగ నిరూపించెను తాను తుపాకితెచ్చిన కారణమును చెప్పెను. అతఁడేమని చెప్పెను? రంగాపురమున తానెవరినో కలసికొనబోవుచుంటిననని. ఎవరినో కలసికొనుటకుపోవుచో తుపాకి యెందులకు? పక్షుల కొట్టుకొనుటకఁట. అది సహేతుకమా? అట్లుండునా? నమ్మదగునా? మరలనాతఁడు వచ్చినపుడు కోపముతోనున్నట్లు వనమాలిచెప్పెనుగదా? ఆమె పిలచినపుడుపారిపోయినచో యనుమానింపఁగలదని మాట్లాడకుండఁగనే యామెనని నిర్వర్తించివెడలిపోయెను. వెడలుటలో తగినంత త్వరలో పోవలెననియుద్దేశించుచుండెను. అంతభయమేల? అతఁడు తారానాథుఁడుమృతినొందెనని యెంచెను. ఆనందభవనమంటుకొనినసంగతి యాతండెఱుఁగును. అతఁడునగారావినఁబడుననియు, మంటలలముకొనుననియు భయముచెందెను. కావున నాతఁడు నేరముచేసియే యుండిలీరవలెను. లేని

చో నిట్లు ప్రవర్తించుటకు కారణ మగుపడదే." యని యుపన్యసించెను.

లోకములో సర్వసాధారణముగా న్యాయాధిపతులిట్లు చనువుగా మాట్లాడరు. న్యాయాధికారులేగాక న్యాయవాదులును తాము రహస్యప్రవర్తనగలవారమనియు, నితరులతో మాటలాడినచో తమ రహస్యములు బైటపడుననియు శంకించి మాట్లాడవెరతురు. వారు సాధారణముగ సామాన్యులకన్న మిన్నయగువారమని గర్వింతురు. ఇతరుల సలహానుకోరు మేజస్ట్రేటు తగినంత జాగ్రత్త తీసికొనకుండఁగనే భోగట్టా మొదలిడెను. సర్వాధికారియై, తనయొూత్మయే తనకు న్యాయాన్యాయవిచారణకర్త యై యుండ తానిచ్చవచ్చినట్లు చేసెను. మధుపుర ము కేసులో రాధాకాంతుఁడు తొందరపడెననుట వాస్తవము. అతనికింతవరకును విచారించుటకు సమయము చిక్కలేదు. కనుక తనయాలోచనయంతయు విశ్రాంతికలిగినంతనే పరవశుఁడై చెప్పివేసెను. నిజచర్యయంతయు బహిరంగముగుటచే నాతఁడు విమర్శపూర్వకముగ సద్దానిని సమర్థించుకొనుట యవసరమయ్యెను.

"ఇదిన్యాయబద్ధమగు విచారణకాగలదా?" యని రమేశుఁడు ప్రశ్నించెను ఎవరును మాటలాడలేదు. అందుచేత నాతఁడు "వైద్యుఁడనగు నేను శివసింగు పిచ్చివాఁడని నిర్ధారణచేయుగలను. ఎందులకీ భోగట్టా? ఒకమూర్ఖునివాక్యముల ననుసరించి నేరస్థాపన చేయనగునా? వివేకము వీధులలోని లాంతరులవలె యొకింత కాలము ప్రకాశించి యారిపోవజాలదు. ఒకమనిషిపుట్టినప్పుడే ఆతఁడు వివేకవంతుఁడో లేక వివేకహీనుఁడో నిర్ణయింపవీలుండును. శివసింగుపుట్టినప్పటినుండియు వివేకలవదుర్విదగ్ధుఁడు. ఆతని పలుకులు విశ్వసింపఁజనదు. కాని, మీారితరులుకూడ వానిని సమర్థింపలేదాయని యడుగుదురు. అదిన్యాయము కాజాలదని నిశ్చయముగ చెప్పగలను. ఏల? మీాకివి శివసింగుమాటల

చేత ననుమానముగలిగి, దానికనుగుణ్యముగ నుండుటచేత నిజముగ కనుపట్టుట సహజము. శివసింగే మొదట చెప్పకుండినచో కమలాకరుఁడు కూర్చుండెనో, పరుండెనో, నడచెనో, పరుగెత్తెనో, తుపాకిదీసికొని పోయెనో, చుట్టపీక పట్టుకొనియుండెనో మనకేల? నిశ్చయముగ నక్కరలేదు. అతఁడేమిచేసెను? రాత్రియంతయు తిరిగెను. తిరిగిన తిరుగుగాక. అతని నెవ్వరు నాటంకపెట్టువారు? అడవిలోనికేగెనా? వెళ్లిన వెళ్లును. ఎందుకు పోగూడదు? దారిలో నాతనిని కొందరు కలసికొనిరి. అదిసహజమే. బాటపైననడుచువారి కితరులు కనఁబడజాలరా? కలసికొనరా? పరిచితులతో మాట్లాడరా? మనమాతనివర్తనమునంతయు శంకింపనేటికి: మూర్ఖుఁడు, వెఱ్ఱివాఁడు నగునొకఁడు కమలాకరుఁడు నేరస్థుఁడని చెప్పినంతమాత్రమున నాతనిగౌరవమునైన పాటింపక, యాతని వర్తనమునైన గమనింపక, యాతని కుటుంబమునైన విచారింపక, నేరస్థుఁడని నిర్ధారణచేయుట పాడియగునా? అదియుఁగాక శివసింగు చెప్పినదేమి? మరల తరచి యడిగిన వాఁడు చేసినదేది? మూర్ఛిల్లి భయముచే కంపితుఁడై నేల గూలుట, ఆపిచ్చివాఁడేమి, కమలాకరుఁడు నేరస్థుఁడనుటయేమి? మీరు నమ్ముటయేమి? కమలాకరుఁడుగాక శివసింగు నన్నే నేరస్థుఁడనన్నచో నమ్మవలసినదేనా? నన్నేమిటి? సురేంద్రునేయనగూడదా? అట్లనినచో సురేంద్రుఁడు నేరస్థుఁడు కావలసినదేనా? కమలాకరుని కంటె నేనుగూడ రాచకీయవిషయములలో పాల్గొనుచుండలేదా? అతఁడు స్వరాజ్యముకోరుచు. అతఁడు ప్రజాసంఘమునకు స్వాతంత్ర్యముకోరుట నేరమా?" అని యుపన్యసించుచుండగా నవీనుఁడు "రమేశా! నీమాటలు మాకు కాకున్నమానె, నీకర్థమగుచున్నవా" యని ప్రశ్నించెను.

నేను చెప్పినదంతయు నాకేకాక యిచటనున్నవారందరును గ్రహింపజాలునట్లున్నది. అనుచుండగా వానిమాటల కడ్డము తగిలి

జమీందారుఁడు డాక్టరుగారు చెప్పినదంతయు నేను ఒప్పుకొనుచున్నాను. మనము తలంచినదాని కంటె యెక్కువగా నాలోచింపవలసినది కమలాకరుని శీలము; కమలాకరుఁడు చాలమంచివాఁడు. మాన్యుఁడు. అట్టి సుగుణుని యిట్టినీచపుపని చేయుననుట సమంజసము కాజాలదు" అనెను. అచటి వారిలో చాలమంది దానికనువదించిరి. సురేంద్రుఁడును "నేనింకొకవిషయము చెప్పబోవుచున్నాను. ఆతఁడట్లు చేయుటలో వాని యుద్దేశమేమైయుండును? అందువలన నాతనికగులాభమేమి? అదియుఁగాక యాతనికంటె సుఖజీవి యొండైననుండునా? యౌవనుఁడు, సుందరుఁడు దేహదార్ఢ్యముకలవాఁడు, కావలసినంతధనమున్నది. ఎల్లరిచేతను ప్రేమింపబడదగిన సుగుణములు కలవాఁడు. ఇవియేగాక నాతండచిరకాలములోననె వివాహితుఁడుకానున్నాఁడు. ఆనందయే వాని వధువు. ఆమె యాతనిని గాఢముగ వలచియున్నది; కొలఁదిదినములకు పూర్వమే సుముహూర్తము నిశ్చయింపఁబడెను."

ఇట్లు వీరు సంభాషించుచుండగా కాలము పరుగెత్తుచుండెను. అప్పటికప్పుడే నాల్గుగంటలయ్యెను; దీపములు కాంతివిహీనములై వెలవెలఁబారుచుండెను. పక్షులు కిలకిలారావములు సేయుచు నాహారార్థమై పరుగువారుచుండెను. కుక్కుటములు కొక్కొరోకో యని కూయుచుండెను. పొలములకేగుటకై కాపులు పయనములగుచుండిరి. పసికత్తెలు ముంగిళ్లను రంగవల్లులచే నలంకరింపుచుండిరి. కాని, పాటలీపురవాసులలో చాలభాగమును మధుపురవాసు లందరును నిచట గుమిగూడినవారగుటచే స్వకార్యములను మఱచి యారాత్రిముతో దీనియుదంతము నామూలాగ్రముగ విన నిశ్చయించి కదలక నిలచియుండిరి. అందఱును జమీందారు వసియింపుచున్న కుటీరముచుట్టును జేరియుండిరి. రాధాకాంతుఁ డితరులు చెప్పినదంతయు సావధానచిత్తుఁడై వినెను. ఆతనికి పలుమారు పెక్కురీతుల తోఁచినను వాని

నన్నిటిని బెడచెవినిఁ బెట్టెను. చిత్తమును స్వస్థపఱచికొని తల యూచుచు 'అయ్యలారా ! మీ యందఱికంటెను కమలాకరుని నిర్దోషిత్వమునందు నాకు నమ్మక మెక్కుడుగలదు. నాచెప్పినదంతయు బాగుగా నెఱింగిన నవీనమోహనుఁడు మీకు నాసంగతి నంతయు బాగుగా చెప్పఁగలఁడు; ఆతనినిగూర్చి చాలమార్లు ఆలోచించియే యున్నాను. కాని నేను న్యాయమునకు ప్రతినిధిని. నాప్రేమకంటె నావిధియే ముఖ్యమైనది. ఎంత తెలివిమాలినవాఁడైనను, పిచ్చివాఁడైనను, శివసింగుమాటలను త్రోసివేయుటకు నాయధికారమేది? వానిమాటలు ధృవపఱచుచుండిన తక్కిన ముప్వురి సాక్ష్యములను కాదనుటకును త్రోసివేయుటకును నాసామర్థ్యములో నున్నదా" యని పల్కెను.

తారానాథుఁడందరికంటె నెక్కుడు వ్యసనపడెను. చిట్టచివర కతఁడు ''దీనిలో ముఖ్య విషయ మెద్దియన కమలాకరుఁడు నేను విరోధి నని తలంచుట. అతఁడేవార్త విన్నను నేనును నాభార్యయు కల్పించిన పన్నుగడయని యెంచును. కాని నేను లేచుటకు సమర్థుఁడనై యున్నచో వానివిషయము స్వవిషయముగ నెంచి సాహాయ్యము చేసియుండెడివాఁడనే. ఆహా! దుర్మార్గుఁడు శివసిం గెంతపనిజేసెను ? జ్ఞానరహితుఁడగు వానిమాటలు విశ్వసించుటయా? అకటా! మనోరమా! నీవైన వాని నెందులకు వారింపవైతివి? ఎందులకు నీవాతుచ్ఛుని మాట్లాడించితివి? వాఁడు పలుకకున్నను బాగుండెడిది గదా" అనెను.

మొట్టమొదట నీగడబిడచేతను ఒకసంగతితరువాత నింకొకటి బయటకు వచ్చుచుండుటచేతను, యింతవఱకును ధైర్యముతో చిక్కబట్టినను ముగియుటతోడనే మనోరమ యలయిక చెందెను. ఆమె తన

మతలిరువురును వచ్చిపోయియున్న పరిక్కనున్న పీఠముపై కూరుచుండి తలగడపై తలపెట్టుకొని నిదురించినట్లుండెను. తనమగఁడు తన్నీరీతిగా నన్నతోడనే యామె మేల్కాంచి తీవ్రభావముతో

"నామగనిని చంప నుద్యుక్తుఁడైన వానివిషయమును చెప్పుచుండినవానిని నేను వారింపఁజాలను. అది నాకు సమ్మతమే. అందుల కించుకయైన విచారింపఁజాలను." అనియెను.

"కాని, ప్రేయసీ! కమలాకరుఁ డెంతమాత్రమును దోషి కాడు సుమా! ఆనందమయి యంతటి లోకైకమాన్యను వరియించి చేపట్టఁ జూచుచున్న యాతఁడిట్టియకృత్యము చేయనుద్యమించెననుట యెట్లు నమ్మదగును?"

'అట్లయినచో నాతని నిర్దోషిత్వము నాతఁడు స్థాపించుకొనుగాక!' యని దాక్షిణ్యరహితయై యామె పలికెను.

"ఇదియే స్త్రీల తర్క" మని రమేశుఁడు హాస్యాస్పదముగఁ బల్కెను.

"నిశ్చయముగ కమలాకరుఁడు నిర్దోషియని స్థిరపడును. కాని, దానియం దనుమానము మాత్రము జనులు వీడఁజాలరు. లోకులు పలుగాకులుకదా! వా రాతనిని వ్రేలుతో చూపించుచు యీతఁడే హంతకుఁడు, గృహదాహకుఁడని పల్కుచుందురు. ఆమాటకు నవీన మోహనుఁగు విచారముతో నీరీతిగ నుత్తరువొసంగెను.

"నేను నీ యభిప్రాయముతో నేకీభవింపఁజాలను. ఇప్పుడు జరిగినదానితో ముఖర్జీ వెనుదీయఁజాలఁడు. అతని యుద్యోగమును, విధియు వాతని నీకార్యమునుండి మరల్పజాలవు. విచారణ మానివేసినచో శివసింగువాక్యముల నాలించి సాక్ష్యములను విన్న ప్రజలేమందురు? నిజముగ కమలాకరుఁడు దోషియైనను ధనవంతుఁడును, తనకు మిత్రుఁడు నగు కారణమున దానిని విడచివైచెనని పలుకరా? నా

మనస్ఫూర్తిగ నేను కమలాకరుఁడు నిర్దోషియని నమ్ముచున్నాను. అందుచేత నాతఁడు దోషరహితుఁడని స్థిరపరుప గోరున్నాను. అతఁడు తన సచ్ఛీలమును స్థాపించుకొన సమర్థుఁడే; మొదటి సాక్షియగు లక్ష్మణుని కలిసికొన్నప్పుడు దానెందులకో యెవరితోడనో మాట్లాడ బోవుచున్నానని చెప్పలేదా?"

"అతఁడు నిజముగ రంగాపురము వెళ్ళకున్నచో, అతఁడెవ్వరితోడను మాట్లాడకున్నచో, అతఁడు లక్ష్మణున కేదియో చెప్పి తప్పించుకొనఁగోరినచో" అని సురేంద్రుఁడు ప్రశ్నించెను.

"అట్లయినచో నాతఁడు నిజముగ న్యాయసాధనములో చెప్పుకొన వలసి యుండును. అదియేకాక కమలాకరుఁడు నేరస్థుఁడు కాఁడని ఋజువు చేయుటకు నిదర్శనమింకొకటి కలదు. అతఁడు నిజముగ జమీందారును చంపునుద్దేశముతోనున్నచో గుండునుపెట్టి కొట్టక, పిట్టలను కొట్టుటకు ప్రయోగించు చిన్న రవ్వల నేల ప్రయోగించును?"

"అతఁడు పదిగజముల దూరములోనున్నచో నాకు కనిపించి తీరవలసి యుండెను" అని తారానాథుఁడు ప్రసంగించెను.

ఇంతలో నెవరో తలుపు తట్టిరి. సురేంద్రుఁడు తలుపు తెరచెను. ముగ్గురు రయితులు లోన ప్రవేశించిరి. వారిలో నొకఁడు "మాకేదో విచిత్రమైన వస్తువొకటి కనిపించినద"ని పల్కెను.

"ఏమిటది?" అని మేజస్ట్రేటు ప్రశ్నించెను.

"అదేదో గొట్టము వలెనున్నది. మావాఁడు తుపాకిగుండు మొక్క గొట్టమని చెప్పుచున్నాఁడు."

జమీందారు చేతుల సాహాయ్యముతో లేచి "నన్ను చూడనిండు. నేనీమధ్య చాలగుండ్లను పిట్టలను బెదరించుటకై పేల్చితిని; అదినాదేమో చూచెదను" అనెను. అతడు దానిని చూచెను. దానిమీద . Clebb

అని పేరుండెను. దానిని చూచినంతనే యాతండు వివర్ణత చెందెను. "అట్లయినచో శివసింగు నిజమే చెప్పెను." అని పల్కెను.

ఇదంతయు మేజస్ట్రేటు వినుచుండెను. అతఁడు జమీందారుని చేతిలో నుండి యాగొట్టమును తీసికొని పరీక్షించి, పల్లెటూరి వాని దిక్కయి "ఓయీ! నీకీగొట్టమెక్కడ దొరకె"నని ప్రశ్నించెను.

"పాతయింటిముందు గడ్డి పెరుగుచున్నచోట"

"అట్లయినచో వాఁడు అంత దూరమునుండి తుపాకి పేల్చి యుండఁడు; పాతయింటి దగ్గర నిలువబడినచో నీమేడ తలుపైనను కానరానంత దూరమున్నది." అని సురేంద్రుఁడు పల్కెను.

"కాని తుపాకి పేల్చినంతనే గొట్టము క్రిందపడదు. రెండవ గుండు పేల్చుటకై గుఱ్ఱము సదల్చినంతనే యది క్రిందపడును." అని చెప్పెను, తారానాథుఁడు.

రాధాకాంతుఁడు వారి దిక్కయి "మీలో నెవనికీ గొట్టము కనిపించినది" అనియడిగెను.

'మేము ముగ్గురమును చూచితిమి." అనుటయు వారల పేరు మొదలగు సంగతులను వ్రాసికొని వారి నంపివైచెను. మేజస్ట్రేటు,

ఇంతలో పాటలీపుత్రమునకేగిన యాతఁడు మందును తీసికొని వచ్చెను. రమేశుఁడు దానిని తీసికొని వారితో 'అయ్యలారా! ఇఁకనైన జమీందారును విడచి పెట్టుఁడు; గాయములు తగిలిన వానిని రక్షించుట మాసకత్యావశ్యకము. ఇప్పటికే చాల తడవయ్యెను. ఇఁకనైన నాకు సెలవు దయసేయుడు." అనిపల్కెను.

## ౬వ ప్రకరణము

కమలాకర[illegible]

అధికారులకు పని ముగిసెను. వారిఁక చేయవలసిన పనిలేదు; అందుచేత వారు జమీందారును వీడ్కొని బయటకు వచ్చిరి.

వీధిలో పావకుని పనియు పూర్తియయ్యెను. ఇఁక దహించుట కేదియు వీలుకానందున నాతఁడును ఆనందభవనమును వదలి పోయెను. అనేక వత్సరముల నుండియు నిర్మితమై విలసిల్లుచుండిన యా భవన మంతయు కొలదిగడియల కాలములో భస్మీపటలమయి పోయెను. చూపరుల కానందదాయకమై, రమ్యమై, శిల్పవిద్యానైపుణ్యముచే జెన్నారుచు, విలువగల సామానులతో నిండియుండిన భవనమంతయు నేఁడు కూలినగోడలు కాలిన మేడలు, రాలిన స్తంభములు, విరిగిన కట్టడములతోడను భీభత్సమై యుండెను. ఏవంక గాంచినను సగము కాలిన సామానులు, ఏచక్కి నవలోకించినను మాడిన పూలచెట్లును, ఏదిక్కు వీక్షించినను దహింపఁబడినవస్తుజాలావృతమునై యాస్థలమంతయు భయావహమైయుండెను. ఒకచోట ఉంచములు, పెట్టెలు, కుర్చీలు మొదలగు సామానులును, వేరొకచోట కృషీవలులకనువగుబండ్లు, నాగళ్లు, మొదలగు పనిముట్లు, ఇంకొకచోట నత్యంతాయాసముతో సంరక్షింపఁబడిన గుఱ్ఱములు, గోడిగలు, ఆవులు, యెద్దులు, గొఱ్ఱెలు, మేకలు, కోళ్ళు, కుక్కలు మొదలగు జంతుసంతతులును నిండి యుండెను. పెక్కురు జనులింకను వీడి పోవలేదు.

అధికారులు మువ్వురు నట్లు ధనపుర జమీందారును వీడ్కొని వీధిలోనికేగి దానినంతయుఁ గాంచి విచారించిరి. ఆహా! అగ్నిహోత్రుఁడెంతటికైన సమర్థుఁడుకదా. ఆతని మహిమ కడ్డులేదుగదా యని

సురేంద్రుడు తలంచెను. తక్కిన యిరువురు నట్లే యొంచినను పైకి వలుకలేదు. వీరచటికి కేగినతోడనే చిరపరిచితుడును, దయార్ద్రహృదయుడునగు సురేంద్రునిగాంచి ప్రజలందరు సంతోషమును వెలిబుచ్చిరి. ఇల్లు వెడలినప్పటి నుండియు న్యాయాధీశుడు న్యాయవాదియు నొండొరులతో పరులు లేకుండగ మాటలాడు కొనుటకు వీలుదిక్కలేదు. ఇపుడట్టి యదనుకలైను. వారొకరితో నొకరు నిజమనోభావములను దెలిపికొనను ద్దేశముతో నవలోకించుచు, మూకభావము వహించి యుండిరి. కొంత వడికి నవీనమోహనుడు "ఎంతయాపద!" యనియెను.

ముఖర్జి "నీవు నిజముగా కమలాకరుడు దోషి యని తలంచుటలేదా?"

నవీనుడు "నేనన్నటికి నమ్మజాలను. నాయాత్మ కాతడు నిర్దోషి యని తట్టుచున్నది. కాని సాక్ష్యములు ప్రబలముగ నున్నవి"

"ఆకారణముననే నేనును వానిని శంకింపవలసిన వాడనైతిని"

"కటకటా! ఎంతపని చేసితివి. ఆమూర్ఖాగ్రేసరుడగు శివసింగు నేల పరీక్షించితివి ? ఎవరుచెప్పిన నేలవినవైతివి?"

"నావిధి ననుసరించియు నాయంతరాత్మ ననుసరించియు నేను ప్రవర్తించుట తప్పనుకొంటివా?"

"నీవు చేసిన దానికి నేను నిందించుట లేదు."

"క్రూరమైన హత్యకు ప్రయత్నము జరిగెను. దాని విషయమై నారోపించినంత వరకు నన్ను చేయుమని నాయంతరాత్మ నాకు దెలిపెను. నేనును నేరస్థుని కను గొనుటకై తగినప్రయత్నములు చేసితిని."

"నిజమే కాని నిందారోపణచేయబడినవా డిదివరలో నీను

త్రుఁడని నీవు విజ్ఞప్తిగుచుండు కమలాకరుఁడు కాఁడా? అతనిబంధుత్వము పైన నీభావిసౌఖ్యమంతయు నాధారపడి యుండలేదా."

"అయిన?"

"ఈసంగతి నాకు దెలిసినదని యాశ్చర్యపడెదవా? ఈయూరిలో నేసంగతియు దాఁగదు. నీవు కమలాకరుని బంధుగురాలిని వివాహమాడనుద్యమించుచున్న ట్లెల్లరకును దెలియును"

"అయిన నేమి?"

"నీవీ గొప్ప నేరమును విచారించుటచే యశము, పదవియు వృద్ధిచెందునని తలంచితివి కాఁబోలు. ఈ కార్యములవలన నీభావిసౌఖ్యమున కంతరాయము కలుగవచ్చును. నిజముగ కమలాకరుఁడు నేరస్థుఁడైనను కాకున్నను వానిబంధుగులెల్లరు నిన్ను పక్షపాతివనియు, శత్రునిరీతి వర్తించితివనియు, నీవు జోక్యముగలుగ జేసి కొనినందులకు నిన్ను నిందిపక మానరు. నిన్నాతనిని చెరసాలకు పంపినందులకును దోషికానిచో నేరస్థునట్లు పాటించినందులకును నిందించితీరుదురు. నీవాతని సోదరిదయకు పాత్రుఁడవు కాఁజాలవు."

"నీవే నాస్థితిలో నుండినచో నేమిచేయుదువు?"

'ఇఁకనైన నీకార్యమునుండి మరలియుందును"

"అట్లయినచో స్నేహమును పాటించి యధర్మవర్తనుఁడనగుదునను కొంటివా?"

"నేనట్లు కోఁటలేదే?"

'నాకు మాత్రమీపని యుత్సాహకరముగనున్నదా? కాని నాప్రియమిత్రుఁడును, నాకత్యంతాప్తుఁడునగు వానిపై న్యాయాన్యాయవిచక్షణలేకయే నేరమారోపింపఁబడి యున్న నెట్లూరకుండగలను? ఆకారణమున నిజము కనుఁగొనుటకై ప్రయత్నము చేసితిని. చేయుదును, చేయువలయును."

నవీనుఁడు వీనితోడ నింక ప్రస్తావించిన కార్యము లేదని మాటలాడకుండెను. ఇంతలో సురేంద్రుఁడచటికి వచ్చెను. అతఁడు వారిఁక ముందేమి చేయఁదలంచిరో తెలియఁగోరెను. వారు కమలాకరుని గృహమున కిప్పుడే పోవ నిశ్చయించిరి. సురేంద్రుఁడు వారు తన బండినెక్కి పోవుటకు సమ్మతించి, పురజనులను సమాధానపరచుటకై తాను పాటలీపురమునకు బయలుదేరెను. లేఖరియగు కరంచందు అంతలో నచటికి వచ్చెను.

మేజస్ట్రీటు గుమాస్తాగా నుండిన కరంచందు పాటలీపురమున పలుకుబడి గలవారిలో నొకఁడు. అతఁడు చేయునది స్వల్పయుద్యోగమైనను, రాబడి తక్కువైనను, వానింటి కాయూరిధనాఢ్యులు కూడ వచ్చి పోవుట కలదు. అతఁడు చేయునది లేఖరిపని యొకటియే కాక నితరములగునవి కూడ నుండెను. కోర్టులో పని కంటె నితర పనులే యాతని ప్రాముఖ్యమునకు కారణములై యుండెను. ఆతఁడప్పులు చేయుట యందు మిగుల నేర్పరియగుటచే నాయూరిలో నెల్లరా పని కాతనినే నియోజించుచుండిరి. వర్తకులకు లెక్కలు చూచిపెట్టుచుండుటచేత వారతనికి కొంతధన మిచ్చుచుండిరి. మంచి వ్రాయసకాఁడగుటచేతను, న్యాయశాస్త్రమునకు సంబంధించిన విషయములన్నిటిని యెఱిఁగి యుండుటచేతను, చాలమంది వానిచే తమ కార్యములను చక్కఁజేసికొనుచుండురు. ఈతఁడు కలకత్తాలోని వార్తాపత్రికలకు విలేఖరి యగుటచేత నెట్టిస్థలములందు నాతని ప్రవేశమున కాధారముండెను. తీరికగనున్న సమయములందు చిన్నపిల్లలకు చదువును సంగీతమును గఱపుచు కొంతధన మార్జింపుచుండును. వానికిరువురు సోదరులుండిరి. వారు కుట్టుపని చేసియు ధనము గడించుచుండిరి. చెల్లెండ్రిరువురు నవివాహితలగుటచే వానిరాబడి యినుమడింపుచుండెను. ఈతనియభివృద్ధి నసహ్యముతో చూచువారు కొంద

రుండినను వారినెల్లరను తనకువశ్యులుగ జేసికొనుచుండుటచేత నెల్లరు ను తమకేదేని పనియున్నచో పోయి కరంచందునడుగుదము రండి యనుచుందురు.

పైకి చాల మంచివాడుగ కనబడుచుండినను వానికి ధనాశ మెండు; తాను ధనవంతుడు కావలెననియు, పేరు ప్రతిష్ఠలు సం పాదింప వలెననియు, వాతడు కోరుచుండును. నక్కవలె జిత్తులమా రియు, కుశాగ్రబుద్ధియునగు వాతడు గ్రామస్థులందరకును తలలోని నాలుకవలె మెలగుచు, నెక్కడజూచిన తానైయుండెను. అతనికి తెలి యని సంగతు లాయూరలేవు.

సర్వసాధారణముగ నీయూరననేల? దేశమంతటను " అ డువారినోటిలో నూవుగింజ నాన"దన్నట్లు స్త్రీలమూలమున సంగతు లన్నియు బయుటపడుచుండును. చెల్లెండ్రసాహాయ్యముచేత నాయూరి సంగతులనెల్ల దెలిసికొనుచుండుటచే వాతడు "నాకుదెలియని సంగతులుండునా" యని చెప్ప సాహసించుచుండెను. అట్టివానికి కమలాకరునివృత్తాంత మొక లెక్కా? వారెల్లరును శకటము నధి ష్ఠించి పోవునపుడు వారి కాకమలాకరునిసంగతి వాతడిట్లుచెప్పుటకు ప్రారంభించెను.

కమలాకరుడు సంవత్సరమంతయు కలకత్తాలోని తన ,,రమా విలాసము'' నందుగడపుచుండును. అతని తలిదండ్రు లిరువురును స జీవులైయున్నారు. అతని తండ్రియగు ధర్మపురజమీందారు కొంత కాలమువఱకును చట్టనిర్మాణ సభ్యుడుగ నుండి కొలదికాలముక్రింద టనే రాజకీయ విషయములందు పాల్గొనుట మాని గృహమునందే నివసించుచుండెను; అతని జననియు గౌరవనీయమగు కుటుంబమునందు జన్మించిన యొక యపురూపసుందరి. ఆమెసౌందర్యముయొక్క ప్రతీతి

చాలవఱకును వ్యాపించియుండెను. భవాని యౌవనముననే ధర్మపురేశుని చేపట్టి సుఖముగ కాలము గడపుచుండెను; వారిరువురి ప్రేమంపు బీజమే కమలాకరునిరూపు దాల్చెను.

కమలాకరుఁ డిప్పటి కిరువదిరెండేండ్ల ప్రాయమువాఁడు. అతఁడు పచ్చని శరీరకాంతియు, దృఢమగు దేహమును, గల్గి సుందరులలో సుందరుఁడని పేర్వడసి యుండెను. అతని ముఖబింబమున లక్ష్మీకళ తాండవమాడుచుండును. వానిముఖ మాతనిఁ జూచినవారికెల్ల రకు వాతఁడు సచ్ఛీలుఁడనియు, సుగుణాలపోవనియు, సత్యవాక్పాలనాసక్తుఁడనియు చెప్పక చెప్పుచుండెను; మిగుల భూతదయాపరుఁడు. పట్టపరీక్షయందారితేరి బహుమతులు వడసెను. తలిదండ్రులవలన సంక్రమింపఁబోవు ధనముగాక పెదతండ్రి యిచ్చిపోయిన యాస్తివలన వాతనికి సుమారు రెండువారువేలరూప్యముల యాదాయము వచ్చుచుండెను. దానితో నాతఁడు సుఖముగ కాలము గడుపుచుండెను; అతఁడు సంవత్సరమున కొక నెలయో రెండు మాసములో పాటలీపుత్రమున కనతిదూరములోనున్న సీతాసదనమున నివసింపుచుండును.

వీరిట్లు ప్రసంగించుకొనుచుండఁగా శకటము కమలాకరుని గృహారామమును సమీపించెను. శీతాసదనమున మనయధికారులు తలంచినట్లుగాక నెల్లరును మేల్కాంచి యుండిరి; కమలాకరుని పెంపుడుకుక్క వారినిజూచి బిగ్గఱగ నఱువనారంభించెను. వాని ముదుసలిసేవకుఁడగు రాఘవుఁడు బైటకువచ్చి కుక్కనదలించి వారిని సన్మానించి లోనికిఁ గొంపోయెను.

## ౭ వ ప్రకరణము



### తంతి వార్తలు

ఢక్కాలో జమీందారుగారి గృహమొక రెండంతస్తుల మేడ. ముందువెనుకల స్థలము కుశలమైనను, నివాసయోగ్యమగుగృహములలో నొకటి. దానియందు రెండుచావడులును, నాల్గుగదులును, మేడపై నాల్గు గదులునుగలవు మేడపయిగదులు రెండింటిలో జమీందారుగారి పుస్తకములును, వ్రాతసామానులును తుపాకులు మొదలగు వనిముట్లునుండెను. మూఁడవదియగుగృహము నాలుగవదికమేలాకగునదైయుండెను క్రిందిచావడులువిశాలములై కుర్చీలు, మేజాలు, సోఫాలు, ఛాయాపటములు, రవివర్మచిత్రములతో నలంకృతమై యుండెను. జమీందారు ప్రాచ్యలిఖితపుస్తకసంచయసంపాదనోత్సాహుండగుట వాని భాండాగారము చాల విలువగలదైయుండెను అతఁడు చిత్రలేఖనాదికార్యముల కాలముఁబుచ్చుచు నిరంతరజ్ఞానసంపాదనాతత్పరుండై యుండెను.

అరువదియైదేండ్ల ప్రాయమువాఁడైనను నాయన దార్ఢ్యము చెడని బక్కపలుచని చామనచాయశరీరము గలిగియుండెను పెద్దదగు నాసికయు, విశాలములగు నేత్రములును, వెడఁదయగు ఫాలభాగమును గల్గియుండెను. అతఁడు మాటిమాటికిని పొడుముపీల్చుచు, తాను లిఖించుచుండిన చిత్రపటమును చూచుకొనుచు కూర్చుండియుండ నొకదినమున [illegible]దేవి తనభర్తను సమీపించెను. ఇదివరకెన్నఁడును కానిసమయమున నిజసతి తన్ను సమీపించుట యెఱుఁగనివాఁడగుటచేత నాతం డేదో యాపద సంభవించెనని శంకించి యాత్రముతో 'ఏమిసమాచారము" అని ప్రశ్నించెను.

"గొప్పయాపద తటస్థించెను".

"ఏమీ! కమలాకరున కేమియు హాని వాటిల్లదుగదా!"

"లేదు. అతనికి ప్రాణభంగము కాలేదు. కాని యంతకన్న నెక్కుడు జరిగినది."

"ఏమిటో చెప్పుము వినుటకు సంసిద్ధుఁడనై యున్నాను." అని గద్గదస్వరముతో బల్కెను, జమీందారు.

చేతనొక యొట్టని కాగితమును చూపుచు నామె,

"ఇదే మన కుమారుని వృద్ధసేవకుని దగ్గఱనుండి వచ్చినవార్త." అనుటయు వణఁకుచున్న చేతులతో దాని నందికొని జగత్కిశోరుఁ డీరీతిగా చదువనారంభించెను. "గొప్పవిపత్తు. కమలాకరుఁ డిండ్లు కొల్లఁబెట్టెననియు, ధనపురేశుని తుపాకితోఁ గాల్చెననియు నింద మోపిరి. సాక్ష్యము ప్రతికూలము. మాటలాడఁడు. ఏమియుఁ దోచదు; తత్క్షణము రావలెను. రాఘవుఁడు."

ఇది విని జమీందారు కాగితమును బల్లపైనిడి నిశ్చలుఁడై "ఇది యసంభవ" మనియెను.

"తిన్నఁగా చదివితిరా?"

"చదివితిని. మన కుమారుఁ డిట్లు చేసినాడన్న నమ్మకెట్లు. నీ వట్లు తలంచినచో నిజమగు తల్లివి కాఁజాలవు. కమలాకరుఁడేమి యిట్లొనర్చుటేమి? సర్వము కల్ల."

"తంతియం దట్లుండ లేదా?"

"ఉన్న నేమి?'

'సాక్ష్యమున్నదఁటగాదా?"

"సాక్షులు లేనిచో వానిని పట్టుకొని ఖైదుచేయుదురా? కాని యింతమాత్రమునకే నిజమైయుండునా?"

"వాఁడు జవాబు చెప్పలేదుగదా!"

"నన్నెవ్వఁడైన దొంగతనము చేసితివన్నచో లేదని వానితో నప్పుడే వాదింతునా?"

"పోనీ! రాఘవుఁడు నమ్మఁటలేదా?"

"వాఁడు ముసలిముర్ఖుఁడు." అని యొక పొడుముపట్టును ముక్కులో కెక్కించి "అది యటులుండనిమ్ము. ముందు కార్యము నాలోచింతము. కమలాకరుఁడానందను ప్రేమించుటలేదా?"

"అగును. నిజముగ నామె నారాధించుచున్నాఁడు."

"ఆమెయో?"

"అంతకంటె మిన్నగ వలచినది."

"ముహూర్తనిశ్చయము జరుగలేదా?"

"అగును. మూఁడురోజులక్రితము జరిగినది."

"కొలఁదిదినములలో నొక గృహస్థుకానున్న వాఁడిట్టి దుష్కార్యము నెట్లు చేయఁగలఁడు? కమలాకరుఁడు, నాపుత్రుఁడు, సన్మార్గవర్తి, సద్గుణశాలి. రతనాలమూట యిట్టి తుచ్ఛపుఁబని చేయునా? అదెన్నటికిని సరికాదు. ఇఁక ధైర్యము వహింపుము. పొమ్ము. నాపని నేను చూచుకొందును."

అనుమానము ప్రాణసంకటమైనను నమ్మకమును మించిన దీ ప్రపంచమునందు లేదు. నమ్మకముతోఁ దైర్యోత్సాహములతో పల్కిన తన నాధుని వాక్యములాలించి భవానికి పూర్వోత్సాహము మరలివచ్చెను. చిఱునగవుతో "నిజముగ నేను చాల భయపడితి" నని పల్కెను. "తల్లియే యిట్లనుమానించిన నింక నమ్మువారెవరుందు" రని జగత్కిశోరుఁడు చిఱునవ్వు నవ్వెను. భవానియు నిఁక తనసూరా తంతివార్తను చదువుచు "ఇట్టిస్థితిలో నెవ్వరు నమ్మకుండఁగలరు"

"ఏల? తారానాధుఁడు మాన్యుఁడు; సన్మార్గుఁడు; కోపిష్ఠి యైనను చాల మంచిమనిషి" అనియె. జగత్కిశోరుఁడు,

"కమలమున కాతఁడన్న గిట్టదు

"అయిననేమి?"

"వారిరువురును పెక్కు సార్లు జగడములాడిరి."

"తారానాథుఁడు కోపి · అతివాదులమని మనలను జూచిన వాతనికీసు మెండు. అందువలన త. ప్పులు రావచ్చును.

"కమలాకరుఁ డాతనిమీఁద వ్యాజ్యము తెచ్చెను."

"దానిలో తప్పేమియు లేదు. అతనికిని మనకును చెఱువు విషయమై మనస్పర్థలున్నవి. తన యిచ్చవచ్చిన ట్లాతఁడాకోదకమును తానుపయోగించవచ్చునని యాతఁ డనుకొనును. కాని, నిజముగా నది మనదే. మనభూములన్నియును పాడైపోవుచున్నవి; ఆకారణమున సహజశాంతమూర్తియగు మాసోదరుఁడును వానితో తగవులాఁడు చుండెను. వాని వారసుఁడగు మనకుఱ్ఱవాఁడును తగవులాడవలసి వచ్చినది.

"అది వానిదోసము కాఁజాలదు.

"అంతియేకాదు. మఱొకటి యున్నది.

"ఏమది?" యని ధర్మపు రీశుఁడు పృచ్ఛఁ జేసెను.

అది నాకుఁ దెలియగ నాఁడె తెలిసినచో చాలబాగుండును.

"కమలమేదైన సూచించె యేమి?"

"లేదు గాని నా కిదిమాత్రము తెలియును కటకమునమీఁ ... గారియింటిలో నున్నారమన పిల్లను చూచుట తటస్థించెను. ఆమె మిగుల సుందరత్తె. మే మాతెరువాతివారములో వింగు చేయఁబోవు చుండుటచే నామెను రిమ్మని సీ నడలించితిని. ఆమె రానని చెప్పి నిరాకరించెను"

'ఆమెకట్టిది యిష్టము లేదుగాఁబోలును!'

"అమరునాఁడే నేను కమలాకరునితో నీసంగతిని చెప్పఁగా నతఁడును చాలకోపముతో నట్టివారిని పిలువకూడదనియు కొన్ని కారణములచేత వారిని చూచుటకు తన కిష్టము లేదనియు చెప్పెను."

ఇంతవఱకును జరిగిందా రీవాక్యములను వినిపించుచుఁ గమలాకరుండ నను చిట్టచివరవాక్యము వినుట కోడనే

"అట్లయిన కమలాకరుఁడు సహించుకొని యున్నాఁడు. అంతి మూత్రిమున వానిని చంపునా?"

భవానియు నింక నావిషయమై తరచితరచి యడుగుట మాని "ముందు చేయవలసిన దేది?" యని ప్రశ్నించెను.

ఆమె యిదివరకెన్నఁడు నాలోచించుట కలవాటుపడి యుండలేదు; ఇదివరలో నామె యిచ్చవచ్చినట్లు చేయుచుండెను; ఇంటి పెత్తన మంతయు నామెపై వదలివేసిన కారణమున నామెయే గృహ కృత్యముల నెల్ల చక్కఁ జేయుచుండెను. ఎవరి కేది కావలసినను వా రామెన డుగవలసినదే. ఇపు డామె యిట్లడుగుట యాతని కాశ్చర్యము గలిగించెను. అతఁడు ప్రథమమున చేయవలసినది కమలాకరుని చెఱనుండి తప్పించుట, సరే, చూతము; మఱి యొక న్యాయవాదితో నాలోచింతము

ఇంతలో నొక సేవకుఁడు తలుపు తెఱచి కాగిత మొకటి తెచ్చి యిచ్చెను. దానిపై "రహస్యమగు తంతివార్త" అని యుండెను. అతఁడు దానిని తెఱచి యిట్లు చదివెను,

తత్క్షణము రావలెను. కమలాకరుఁడు చెఱలో నున్నాఁడు. నేరము మోపినారు. అందఱు దోషి యనుచున్నారు. సమ్మతించ కనుచున్నారు. అసత్యమైన యభవాదు. న్యాయాధిపతి ముఖర్జీ. కమలాకరుఁడు నిర్దోషియని నమ్మెదను, అగ్రహ మెఱుఁగను. మాతాతయు

నేనును మీయాజ్ఞానువర్తులము. మీసాహాయ్య మత్యావశ్యకము— తప్పక రావలెను— ,,ఆనంద."యని యుండెను''

"ఆహా! యింకేమున్న"దని భవాని బలికెను. ఇదివరకే మనస్సు దిట్టముచేసికొనియున్న జగత్కిశోరుఁ డించుకయు చలింపక యే "ధైర్య శాలియగు నానందకో కమలాకరుఁడు నిర్దోషియని నే నేకీభవించు చున్నాను. కాని, యిపుడాతఁ డాపదలో నున్నాఁడు. భయములోనున్నప్పు డాతనిచేత నేమైనను పలికింపవచ్చును.'' అనెను

"ఇఁక మనము చేయవలసినదేమి?"

"నీ విప్పుడే పాటలీపుత్రమున కరుగుము."

"ఒంటిగనే?"

"కాదు. మన న్యాయవాదితో నాలోచించి రాజకీయవిషయములలో ప్రాజ్ఞానివాఁడును, తెలివితేటలు గలవాఁడును, వాగ్ధోరణి గలవాఁడును నగు నొక న్యాయవాదినికూడ బంపెదను; సేవకా! నీవు పోయి మన న్యాయవాది కీలేఖనిచ్చి ప్రత్యుత్తరముఁ గొనిరమ్ము" ని సేవకునంపెను; కొంతకాలమునకు సేవకుఁ డొక పురుషునితో తిరిగి వచ్చెను. అతని పేరు రవీంద్రుఁడు. అతఁడు నెమ్మదియైనవాఁడు. వయస్సు ముప్పది లేక ముప్పదియొక్క వత్సరము లుండును. అందగాఁడు; ఏకసంతగ్రాహి; చురుకైనవాఁడు; మంచివక్త.

ఆతనిఁ గాంచినంతనే జగత్కిశోరున కాతనియం దొకవిధ మగు వాత్సల్య ముదయించెను. అతనితో కొలఁదికాలము ముచ్చటించెనో లేదో కాని వానియందు మంచినమ్మక ముదయించెను. ఆతని కీసంగతినంతయు బోధించినతరువాత వాతనికి తమకు పాటలీపుత్రమున స్నేహితులెవరో విరోధులెవరో చెప్పి ముఖ్యముగ తమకు ప్రాతస్నేహితుఁడగు సురేంద్రనాథుని సాహాయ్యమును కోరవలసిన దని చెప్పెను.

ఆరాత్రియే భవానియు రవీంద్రుఁడును పరిచారికాసహితులై పాటలీపుత్రమునకు బయలు దేఱి.

---

## ౮ వ ప్రకరణము

### మిథునపురేశుఁడు

డక్కానుండి పాటలీపుత్రమున కరుగు రైలుబాట యనేక వంకరలు తిరిగియుండుటవలన ప్రమాదములు తరచుగా తటస్థించుచుండెను ఆకారణమునఁ నధికారులు బండ్లన్నియు గంటకు పదిమైళ్ళకు మించి పోఁగూడదని శాసించిరి

మరునాఁడుదయమున బాటసారులు పాటలీపుత్రము చేరిరి. వారిరువురును రేయియంతయు నిద్దుర లేకుండ గడపుట చేనలసియుండిరి. వారు రాత్రియంతయు కమలాకరునిఁగూర్చి ముచ్చటించుకొనుచుండిరి. కమలాకరుఁ డంత వానిని తగిన నిదర్శనములు లేకుండఁగనే చెరలో నిడుటకు న్యాయాధికారులు సాహసింపజాలరనియు, నాతఁడు నిర్దోషి కావచ్చుననియు రవీంద్రుఁ డనుమానించెను. ఆకారణమున నాతనివాక్యములు భవానికుత్సాహజనకములుగనుండలేదు.

'ఆనందమనకొకబండి పంపిన నెంతయు బాగుండుననీ" భవాని పల్కెను.

"ఏల? " యని రవీంద్రుఁడు ప్రశ్నించెను.

"నేనీ యూరివారి ముఖములనుచూడఁజాలను. "

,,మీరు నావాక్యములను పాటింతురేని మీరు ధైర్యము వహింతురు గాక" యని కోరెదను. తల్లియగు మీరే విచారమును సూచింపుచు, ననుమానించినట్లు గన్పట్టినచో గ్రామస్థులందరును కుమారుని తల్లి నమ్మజాలకుండుటచేత నాతఁడు దోషియని నిర్ధారణ

చేయుదురు. మనము మొదటినుండియు ప్రజలకుదోషాభిప్రాయములకు తావీయుగూడదు. "ప్రజావాక్యంచకర్తవ్యమ్" అనునట్లు జ్యార్జ్లు పదుగురాడుమాటను పాటింతురు.

,,అది నిజమే"

"అందుచేత మీరు లేనిధైర్యము నవలంబించి కన్నీటిని తుడిచికొని యేమియు ననుమానించనిదానివలెను, మీకుమారుడు నిర్దోషియని నమ్ముచున్నదానివలెను నటింపవలెను" అనుటయు భవాని యట్లు చేసెను. చీరనుసవరించుకొని, తలకట్టును సవరించి, బాష్పములను చిరకొంగుచే తుడిచికొనెను. ఆమెకు సహజముగ మనోదార్ఢ్యము మెండు. ఇపుడామె పూర్వముజూచిన భవానికాదు. రవీంద్రుడామె కప్రజ్ఞకచ్చెగన్గొందెను.

ఇంతలో బండి నిలచెను. పాటలీపుత్రము లోని జనులందరు నచట నుండినట్లుండెను. గతరాత్రియే వారెల్లరు కమలాకరునితల్లి యచటకు రానున్నదని తెలిసికొనిరి. ఆమెనుజూచుటకై వారెల్లరును తండోపతండములుగ నచటికి రాసాగిరి. రైలువచ్చునసమయమునకుస్టేషనంతయు క్రిక్కిరిసిపోయెను. ఆమెవద మెట్లున్నదో, విచారమునూచింపుచుండెనో క్రోధసమెట్లున్నదో చూడవలెనని వారికి యాశ మెండుగనుండెను, ఇదివరకే కమలాకరుడు నేరస్థుడని పట్టణమంతయు నెంచుచుండెను. అతడు కేవలము జమీందారునకే యుపకారము ను తలపెట్టి యుండినచో వారంతగ పాటించియుండరు; కాని, పిల్లలతండ్రియు వృద్ధుడునగుకృష్ణుడును, చిన్నవయస్కుడగు రాముడును, నిష్కారణముగ మరణముపాలైనందులకు వీరెంతయు వగజెందిరి. ఇంక నిరువురకు గాఢములగు దెబ్బలుతగిలి దావుబ్రదుకులలో నుండుట యు, వారియాగ్రహము నినుమడింపజేసెను. భవానీరవీంద్రులయాగమనమునకు పూర్వపుదినమున నాయిరువురి కళేబరములకును దహ

సంస్కారములు జరుపఁబడెను; కృష్ణుని భార్యాపుత్రులు దిక్కుమాలినవారై, యసహాయులగుట వారిదయకు పాత్రులైరి. దీనికంతకును కమలాకరుఁడే ముఖ్యకారణముగ వారు భావించిరి, వారెల్లరును కమలాకరుని తల్లిని గేలిసేయు నుద్దేశముతో బయలుదేరిరి. రవీంద్రుని వెంటనంటి యరుదెంచు నామెనుగాంచినతోడనే వారు "అదిగో వచ్చిన" దని యరచిరి. కొందరు "ధైర్యమునటింపుచున్న" దనువారును; కొందరు "ఆమెకుమారుఁడు నిర్దోషియని నమ్ముచున్న" దనువారు నైయుండిరి; ఆమెయు వారినిఁగాంచినంతనే ద్విగుణీకృతోత్సాహపూరితయయ్యెను. వారిలోకొందరు తన్నుఁ జెంగినవారు గన్పట్టినతోడనే వారితో నామె "చూచితిరా! మాకెట్టి దుర్యశము వాటిల్లినదో? కలనైన నిట్టివి జరుగునని తలంపనగునా? కమలాకరుఁడేడ ? హత్యచేయ నమకట్టుటేడ? ఏదోపిచ్చియభిప్రాయపడి ముఖర్జీగారిట్లు చేయుటన్యాయమా? చూచితిరా, న్యాయాన్యాయ విచారణాసమర్థత? నిన్నటి తంతివార్తామూలముగ నీసంగతి తెలిసి కలకత్తాలో న్యాయవాదులలో శ్రేష్ఠుఁడగు రవీంద్రనాధునితో నిచటికివచ్చినాను ' అనిచెప్పెను.

ఈస్తుతివాక్యములను విని రవీంద్రుఁడు సిగ్గుపడెను! అతఁడు ముఖస్తుతియనిన నేవగించుకొనుచు. అట్టి పరిస్థితిలో కాదనుటకువీలు లేదు. ఇంతలో విధివశమున నొకబండివచ్చెను; అది మిధునపురేశునిది. వారు దానినధిష్ఠించి ప్రజలను వీడ్కొని వెడలిపోయిరి.

పూర్వకాలమందు మిధునపురపు జమీందారు గొప్పపదవిలో నుండెను. వారివంశము పురాతనమై యశముఁగాంచినది. వారు తక్కినవారితో గలసియుండక యితరవంశముల వారి ననూయతతో చూచుచుండిరి. కారణాంతరమున వారి యైశ్వర్యము క్షీణింప మొదలుపెట్టెను. ఇపు డావంశమునకంతకును మిగిలినవాఁడుభవానీశంకరరాయ

లోక్కుఁడే. ఆతనికుమారుఁడును కోడలును కొలఁది కాలముక్రిందటనే యాఁడుపిల్లనొకతె వాతని కాధారముగ జేసి కాలధర్మము నొందిరి. ఆవృద్ధుఁడు నా బాలికను తలిదండ్రులు లేనిలోపము లేకుండఁగ నత్యంతాదరముతో పెంచుకొనుచుండెను; ఆమెకిరువురు మేనత్తలుండిరి; వారు నామెయందు బద్ధానురాగలై యుండుటఁ జేసి యామె వారిచేతులందు పెరుగుచు దినదినప్రవర్ధమానయై యొప్పుచుండెను. సర్వసాధారణముగ సర్వేశ్వరుని నిర్మాణమై చిత్రమెట్టిదో కాని నిరుపేదలకింటినిండ పిల్లలుండుటయు, ధనాఢ్యులకసలు లేకుండుటయు ఘటస్థించుచున్నది. కాని, వీరినోములపంటయో యన్నట్లు బాలికయొకర్తుండుటచే వారామె నల్లారుముద్దుగ పెంచుకొనుచుండిరి. ఆమెకు రెండేండ్లు నిండకపూర్వమే దేశములోని యాటవస్తువులన్నియు నామెకు వారు కొనిపెట్టిరి. ఆమె దుస్తులను వర్ణింపవీలులేదు. ఆ బాలిక శుక్లపక్షచంద్రునివలె దినదినాభివృద్ధినొందుచు మనకథ ప్రారంభమగునప్పటికి షోడశవర్షప్రాయయైయుండెను. ఇంకొకపిల్లయైన గారాబముచేత పాడయిపోవలసినదే; గాని, యామె సుగుణవతియై యానందమునఁగూర్చుచుండుట చేత వారామె కానందమయియని పేరిడిరి.

కొండొకనాఁడొకరియింట విందుసందర్భమున నామె కమలాకరసందర్శన ప్రాప్తిఁజెంది మోహభ్రాంత యయ్యెను. కమలాకరుఁడు నామెఁగాంచి చకితగాత్రుఁడయ్యెను. వారిరువురియభిప్రాయములు నేకీభవించుటయు, తలిదండ్రుల యనుమతి వడసి వా రుద్వాహము చేసికొన నిశ్చయించుకొనిరి. తనమనుమరాలు తన్నువిడిపోవునను విచార ముదయించినను, తానుగూడ నామె ననుసరించుటకు కమలాకరుని యనుమతివడసి భవానీశంకరుఁడు వారివరిణయమునకియ్యకొనెను. మనుమరాలి నాడించినట్లుగనే యామెబిడ్డలను గూడ నాడింపవచ్చునని వానిసంతసమునకు మేరలేకుండెను. పెండ్లికితగు ప్రయత్నములు జరగుచుండెను

ఇంతలో నన్ కమలాకరునిబందిగవార్త వినవచ్చుట వారియానందమున కంతరాయము గల్పించెను.

మొట్టమొదట యానంద యించుక చలించినను, తనప్రియుని గుణములను పూర్ణముగ నెఱింగిన వాఁకిది నమ్మకము గల్గించలేదు. ఆమె కాతఁడెట్లయిన చెఱనుండి విముక్తిఁజెందుననియు, వాని నిర్దోషిత్వము స్థాపింపబడుననియు, పిమ్మట వివాహము జరుగుననియు గట్టిగ నమ్మకముండెను. ఆ కారణమున నామె భవానికి తంతినంపెను.

ఆనంద పితామహునిగృహము చాందినీచౌకునకు త్తరదిశగ నుండెను. అది నాలుగుమండువాలలోగిలి. నవీనముగ నిర్మింపఁబడిన దైనను పాశ్చాత్యపద్ధతిననుసరింపక స్వదేశజుల యాచారము ననుసరించి నిర్మింపఁబడినది. విశాలమై, నివాసయోగ్యమై యుండినను చూచుటకంతయందముగ నుండలేదు. ఆనందప్రభృతులు చావడిలోఁగూరుచుండి ప్రసంగింపుచుండిరి. ఇంతలో నశ్వములధ్వని యయ్యెను. ఆనంద సంతోషముతో వారినందరను విడిచి వీథిలోనికి పరువెత్తిపోయెను

---

## ౯ వ ప్రకరణము

### ప్రేమామృతము

బండి నెక్కినపిమ్మట భవాని నిజసుతునివలె వాపోవఁదొడంగెను. ఆమెకు ధైర్యముఁ గరపుటకై రవీంద్రుఁడు వివిధప్రయత్నములు చేయుచుండెను. ఇట్లు కొంతకాలము గడచునప్పటికి జమీందారుగారి యింటిముంగిట బండినిలచెను. ఆనందవచ్చి యామెను కౌఁగిలించుకొనెను. భవానిశంకరుఁడును కుశలప్రశ్నలొనర్చి వారిని లోనికిఁ దోడ్కొనిపోయెను. పాపము క్రొత్తవాఁడగు రవీంద్రుని కేదియు తోచుటలేదు. వారందరును లోనికేగినంతనే గొల్లుమనిరి

ఆనంద యిప్పుడు పదునారేండ్ల బాలికయైయుండెను. ఆమె మూర్తీభవించిన సౌందర్య దేవతయనుటకంటె వేరుగ వ్రాయనవసరము లేదు. పూర్వపు కవులందరును స్త్రీల సౌందర్యమును వర్ణింపుచు సర్వావయవములనే కాక, కాలివ్రేళ్ళగోళ్ళ [illegible]చ మట్టి సహితము పొగడుచుండుట యాచారమైయుండెడిది. కాని, నవీనులకట్టివి రుచింపకుండుటచే నొక మాటలోనే పోనిచ్చుట యాచారముగనున్నది. మనమును వారి పద్ధతినే యవలంబింతము.

జమీందారు మాత్రము డెబ్బదియేండ్ల ప్రాయము వాఁడు, సర్వసామాన్యులకన్న కొంచెము పొడగరియు, బలిష్ఠుఁడునై యుండెను అతనిముఖమునందు నిరంతరము చిఱునగవు తాండవ మాడుచుండును.

ఇఁక యానంద మేనత్తల్లనో సన్ననిపొడవగు శరీరమును, చామనచాయ దేహములును గలిగి యందగత్తెలు కాకున్నను, అనాకారలుగాకుండిన వారిలో గణింపఁదగినవారై యుండిరి. వారు సామాన్యముగ దుస్తులను ధరించుచుందురు; ఆనందకొరకు ప్రాణమైనను కుదువ బెట్టుటకు సంసిద్ధలు వారందరికంటె నెక్కుడుగ నేడ్చుచుండిరి ఆమెనుజూచి "అయ్యో! పిల్లా! యెంతగ తిపట్టినదే" యనివగవజొచ్చిరి. "తల్లులారా! మమ్మీరీతిగా విచారింపనేల? ఇది కమలాకరుఁడుచూచిన నేమని తలంచును. అతఁడు నిర్దోషి కాఁడా?" అని యామె బాలికయయ్యు, వారి నోదార్పజొచ్చెను. ఆమె నేత్రద్వయ మొకింత పూర్వకాంతిని ప్రసారింపుచుండెను. ఆమెచూడ్కులు రవీంద్రహృదయకవాటములను భేదించి తన్మయత్వము గల్గింపఁజాలెను.

"ప్రాణమున్నంతవరకు నేను కమలాకరు ననుమానింపఁజాలను; అతఁడు దోషరహితుఁడని మనసార నమ్మియున్నాను; నేనెట్లనుమానిం

వంగల్లుదును? నేరము జరిగిననాటిరాత్రియే నాకతఁడొక జాబునంపియుం డెను. నేనది మాతాతకు చూపియుంటిని. అతఁడదిచదివి నాయభిప్రాయమే సరియనియు, నిజముగ నట్టిఘోరకృత్యముఁ జేయసమకట్టిన వాఁడిట్టి లేఖను వ్రాయఁజాలఁడనియు చెప్పెను." అని యానందపల్కెను.

"నిజముగ నేనట్లు పల్కితిని. సరియైనవాఁడెవ్వఁడు నిట్లు తలంపకుండును." అని భవానీశంకరుఁడు హెచ్చరించెను; వానిని పూర్తిఁగా వినకుండఁగనే యానంద"కమలాకరుఁడేదియో ఘోరమగు కుట్రలో పడిపోయెననుట స్పష్టము. ఆకుట్ర మనముకనుఁగొని భేదింపవలెను. విచారించుటకు తగినసమయము కాదు; మనము తగినప్రయత్నములు సల్పుదముగాక" అని భవానిదిక్కయి" ఈసందర్భమున నేను మీ సాయమపేక్షించి వర్తమానము చేసియున్నాను." అని యె. భవానియును, తానట్టి కార్యమునకు సిద్ధురాలనని తెల్పెను.

"మీభర్తగారో?" యని భవానీశంకరుఁడు ప్రశ్నించెను.

"డక్కాలోనున్నాఁడు."

" అతని వరుస యిదియే. ఎంతటివిషయమైన నాతనిని చలింపఁ జేయఁజాలదు. అతని యేకపుత్రుఁడు దుర్దశముపాలైనను, చెరయందుంచబడినను కదలఁడు. ఎంతసాహసము! ఎంతకఠినహృదయము! నాకే కుమారుఁడున్నచో."

" అట్లనకుఁడు. ఆయన కలకత్తాకేగి తగువారలతో సంప్రదించి కార్యమనుకూలించుటకు వలయుప్రయత్నములు సలుపనిశ్చయించెను.

రవీంద్రునిచట కార్యముసలుపుటకు పంపెను. "ఇట్లు భవాని నుడువుటయు రవీంద్రుఁడిదియే సమయ మనితలంచి తన కీవిషయములో జయము గాంతు నని ధైర్యమున్నదని వచించెను. ఆలస్యము త

గదనియు వేగమే తనకిదివరకు జరిగిన సమాచారమంతయుఁ దెలియఁ జే యవలసిన దనియు కోరెను. వారి కావిషయము మీదియు తెలియదయ్యె. అంత వారందరును సురేంద్రు నివిషయమై యడిగి తెలిసికొనవలయు నని నిశ్చయించిరి. ముఖర్జీ విషయమై భవానీశంకరుఁడుగా నాతఁడు

"ముఖర్జీ దుర్మార్గుఁడు కమలాకరుఁడు తన ప్రాణస్నేహితుఁ డని చెప్పికొనుచుండెను. కమలాకరుఁడును వానిని విశ్వసించెను. మేమును మాబంధుగురాలి నొకతె నిచ్చి ముఖర్జీకి వివాహము చే యింపఁదలంచితిమి ; కాని, యిట్టివాని సంబంధమునుండి విముక్తులమ గుటకు మాకు పరిమితానందముగ నున్నద" ని చెప్పెను. పద్మావతి "పాటలీపుత్రములోని జనులెల్లరును కమలాకరుఁడే ద్రోహి యని త లంచుచో వాని స్నేహితుఁడే వానిని శిక్షించెనని చెప్పికొందురుగాక" యనిపల్కెను.

మృణాలిని "ఇట్టి ద్రోహు లేటిమిత్రు" లనియె

రవీంద్రుఁడు "జగత్కిశోరుఁడు సురేంద్రుఁ డట్టిం తొప్పుఁడని వ చించెను; వానిని కలసికొని మాట్లాడుదమా" యనిపృచ్ఛచేసెను.

అందుకు వారెల్లరును వల్లెయనిరి.

సురేంద్రనాథుఁడు వీరెల్లరకును మిత్రుఁడే ; అతండు ప్ర స్తుతము న్యాయవాదివృత్తిని విసర్జించినను పూర్వము నీరిసంస్థాన మున కాతఁడే న్యాయవాది ; పూర్వపరిచితమును పాటించి యాతఁ డిప్పటికి వారికి సలహా నిచ్చుచుండును; వారాతని నడుగకుండ నేప నియుచేయరు. ఆతనిబంధుగుఁడొకఁడు వారివ్యవహారములను చూచు చుండినను అతని సలహానుబట్టియే సమస్తకార్యములును జరుగు చుండును. ఆతనికి పలుకుబడి మెండు. అతఁడు కొలఁదికాలమునుండి యు రాజకీయవిషయములలో పాల్గొనుచు స్వదేశోద్ధరణమునకై తన జీవితమంతయు ధారవోయ దలంపుతో స్వగ్రామమునఁ వసు

మ్యునిసిపల్ కౌన్సిలరుగను పిదప ఛైరుమనుగను పనిచేయుచుండెను. వానినే మేయరనియు పలుకుదురు. అతఁడు నేరము జరిగినతావును వీడి యింటికి వచ్చునప్పటికి ముఖము వైవర్ణ్యము చెందియుండెను. అతని భార్యయు వానిని జూచి "ఏటికిట్లుంటిరి" రని ప్రశ్నించెను.

"గొప్ప విపత్తు వాటిల్లినది."

ఈమాటలు వినినంతనే కృపాణియుభయావహయై కంపించెను

సురేంద్రుని భార్యకు నలుబదియేండ్లుండును. ఆమె చల్లనిశరీరముగల పొట్టిమనిషి. చక్కని మంచివరుసగలిగి యామె ముఖము గుండ్రముగనుండి యాసవతియనఁదగియుండెను. ఆమెనల్లనివారిలో సౌందర్యవతులుందురనుట కుపమానముగనుండెను. ఆమె ధనవతియైనను గొప్ప కొఱంతగల్గియుండెను. సంతానవిహీనులకీ ప్రపంచములో సుఖములేదుగదా? ఎంతటివారికైనను సంతానమే యానందజనకము అదిలేనివారి కిహమునందును పరమునందును సౌఖ్యమసున్న. కొందరు పిల్లలబాధపడలేక, వారిదుఃఖముల ననుభవింపలేక, వారికి సేవలొనర్పనొల్లక, సంతానములేనివా రదృష్టవంతులని తలంతురు. కాని, తనయులే సుఖముల కాలవాలము. వారులేని యిల్లు స్మశానవాటికాసదృశము. తారయు సంతానము లేదని నిరంతరమును దుఃఖింపుచుండును. సంతానప్రాప్తికై యామె నోచనినోములును, చేయనిదానములును, సేవింపని క్షేత్రములును, క్రుంకనితీర్థములును లేవు. ధనవంతులకేలోపమునుండవుగదా. ఆమె మగనియార్జనమంతయు నీవిధముగ ధర్మములకు ఖర్చుపెట్టుచుండినను సంతానము మాత్రము కలుగని కొరత యామెను బాధింపుచుండెను. ఆమెను సమీపించిన యాచకులెవ్వరును రిక్తహస్తములతో వెనుకకు తిరిగిపోవరు. ఆమె భిక్షుకులకు వస్త్రదానమును, ఊరిపిల్లలకు ఫలాహారములును, మొదలగునవి ప్రతిదినము నొసంగుచుండును. ఏవేళలందు నామె సద్గ్రంథ కాలక్షేప

మొనర్చుచుండును. ఆమెను మించిన గృహనిర్వాహకలు లేరని చెప్ప వచ్చును. పతిభక్తియందామె మేటి. మగనికనుకూలవతియై వర్తించుట యందామె చాలనేర్పరియై యుండెను.

సురేంద్రుఁడామెకు నాఁటిరేయి జరిగినదంతయు పూసగ్రుచ్చి నట్లు వినిపించెను. ఆమె చిన్నతనమునుండియు నానందను మిగుల ప్రేమతో జూచుచు, వారియింటికి పోయి యామెనెత్తుకొని ముద్దులాడుచు, బొమ్మలు మొదలగు నాటవస్తువులనొసంగుచు వినోదింపుచుండును. ఇది వినినంతనే యామె దుఃఖపూరితురాలై "ఇఁక నానందమయి దుఃఖముచే చనిపోవునేమోయని భయము దోఁచుచున్నది. ఇంతటి యాపద నెట్లామె సహింపఁగలదు? నేనిపుడేపోయి భవానీశంకరునితో తగినంత జాగరూకత వహింపవలసినదని చెప్పెదను. నాయనుంగుకూఁతురి కింతటి దురవస్థ తటస్థించనే నెట్లూరకుండఁగలను?" అనివిలపించెను. "వలదు. వలదు. నీవుపోవలదు. నేనునుపోను." అనిసురేంద్రుఁడు దుఃఖముతో బల్కెను. అతఁడు విచారభారవినమ్రుఁడై యుండెను. చిన్నతనము నుండియు నాతఁడామెను తనబిడ్డవలెనే చూచుకొనుచుండెను. అట్టి యాపె కిట్టిస్థితిగలుగఁజేసి యతఁడామెనుచూచుటకైన సాహసింపలే కుండెను. అతఁడు నిజముగ వీలయినచో నాగ్రామమునువిడిచిపోయెడి వాఁడే. కాని, మేయరగుట, కార్యభారము పైనుండుటచే నట్లు చేయ వలనుపడకుండెను. ప్రొద్దుటినుండియు నీవిషయమై యాలోచించుట కైన నాతనికి తీరిక లేకుండెను. ఉదయమునుండియు నాతఁడు మంటల నార్పించుటయందును, చనిపోయినవారి కుటుంబముల నూరార్చుట యందును గడపెను. మట్టమధ్యాహ్నమింటికివచ్చి భోజనముచేసెను. ఇంతలోనె రమేశుఁడు మాట్లాడుటకై వచ్చెను. అతఁడిదంతయు కుట్రగా దోఁచుచున్నదనియు, దీనికి ముఖ్యకారకుఁడు శివసింగై యుండునని యు, నిట్టిక్రూరుని, మేకవన్నియ బెబ్బులిని, పట్టుకొన్నచో నిజము

బయటపడుటకేమాత్రము నందియు ముండఁజాలదనియు, వేగ వాని నరసి పట్టుకొనుటకు తగుభటులనంపవలసినదనియు కోరెను. మేయరు నట్లు గావించెను. కాని, భటులు వానిజాడ తెలియలేక తిరిగి వచ్చిరి. శివసింగు పలాయనుఁడగుటయే వాని ద్రోహమునకు నిదర్శనమని రమేశుఁడు వాదించెను. వానిని పట్టుకొనుటకు తనయావచ్ఛక్తిని వినియోగించెదనని సురేంద్రుఁడు వాగ్దత్తమొనర్చెను. రమేశుఁడును సెలవు గైకొని యింటికేగుచు దారిలో పురమందిరమునకేగి యచటివారికెల్లరకును కమలాకరుని యౌన్నత్యమును చూడలేక చేసిన పన్నుగడయని నమ్మకము పుట్టునట్లు పలికెను. కొందరు వాని వాక్యములను విశ్వసించిరి. తన పని ముగియుటతోడనే రమేశుఁడు నిజగృహము చేరెను.

ఇంతలోనే ముఖర్జి పురమందిరమునకేతెంచెను.

అతనిఁ జూచినంతనే యిదివరకే రమేశుని వాగ్ధాటిచేత వశీకృతులైన పురప్రజలు ముఖర్జి నెగతాళిజేసి దూషించిరి. కమలాకరుని యందు క్రోధ మాకారణమున ముఖర్జీ కినుమడించెను. మేయరును కలసికొని పురజనులను మందలించవలసినదని ముఖర్జి వేడెను. సురేంద్రుఁడును విధిలేక సమ్మతించెను. [illegible] రమేశుఁడు తానొకటి దలచిన దైవమింకొకటి యొనర్చెను. తా [illegible]లైన సదభిప్రాయము గలుగజేసినచో పురజనులు వానియందు కార్పణ్యమును వదలుదురని తలంచినను, వారు ముఖర్జీని హేళనచేయుటతోడనే వానికి క్రోధమును, పట్టుదలయు నెక్కుడయ్యెను. కమలాకరు నెట్లయిన దండితునిఁగావింతునని ముఖర్జి శపథముఁ దాల్చెను.

సురేంద్రుఁడీసంగతిసి గూర్చి తలపోయుచుండఁగా నొకరు భవానీశంకరరాముల యాగమన వార్త వినిపించెను. సురేంద్రుఁడును వారిని

లోనఁ బ్రవేశపెట్టుమని యాజ్ఞయిచ్చెను. రవీంద్రుఁడును భవానీశంకరుఁడు నుచితాసనాసీనులైరి. సురేంద్రునకు రవీంద్రుని పరిచయము గలుగఁజేసెను భవానీశంకరుఁడు, రవీంద్రుఁడు తానీగ్రామమునకు క్రొత్తవాఁడనియు, నచటి యాచారవ్యవహారములు తెలియకుండుటచే తానసహాయుఁడై పనిచేయుట దుస్సాధ్యమనియు, కావున నచటి వర్తమానములు దెలిసికొనుతలంపుతో తానచటి కరుదెంచితిననియు సురేంద్రునితో చెప్పెను. సురేంద్రుఁడును వానికి తోడ్పడ నంగీకరించెను. పిమ్మట "కమలాకరుఁడు దోషియని మీరు తలంచెదరా", యని రవీంద్రుఁడు ప్రశ్నించెను. సురేంద్రుఁడును తా నేయభిప్రాయము నీయఁజాలననియు, దోషియనుకొని, నిర్దోషియనుకొని నిశ్చయించుటకు ప్రస్తుతావస్థలో వీలుగానుండలేదనియు, నవీనమోహనుఁడు చెప్పిన దానిఁబట్టి యేది నిశ్చయించుటకు వీలులేదనియు, మేజస్ట్రేటు ప్రశ్నించినపుడు కమలాకరుఁడు తానునిర్దోషినని తెల్పుటతక్క యుత్తరములు పలుకలేదనియు, యేసంగతియు తెల్పుటకియ్యకొనలేదనియు, మేజస్ట్రేటాతనిని ఖైదులోనుంచుటలో నాతని తప్పేదియు లేదనియు, ఈ మాటలు వినినంతనే భవానీశంకరుని ధైర్యము సడలజొచ్చెను. కాని లేనిధైర్యముఁ దెచ్చుకొని రవీంద్రుని దిక్కయి "కమలాకరుఁడాదినమున నేదియో తలంచుకొనియుండెను. అదిమాత్రము నిశ్చయము. ఆరాత్రి వామనుమరాలికి వ్రాసిన లేఖయందు తానత్యంతావశ్యకమగు కార్యమొకటి నలుపవలసియుండుటచే నామెనుజూచుట కానాఁడు రాజాలనని వ్రాసెను. మరియు, నా కార్యమిట్టిదని వ్రాయుటకు వీలులేదనియు, తెలుపుటకైన వీలులేదనియు వక్కాణించియుండెను. ఆకారణమున నాతఁడేదో మహాత్కార్యమును సంకల్పించెననుట నిక్కువము. కాని యీలేఖఁ జూచినచో నాతఁడీ దుష్కార్యమును సంకల్పించి యుండజాలెనని చెప్పుటకు వీలులేదు." అని పలికెను.

రవీంద్రుఁ డాతఁడునిర్దోషియని నమ్మెను. ఎదుటివానినిగూడ తనతో నేకీభవించునట్లు చేయుటకు గంభీరములగు మాటలతో నిట్లు చెప్పసాగెను. "నాయభిప్రాయము వినఁగోరినచో నాతఁడు నిర్దోషియే. ఏలయన, అతఁడు నిర్దోషియైన నిజముగా నెన్నఁడు మనస్థైర్యముఁజూపినాఁడని చెప్పకతప్పదు. నిర్దోషియైనచో సామాన్యమానవుఁడు పరులు తన్నవమానకరములగు వాక్యములను పలికినప్పుడు సహించియూరకుండఁజాలఁడు. వారాతనిని ప్రశ్నించినపుడు తానాదారిని పోలేదనుటకుగాని, పోయిన ప్రదేశమెద్దియో చెప్పుటకుగాని వేరొకప్రబలమగు కారణముండియుండవలెను. అతనికి పరుల కెఱుకపరుపఁగూడని రహస్యముండవచ్చును. మానధనులు ప్రాణములైన కోల్పోవుట కియ్యకొందురుగాని రహస్యవర్తమానములను బైటఁబెట్టుట కియ్యకొనరు. ఈతఁడు నట్టివాఁడై యుండవచ్చును. లేక నిజముగ నాతఁడు దోషియైనచో తాను మసిచేతులు గడుగుకొన్న నీటిని పాఱబోయకుండుటయు, తాను పేల్చిన తుపాకిని పూర్వస్థానముననే యుంచుటయును జూచినచో నాతఁడున్మాదుఁడై యుండవలెను. ఆకారణమున నాతఁడు పిచ్చివాండ్రవైద్యశాలకు పంపఁదగ్గుఁడు. తెలివిగలవాఁడైనచో నిజముగ నేరస్థుఁడైనవాఁడు పరులు తనపై నేరము స్థాపించుటకు వీలగు నిదర్శనములు సాధ్యమగునంతవరకు రూపు లేకుండఁగఁ జేసితీరును." ఇది వారలకు కమలాకరుని నిర్దోషిత్వము నిశ్చయమని తోఁచునట్లు చేసెను. కాని, సురేంద్రుఁడు "మీరు చెప్పినదంతయు బాగుగనేయున్నది. కాని, కోర్టులో చెప్పవలసివచ్చినపుడు నిదర్శనములు లేని వట్టి తర్కము పనికిరాదు. దానికితోడుగ నాతఁడు దోషియని రుజువుఁజేయుటకు ప్రబలసాక్ష్యములున్నవి. మనకు గూడ తగిన ప్రతిసాక్ష్యములు లేకున్నచో నంతయు వ్యర్థమే." యని పల్కెను.

ఆమాటలకు రవీంద్రుఁడు తానును ప్రయత్నించి తగిన సాక్షులను స్వీకరింతునని చెప్పెను. కాని, తానేమి చేయఁగలఁడో ప్రస్తుతము చెప్పలేనని యెను. మొదట నేరము జరిగిన స్థలమును, కమలాకరుని మందిరమును, యెదుటివారి గృహములను, చూడవలెననియు, నచటికి పోవుటకై వారును తనతో రావలసినదనియు కోరెను. వారట్లు గావించిరి.

---

## ౧౦ వ ప్రకరణము.

రాఘవుఁడు

సుమారు రెండు గంటలగునప్పటికి వారు సీతానదనమును సమీపించిరి. ద్వారములన్నియు మూయఁబడియుండెను; మెట్లపై స్థూలకాయుఁడగు నొక పురుషుఁడు కూర్చుండియుండెను; వారాతనిని రాఘవునిఁగూర్చి ప్రశ్నింపఁగ నాతఁడు లోననుండెననియు, ద్వారములన్నియుమూసివైచి యెవరు పిలచినను పలుకనొల్లడనియు చెప్పెను; భవానీ శంకరుఁడు బిగ్గరగ "రాఘవా" యనిపిలచెను; లోపలినుండి యొకవ్యక్తి యెవరుకారని తిరుగ ప్రశ్నించెను; భవానీశంకరుడు "రాఘవా! తలుపుతీయుము; ననుభవానిశంకరుఁడను నీతో మాట్లాడ వచ్చితి"నని పల్కెను; రాఘవుఁడు తలుపు తెరచెను; వానిని చూచిన వారికెల్లరకు వాతఁడు రెండు మూడుదినములనుండి యాహారాదికములనొల్లనివానివలెగన్పట్టెను; వస్త్రములనైన విడచినట్లుండలేదు; చింతామగ్నుఁడై యున్నట్లు మాత్రివాని చెప్పక చెప్పుచుండెను; భవానీ శంకరుఁడు వానిని

"ఇదేమి రాఘవా? యిట్లుంటి"వని ప్రశ్నచేసెను; అంగాలకేది

యు బదులుపలుకలేదు; రాఘవుఁడు తలవాల్చి నిలచియుండెను; కన్నులనుండి యశ్రువులు జలజల పోవుచుండెను.

రాఘవా! యేలపలుకవు; మిత్రుఁడనగు నాతో నీకష్టములను జెప్పుకొనరాదా? తగినసాహాయ్యముచేయుదునుగదా యని మిథునపురేశుఁడు పలుకరించెను.

ఇంకను రాఘవుఁడు బదులుపలుకలేదు. మరలభవానీశంకరుఁడు రాఘవునుద్దేశించి "రాఘవా! ఇతఁడు రవీంద్రనాథుఁడను నొకన్యాయవాది. మనకు సహాయముచేయుటకిచటకు వచ్చెను. నీవలన నెల్లసంగతులును వినఁగోరుచున్నాఁడు. కావున శంకింపక జరిగినసంగతులనెల్ల వివరింపుము" అని హెచ్చరించెను. అంత నాయుసలివాఁడును కన్నులను దుడిచికొని యీరీతిగ నుడువసాగెను

ఈతఁడు మనకుసాయుపడవచ్చిన న్యాయవాదియగుచో సంతోషమే. ఇచటిసంగతులనెల్ల చెప్పఁబూనినచో నాకు దుఃఖముచే హృదయము వ్రక్కలయిపోవును ఆహా! ఎంతద్రోహము! ఎంతకష్టము! నిశ్చయముగ నాయజమానుని పాతాళమునకు త్రొక్కివేయుటకు పన్నిన కుట్ర యిది. లేనిచో యింతటిదురంతముండునా? కమలాకరనాయుఁడేమి హత్యయొనర్చువాఁడ ?

అట్లయిన నిదికుట్రయనితలఁచెదవా? అయినచో నెందునిమిత్తమై యుండును; అని రవీంద్రుఁడు ప్రశ్నించెను.

"ఇదియే నాకును తెలియకున్నది. కాని, కుట్రయనియే నానిశ్చయము. నాకే కాదు. ఇచటపంచాయతీ జరిగిన కాలమందున్న యెల్లరకును నావలె తోచకమానదు. అచటనున్న నాకు నింతకాలమునుండియు, కమలాకరునిపెదతండ్రికాలమునుండియు, కొలిచియున్న నాకే, మొదటకమలాకరుఁడు నిందితుఁడని యనుమానముగ దగ్గెను. ఇటువంటి దిదివరకెన్నఁడును కనివిని యెఱుఁగము. అంతయు నాతనికి ప్రతికూలమే.

అతఁడుపల్కినదంతయు నేరమును వప్పుకొన్నట్లే తోఁచెను. ఆనందభవనమువద్ద నేరముజరిగినదఁట. కమలాకరుఁడా రాత్రి పెడమార్గములఁబట్టిపోవుచుండఁగా జూచిరఁట. అతఁడుపయోగించుతూటా యొకటి కనంబడెనఁట. అతఁడు చేతులుంగడుగుకొన్న మసియున్నదఁట. ఆతనితుపాకియు నిచటనేయుండెనఁట. దానిలో నొకతూటా కాల్చినట్లున్నదఁట. ఆహా! ఇదంతయుకుట్రగానున్నదే. కాకున్న నేమి? ఆముఖర్జీ దుర్మార్గుఁడు. కమలాకరుని స్నేహితుఁడనని చెప్పుకొని వెంటతిరుగుచుండెను. అతనియింటఁగుడిచి యతనిపక్కపై పండుకొనుచుండును.

తిన్నయింటివాసములు లెక్కబెట్టినట్లు వానినేఖైదుచేయుటకనుజ్ఞ యిచ్చెను. ఆహా! ఎంతక్రౌర్యము! ఎంతపాపచింతన నాఁడునిర్భీతుఁడయి వాయజమానునితో "ఇంక నీవునామిత్రుఁడవు కాజాలవు. నీవునిజముగ నీనేరముచేసియే యుందువు." అనియెను. ఆహా! ఎంతమోసగాఁడు. ఇట్లుచెప్పుచుండఁగ భవానీశంకరుఁడు "అట్లయినదంతయు నాకేలచెప్పవైతివి?" అనియెను. ఎట్లుచెప్పుదును? పరీక్ష ముగిసినవెంటనే యీ విశ్వాసఘాతకుఁడు-ముఖర్జీ-యీగృహమునకంతయు తాళమువైచి, గుడ్డలుచుట్టి ముద్రలువైచి నన్ను దీనినంతయు చూచుచుండవలసినదనియు నాకందులకుజీతమియ్యబడుననియు సీళ్లపైనైననంటుకొన్నట్లు కన్పట్టినచో నాప్రాణములుదక్కవనియు నాకానతిచ్చి నామాటలు వినకుండఁగనే వెడలిపోయినాఁడు. అధికారి యానతిని మీరఁజాలక . నిచ్చటనే యుంటిని. అదియుఁగాక కమలాకరుని నీవు తుపాకి నెన్నిదినములక్రితము వేల్చితివని ప్రశ్నింపఁగ సుమారొకవారముదినముల క్రితమని చెప్పియుండెను. కాని, నేను దానిని మొన్నటిదినముసాయంకాలమున శుభ్రపరచియుంటిని. ఇపుడదిశుభ్రముగనేయున్నచో నాతఁడు నిర్దోషియే. లేక అతఁడునిన్నటిదినముననుపయోగించియుండినచో నీతఁడు నేరస్థుఁడని నిర్ధారణయగునుకదా? ఆకారణమున నామనస్సు మొన్ననే తుడి

చియుంటినని చెప్పుమని ప్రేరేపించినను, అట్లు కావించినచో యెట్లుజ రుగునోయని శంకించితిని. నా కాతుపాకి నొకసారి పరీక్షింపవలెనని యున్నది. కాని, వీలయినదికాదు. మరియు సీళ్లువేసిరి. ఒక్కొక్కప్పు డు నాకు నీముద్రలనుభేదించి చూడవలయుననికోర్కెయున్నను అట్లు చేసినచో నేమికీడుమూడునోయని భయముచే యూరకుంటిని నా సహ చరుఁడును నేనును వీలయినంతజాగరూకతతో నీగృహమును రక్షించు చున్నాము. కావున మాదగ్గఱను చేయఁజాలనైతిని; క్షమింపుడు.

ఇదియంతయు వినఁగానే రవీంద్రునకు కమలాకరుని నిర్దోషిత్వమును గూర్చిన యభిప్రాయ మినుమడించెను; మఱలి రాఘవునింక కొన్ని వి శేషవిషయములనుగూర్చి ప్రసంగింపఁదలఁచియు వానిస్థితినిజూచి ప్ర స్తుత మాతలంపునువీడెను. వారెల్లరు నింతవరకును భుజించియుండలే దు; ఆ కారణమున మఱలి రాఘవుఁడు కొన్ని యుపహారములనుగొనివచ్చి వారికొసఁగి భుజియించెను; అధికాధమవిమర్శనలేక వారెల్లరు నొకచో ట భుజించిరి.

భవానీశంకరరవీంద్రనాథులు చింతానిమగ్నులై యుండిరి. భవా నీశంకరుఁడు దీనిపర్యవసానమేమి కాఁగలదనియు, తనమనుమరాలిని వరిం చిన యాకమలాకరుని గతియేమి కానున్నదోయనియు తలపోయుచుం డెను; రవీంద్రుఁడన్ననో తానువిన్నదంతయు విమర్శించుకొనుచు నేయే విషయములు తమకుప్రతికూలములుగనున్నవో యెంచుకొనుచుండెను. కొంతకాలమైనపిమ్మట రాఘవునుండి కొన్ని విషయములను గ్రహించు నుద్దేశముతో వానిని మాటలలోనికిదింపెను; అంతవారిరువురకు నీక్రిం దిసంభాషణజరిగెను; రవీంద్రుఁడు 'రాఘవా! మీయజమానుఁడీచట కాలము నెట్లుగడపును. అతని స్నేహితులెవ్వరు? బంధుగులెవ్వరైన ని యూరనుండిరా? విరోధులెవరైనను న్నారా?"

రాఘవుఁడు—“ఇచటికెన్నఁడోగాని వచ్చువారముగాము ; వచ్చినపుడు సాధారణముగ నీగృహమందే వసించుచుందుము. కమలాకరరాయలు సాయంకాలమందు తప్ప బైటకుపోఁడు. పగటివేళలందు గ్రంథపఠనమునందును చిత్రలేఖనమునందును వార్తాపత్రికలను జదువుటయందును గడపుచుండును; సాయంకాలము విహారమునకై సమీపారణ్యములలోనికేగును; ఒకొక్కప్పుడు పెరటిలో చెరువునందు చేపలుపట్టుచుండును; ఇక్కడకు తరచుగా నవీనమోహనుఁడు, సురేంద్రుడు, ముఖర్జియు దక్క నితరులు రారు; వారే యాతని నేస్తులు; అతఁడు రాజకీయాభిప్రాయములలో నతివాదియనియు ధనవంతుఁడనియు కొందరికాతఁడనిన గిట్టదు;

అతని కిచట నెవరైన స్త్రీలు స్నేహితులుగనున్నారా?

లేరుకాని యాతఁడానందను వివాహమాడ నుద్యుక్తుడై యున్నాడు; అని యేదియో చెప్పబోయి సంశయించి యూరకుండుటయు భవానీశంకరుడు తానిచ్చటనుండుటచే రాఘవుఁడు శంకించుచుండ నోపునని తలంచి యేదోషముపై నావలికేగెను; అందులకు రవీంద్రుఁడు లోలోన నంతసించి రాఘవుని కూర్చి యిట్లుపల్కెను;

అది నాకు తెలియును; కాని యాతనికుంపుడుకత్తెలు లేరుకదా!

లేరుకాని యాతనిని పూర్వమొకస్త్రీ ప్రేమించి విఫలమై వేరొకనిని వివాహమాడెనని చెప్పుదురు; అదియేకాక పూర్వమాతడు కలకత్తాలోనుండే కాలమున దుస్సాంగత్యముచే నొకతెను చేరఁదీసి యామెతో రహస్యముగ వర్తింపుచుండెననియు దానికై యాతఁడొక భవనమును కొనెననియు చెప్పుకొనుచుండెడువారు; ఇపుడాతఁడట్టి వ్యాపారములను కట్టిపెట్టి సన్మార్గవర్తియైనాడు; ఆతనివంటి సుగుణాఢ్యులింకొకరుండజాలరని నేనునొక్కి వక్కాణింపనగును,

ఆమె యెవతెయో నీకు తెలియునా?

నాకే కాక యెవ్వరికిని తెలియదు; ఆమెకడు జాగరూకతతో వర్తించెననియు పరులెవరికి నామెసంగతి తెలియజాలదనియు తెలియుచున్నది; ఆమె సామాన్యముగ గొప్పయింటిపడుచై యుండవలెను; అతఁడామెను వివాహమాడియుండునేమో కాని కొన్ని యనివార్యములగు కార్యములవలన నట్లు జరుగలేదని నేనూహించెదను; ఇదంతయు జరిగిన కొలఁది దినములకే యాతని పెదతండ్రిగారు గతించుటయు నేనాయననుండి యీతనిం గొలువవచ్చితిని; కాని వారిరువురు నచట గడపుచుండు కాలములో నొక యాంధ్రవనిత సీతయను నామె వారికుపచారములొనర్చుచుండెను; నేనామె నొకసారి యీవిషయమై ప్రశ్నించితినిగాని యామెనెన్నడును జూచియుండలేదని చెప్పియుండెను; వారామెను యీ స్త్రీ వచ్చుసమయమున కేదో పనివంక బెట్టి యావలకు బంపివేయుచుండినట్లును ఆమె వెడలిపోయినపిమ్మట సీత తాను మరలివచ్చుచుండునట్లును చెప్పెను;

ఇదివినినతోడనే రవీంద్రునకు క్రొత్తయూహాలు పుట్టసాగెను; అతఁడాలోచించినకొలఁదిని యీరహస్యప్రవర్తనగల స్త్రీ యెటులనో యీజరిగిన నేరమునకు కారకురాలై యుండవలెనని యాతనికి తట్టెను; కా యదియెట్లు సంభవనీయమన్న సందియము పొడకట్టెను; దాన నాతఁడా యూహను తనమనసునుండి త్రోసివైచుటకు పలుసార్లు ప్రయత్నించియు కార్యము గానఁడయ్యెను; మరలమరల వానికీ యూహయే తోఁచుచుండెను; ఆస్త్రీని తాను మానసమున చూచినట్లును మరల నాగూఢవనిత యాకారము మాయమగుచుండినట్లును భావనాప్రపంచమున నాతనికి తోఁచుచుండెను; ఎట్టకేల కాతని మనస్సును దృఢపఱచుకొని

'రాఘవా! యీవ్యాపార మిపు డంత యుండినట్లు నిశ్చయ మేనా?" యని ప్రశ్నించెను;

అతఁ డానందను పరిణయమాడ నుద్యమించుచుండుటచే నట్లూహింపనగు నని రాఘవుఁడు మారువల్కెను.

ఈరహస్యవ్యాపారమంత యుండుటకిచితగిన కారణమనియాతనికి తోచుచుండినను అతఁడావిషయమై తనయభిప్రాయమును వెల్లడించక "ఇదియెప్పటితో ముగిసినట్లుతలంచెద"వని ప్రశ్నించెను;

ఇది క్రిందటిసంవత్సరమున జరిగినయుద్ధముతో పరిసమాప్తి నొందెనని యెంచెదను; ఏలయన కమలాకరుఁడప్పుడు దొరతనమువారిచే నొకచిన్నసేనకు నాయకుఁడుగ చేయుబడెను; దానిలో నాతఁడు గాయములుతిని పతకమును బడసెను; ఆదినములలోనె వారువిడిపోయిరి గనుక నావ్యాపార మంతటితో ముగిసెను.

"అట్లయినచో నాగృహమింకను నాతని క్రిందనున్నదా?"

"ఉన్నది. సుమారేడెనిమిది మాసముల క్రిందట మాటల సందర్భమున తానాయింటికి మరమ్మతు చేయించవలెననియు, నాయింటిలో నంతయు నాయుద్ధకాలమున నందు విడిసినభటులచే పాడుచేయఁ బడెననియు, నందులకు సుమారొక వేయిరూప్యములు కావలసియుండుననియు చెప్పెను."

"అటులైన మరల నాతఁడు కలకత్తాకు పోనెంచియుండెనా?"

"అగును. పోనుద్దేశించెను. అప్పటి కాతని వివాహము స్థిరపడలేదు."

"అతఁడట్లగుచో మరల నామెను కలసికొనెననియు, నావ్యాపారము సాగింప నెంచి యుండెననియు తోచుచున్నది. అతఁడామాట మరల నెప్పుడైన నెత్తెనా?'

"లేదు"

ఇంతలోనె భవానీ శంకరుఁడు లోనికి వచ్చుచున్నట్లు తెలి యుటకై తలుపును చప్పుడు చేసెను. అది రవీంద్రుఁడు గ్రహించి యొకారేగి "మీకొఱకె కాచుకొని యున్నా"మని పల్కి లోనికిఁదోడ్కొని వచ్చెను. వారిరువురును కూర్చుండిన తరువాత రవీంద్రుఁడు మరల రాఘవుని ప్రశ్నింప మొదలిడెను.

"నేరము జరిగిన నాఁడతఁడెట్లుండెను.?"

"యథాప్రకారమే."

"సాయంకాల మేమిచేసెను?"

"ఎప్పటి వలెనే భుజించి, గదిలోనికిఁ బోయి, యొక గంట కాల మందు గడపెను. పిమ్మట పరిచారకుని కొక లేఖనిచ్చి యానంద మయి కిచ్చునట్లాజ్ఞాపించెను."

"అగును. ఆ లేఖయందు తానాదినమున నామెకడ కనివార్యములగు వ్యాపారము లుండుటఁ బట్టి రాజాలననియు, తనకొఱకై వేచియుండ వలదనియు వ్రాసెను అతఁడామె కట్లు వ్రాయుటఁ బట్టియు, తాను రాజబాటం బట్టి పోకుండుటచేతను, నేదియో యత్యావశ్యకమగు కార్యము చేయవలసి యుండినట్లును, అయ్యది రహస్యమయినట్లును తోపక మానదని భవానిశంకరుఁడు వాకొచ్చెను."

"అగును. ముఖర్జీయు నట్లేపల్కె"నని రాఘవుఁడనెను.

"ఎవరైన నట్లు పలుకవలసినవారే. కాని, కమలాకరుని ప్రశ్నించినపుడాతఁడేమనియె" నని రవీంద్రుఁడు పృచ్ఛచేసెను.

"తన యంగడివానిదగ్గరకు పోయి యుంటిననని"

"అయి యుండవచ్చును"

"నిజమే. కాని, రెండునెలల క్రిందట వారిరువురును తగవులాడిరి. అప్పటి నుండియు వారొండొరులతో మాట్లాడుకొనుట లేదు.

"అట్లా? సరియే. శివసింగును గూర్చి నీయభిప్రాయమేమి?"

"అతఁడున్మత్తుఁడని యిచటివారి నమ్మకము. కాని, వాఁడొ క్కొక్కప్పుడు తెలివి తేటలు గలిగి సంచరింపు చుండును."

"వానినిప్పుడు పట్టుకొనుట యెట్లు?"

"అది సుసాధ్యము కాదు. అతఁడు కాయకసరు లేరికొని తినుచు నెవరికిని కనఁబడకుండ మూఁడు నెలలైనను గడుపఁగలడు. కాని, మన దగ్గర నున్న సుబ్బుసింగుమాత్రము వానిని పట్టుకొనఁ గలడని తలంచెద."

"అట్లయినచో నీవు సుబ్బుసింగు నంపి వాని నెట్లయిన తీసికొని రావలసినదని చెప్పుము." అని వానితో చెప్పి వారింటి కేగిరి.

---

## ౧౧ వ ప్రకరణము.

## స్త్రీలు.

పాఠక మహాశయులారా! రవీంద్రనాథుని ప్రసంగమున, తక్కినవారి సంగతుల నారయుమైతిమి. ఇఁక వీనిమాట లిటులుంచి స్త్రీ సంఘ మెట్లు వర్తించుచుండెనో యించుక విచారించుట మన విధియై యున్నది. ఆనంద దుఃఖపూరితయగు భవాని నూరార్చుటకు ప్రియ త్నించుచుండెను. ఇట్లు కొంత వడికి కుమారవియోగదుఃఖానలతప్తయగు భవాని ధైర్యము తెచ్చుకొని కమలాకరు నొకమారు చెరసాలయందెట్లుండెనో చూచి వచ్చెదమని పల్కెను. దాని కానందయు నల్లెయనియె. వారిరువురును చెరసాలకు పోయిరి. అచట పూర్వకాలము తమ యింట కొలువులోనుండి, తదుపరి చెరసాలకావరిగఁ బ్రవేశించిన మాధవుఁడును వానిని చూచి యానంద వానిని పలుకరించుటయు, వాతఁడు వానినిఁగాంచి, గుర్తుపట్టి వందన మాచరించెను. అంత నానంద

మును తమపూర్వపు సేవకుని కుశలప్రశ్న మడిగినపిమ్మట, తమ కార్యమును వానికెఱుక పరచెను. అందులకాతఁడు సవినయముగ పై యధికారులు తన నెవరిని పోనీయ వలదని యాజ్ఞాపించుటం జేసి, తానట్లు చేయ వీలులేదనియు, నట్లొనర్చినచో తన యుద్యోగమునకు నీళ్ళు వదలు కొనవలసి వచ్చుననియు, క్షమింపవలసినదనియు వేడెను.

అందులకు భవాని వానికింకొక నౌకరి నిప్పింతునని పల్కెను; కాని యాతఁడట్లొనర్చినచో తన కపాయము సంభవింపఁగలదనియు, నట్లు చేయుమనుట వారికి ధర్మము కాదనియు, దీనముగా కృతజ్ఞతా పూర్వకదృష్టులతో వేడుకొనెను. సహజముగ ధర్మస్వభావురాలగు నానంద వాని నావిషయమై బలవంతము చేయక, కమలాకరుఁడెట్లుండె ననియు, నాతఁడచ్చటికి వచ్చిననాఁడెట్లు ప్రవర్తించెననియు మొదల గు సంగతుల నడిగి తెలిసికొనెను. ఆమాటలసందర్భములో హామా ధవుఁడును కమలాకరుఁడాదినమున నానంద కొకలేఖను రచియించి యుండెననియు నది చట్టము ననుసరించి తాను మేజస్ట్రేటున కంపి యుంటిననియు, చెప్పెను. అంతవారాతనిని వీడ్కొని గృహాభిముఖులై చనిరి. ఇంటికి వచ్చినపిదప నీసంగతి మేనత్తలతో చెప్పుటయు, వా రాముఖర్జియెడ నత్యంతకుపితలై తామెట్లయిన నాతని నడిగి జాబు ను కొనివత్తుమని వెడలిపోయిరి.

ఇక నచట ముఖర్జి యెట్లుండినదియు నించుక తెలిసికొనెదము గాక! నేరము జరిగినప్పటినుండియు వానిమనస్సు పరిపరి విధముల పోవసాగెను ; ఒక్కొకవేళ నాతండు తానేల పాటలీపుత్రమునకు న్యాయాధికారిగ నియమింపఁబడవలెననియు, నయినపో, కమలాక రునితో స్నేహమును, వారితోడి సంబంధమును గల్పించుకొననేల యనియు, నీనేరమేల జరుగవలెననియు, కమలాకరుఁడేల నేరస్థుఁడు కా వలెననియు, నియ్యది ప్రనయుత్తరోత్తరములగు వైవాహికాదికార్య

ములకును, బంధుత్వమునకును, మిత్రత్వమునకును యెట్టియాటంకమును గ పరిగణింపఁ బడగల దోయనియు, పలువిధముల చింతింపుచుండెను. ఆకారణమున నాతనికి నిద్రాహారముల యందైనను దృష్టి లేకుండెను.

ఇంకొక్కొక్కప్పుడు కమలాకరుఁడు తప్పక దోషి యనియు, తానువిధివిహిత కార్యమును చేయుచుంటిననియు, నంతియకాక యీనేరమే స్థాపింపఁబడుట జరిగెనేని తనకుగలుగు లాభమునకు మేర లేదనియు,తలపోయుచుండును. మరల నాతనికి కమలాకరుఁడు నిర్దోషి కాకూడదాయనియు, నట్లయినచో తనకిరువంకలను తలంవంపులు తప్పవనియు, నిటుబంధువర్గమునందును, ఉద్యోగస్థులయందును తనకు గలుగఁబోవు నష్టము లపారములనియు,నూరివారెల్లరును తన్ను గర్హింతురనియు, దలచుచుండును. ఇట్లాతఁడు పలువిధములగు నాలోచనలలో మునిఁగియుండ నాఁడంప మేస్త్రీలిరువురు నచటికేగుదెంచి రనువార్తభటుండెఱింగించెను.ఆతఁడును హృదయమును పదిలపరచుకొని వారిని లోనఁబ్రవేశపెట్టుట కాజ్ఞయిచ్చెను.

వారు లోనికివచ్చి, యాగ్రహపరవశులగుచు నిట్టిపయోముఖవిషకుంభము కమలాకరుని పడ కేలరావలెననియు, వాని మిత్రసభాతిథుల వర్తింపవలెననియు, నట్లు మెలఁగి చివరకు వాని ప్రబలశత్రునిగతి ప్రవర్తింప భావ్యమా యనియు,సంబంధ బాంధవ్యము లన్నైన యాలోచింప వలదాయనియు పలుదెరంగుల దూషింపసాగిరి.అతఁడు వారలకు తగు సమాధానము లిచ్చితప్పించుకొనఁజూచెను. చిట్టచివరకు తమకు కమలాకరుఁడు వ్రాసిన జాబునైన నీయకూడదాయని నిందాగర్భముగ వారు పల్కుటయు, నియామమళయాళము బాధల పడఁజాలక దానికి కూడ తనకధికారము లేకున్నను, వారి యెడల గలమోమోటమిచే వారికి నకలును వ్రాసికొనుట కనుజ్ఞ యిచ్చెను. వారట్లొనర్చి, వాని మొగమునైన మరల జూడకయే వెడలిపోయిరి.

ముఖర్జీ ఖిన్నుఁడయ్యెను. కాని, యిట్లు వారు తన కడకేతెంచుటయు, తన్ను బ్రతిమాలుటయుఁ జూచి ముఖర్జీ కమలాకరుఁడు నిశ్చయముగ ద్రోహి కాఁడని నిశ్చయించుకొనెను, కావున సడలిన ధైర్యమును మరల చక్కఁజేసికొనెను.

ఈస్త్రీలిరువురును తమ గృహమును సమీపించినసమయమున నే రవీంద్రుఁడును వారిని చూచుటకై వచ్చెను. ఇంతి వారందరును సంభాషించుకొనుచుండఁగా సుబ్బసింగు శివసింగును దీసికొని వచ్చెను. శివసింగు సమీపారణ్యమున నొక బొరియలో దాగుకొని యుండఁగా తానాతనిని నిర్బంధించి కడుకష్టమున మీఁద తీసికొని రాగలిగితిననియు, దారిలో నాతఁడు తన్నురక్కి, పీకి, కఱచి, తన్ని, పలువిధముల బాధించెననియు సుబ్బసింగు చెప్పెను. అందుల కాతని నెల్లరును ప్రశంసించిరి

ఆతని నెందులకట్లు బాధించితివని వారు శివసింగును పలుమారులు ప్రశ్నించియు కార్యముఁగానరైరి. శివసింగు వారికి తానాకలిగొని యుంటినని మాత్రము చెప్పెను. అంత వారతని కాహారమిడుమని సేవకున కాజ్ఞాపించి, జాగరూకతతో వీనిని చూచుచుండవలసినదిగ భృత్యులకు నియోగించి మాధ్యాహ్నిక కార్యంబుల నిర్వర్తింపఁ జనిరి.

---

## ౧౨ వ ప్రకరణము.

### శివసింగు దొరకెను.

రమేశకవిరాజు వైద్యులందరిలోనను మిగుల పట్టుదలగలవాఁడు. అతఁడు వైద్యపరీక్ష నిచ్చువారెల్లరును నిజముగ మానవాధికులనియు వారివాక్యములు వేదవాక్యములనియు, వారేది చెప్పిన నితరులు నమ్మ

తీరవలెననియుఁ దలంచుచుండును. అయిన నాతఁడు యెవరైననట్లుపల్కి-
నచో నాతఁడు సహింపఁజాలఁడు. ఆకారణమున నాతఁడు తానేది చె
ప్పినను పరులు దానిని రాజశాసనమువలె జూచుకొనవలెనని యెంచు
చుండును. ఆ కారణముననే యీతఁడు తారానాథునిఁ జూచుటకై వచ్చి
యాతనిస్థితినంతయు పరీక్షించినంతనే యీతఁడపాయస్థితిలోనున్నట్లు
తెలిసికొని యితరులెవ్వరు నీతని సమీపింపఁగూడదని యాజ్ఞాపించెను.
చిట్టచివరకు ముఖర్జీనికూడ నావలకుపోవలయునని చెప్పగా నాతఁడట్లు
చేయవలసి వచ్చెను.

అందఱు నావలికేగినపిదప జమీందారుని దేహమునుండు
తుపాకిరవ్వల నాతఁడు సాధ్యమైనంతవరకు శస్త్రముచేసి తీసివైచెను.
పిదప గాయములకు కట్టుకట్టి, జ్వరము రాకుండుటకును, బాధ యిను
మడింపకుండుటకును వలయు నౌషధముల నొసంగి జాగరూకతతో
నాతనికి నిద్రాభంగము కలుగకుండునట్లు చూచుకొనవలసినదని మ
నోరమకు కట్టడిచేసెను. మనోరమయు విచారభారవినమ్రయగుచు ర
మేశుని తననాథుని ప్రాణమునకేదయిన నపాయముండునాయని ప్ర
శ్నించెను. వైద్యులు సర్వసాధారణముగ రోగి స్థితి యెట్లున్నను నిజము
చెప్పరు. వారికి నిజము చెప్పకపోవలెనను నియమము చేతకాదు; కాని,
రోగిసంగతి చెప్పినచో నాతనికిని, వానిబంధుగులకును ధైర్యము తొలంగు
ననియు, నాత్మవిశ్వాసము లేని వారి కారోగ్యము గలుగజాలదనియు నమ్మి
నవారగుటచేత నిట్లు కావింతురు. చివరకు రోగి గడియలో మృతినొందు
నని తెలిసియున్నను వారట్లు చెప్పరు. వైద్యుఁడును విశ్వాసముచేతనే
రోగములు కుదురుననినమ్మినవారిలో నొకఁడగు రమేశుఁడు తాను
నిజముగ జమీందారునకు కొలఁది కాలములోనే సంధి (Delerium)
ప్రవేశింపఁగలదని యెఱిఁగియుండినను, అట్లు చెప్పినచో మనోరమవిచా
రమునకింక మేరయుండదని తలంచి యామె ధైర్యము సడలకుండునట్లు

గ నాతనికి ప్రశాంతనిద్రము గలుగఁజాలదనియు, జ్వరము రావచ్చునని యు, నాతని నిద్రాభంగము గావింపవలదనియు చెప్పి యామెను ప్రక్కగదిలోనికి గొంపోయి, గతరాత్రి జరిగినవిషయముం గూర్చి ప్రశ్నింపఁదలంచి యామెను "శివసింగువిషయమై మీయభిప్రాయమేమి?" యని ప్రశ్నించెను. "శివసింగు నిజముగ పిచ్చివాఁడని మీరెంచుకొనియున్నారుకదా. కాని, యొక్కొక్కప్పుడాతనికి తెలివితేటలు గలుగుచుండును. ఇందులకు తార్కాణముగ నితఁడు నాటిరేయి నాపిల్లలను రక్షించినాఁడు. అతనికి నేననిన చాలభక్తి. అందుచేత నేను పెంచిన కుక్కపిల్లవలె నావెంట నంటియుండును నేను చెప్పినపనులన్నియు చేయుచు నాయందు విశ్వాసము కలిగియుండును

"నిజమే. అతనికి మీరనిన చాల ప్రేమగలదు. మీకొరకుచచ్చుటకైన సిద్ధపడును. కాని, నాటి రేయి మీభర్తగారిని చంపనుంకించినపుడేల కనుపించలేదా, యని యాలోచించుచున్నాను.

ఈమాటలు విన్నతోడనే మనోరమ పెద్దనిట్టూర్పువిడచి ప్రక్కనున్న యాసనముపై మేనువ్రాల్చెను.

"నిజమే కాని తుపాకి ప్రేలినపుడాతనికి తెలివివచ్చియుండును, అంతయేమైయుండవలెను. కాని, అది వైద్యశాస్త్రజ్ఞుఁడు నిరూపింపవలెను. అందులకాతఁడు శివసింగును పరీక్షసేయవలెను.

"అటులైన నాతని పరీక్షింతురాయేమి?" యనియె మన్నోరమ,

"ముఖ్యముగా చేయవలెను. ఇంక నాకు ప్రొద్దుపోయినది. సెలవుతీసికొనెదను. మీరీయనను త్వరలో నింకొకగృహమును జూచి యిచ్చుటనుండి తర్లించవలెను. లేనిచో హాని వాటిల్లగలదు." అని చెప్పి యింటికేగుచు దారిలో సురేంద్రుని కలిసికొని సాధ్యమైనంత త్వరలో శివసింగును రప్పింప ప్రయత్నములు సలుపుమని చెప్పి యింటికి

వచ్చెను. అతఁడట్లనుదినమును సురేంద్రుని తొందరపెట్టసాగెను. మనోరమతో భాషించిన మూఁడవనాఁడు సురేంద్రనాథుఁడు శివసింగు దొరికినవార్త రమేశునకెఱుఁగఁజేసెను రమేశుఁడును వానినిఁజూచుటకై వైద్యశాలకు బోయెను.

---

## ౧౩ వ ప్రకరణము.

### వైద్యశాల.

పాటలీపుత్రమునందు వైద్యశాల పురపాలకసంఘమువారిచే స్థాపింపఁబడెను. అందుసాధారణరోగములకు చికిత్సయేగాక, ఉన్మాదులకును, గర్భిణీస్త్రీలకును, వైద్యముసేయుదురు. ఆకారణమున నచటికి తండోపతండములుగ రోగులు వచ్చుచుందురు. దానికిరమేశుఁడేముఖ్యాధికారి. అతని యాధిపత్యముక్రింద నిరువురు డ్రెస్సరులును, పదిమంది మందులనిచ్చు మంత్రసానులు మొదలగు వారును పనిసేయుచుందురు. వారిలోనగ్రేసరురాలొక రోమనుకాథలిక్కు (Head Nurse) మతస్త్రీ ఆమె యవివాహితయు వృద్ధురాలునైన కారణమున రమేశుని "సోదరా! యనిపిలచుచుండును. ఆమె రమేశుని తరువాత యధికారిణి. వారిరువురిమాటయనిన నచ్చోటనెల్లరును రాజాజ్ఞగ శిరసావహింతురు.

నాఁటి సాయంకాలము రమేశుఁడు వైద్యశాలకేగెను. అతఁడు వాడుకప్రకారము గాక తొందరగానెవరితోడను మాట్లాడకయే పిచ్చివారినివసియింపఁజేయు స్థలమునకేగియచటివృద్ధురాలగు(HeadNurse) మంత్రసానిని. శివసింగెచ్చట నుండెనని ప్రశ్నించెను. అందులకామె యాతనితో గవర్నమెంటు లాయరగు నవీనమోహనుఁడు శివసింగును డాక్టరైనను సమీపింపఁ జనదనియు, నందులకు రక్షణకై యొకభటుని గూడ జతయిచ్చిపంపెననియు తెలియఁజేసెను. అందులకాతఁడు కినుక

వహించి తత్క్షణమే నవీనుని గృహమునకేగి యావిషయమై ప్రశ్నిం చెను. నవీనుఁడును తనకధికారము లేదనియు, ముఖర్జీ యిట్లోర్చెననియు, నప్పుడే తనకు రమేశుని పరీక్షసేయుటకు వైద్యశాలకు రావలసినదిగా కబురుపంపుమని యుత్తరువులిచ్చెననియు రమేశుఁడిప్పుడే యిట్లొనర్పవలసియుండుననియు చెప్పెను. 'అడబోయినతీర్థ మెదురైనట్లు" రమేశుఁడు చాల సంతసించి తిరిగి వైద్యాలయమునకే తెంచెను. అచట ముఖర్జీయుండెను. వారిరువురును శివసింగును మాట్లాడింపప్రయత్నించి కార్యముఁగానరైరి. అంతముఖర్జీవానితో డాక్టరు సర్టిఫికేటు(Doctor Certificate) నియ్యవలసినదని చెప్పెను; రమేశుఁ డామరునటిదిన మట్లొనర్తునని చెప్పెను. అతఁడద్దానినిదివరకే తయారుచేసియుండెనుగాని దానినిముఖర్జీకిచ్చి వేయులోపల రవీంద్రునికొకమారు చూపినచో నద్దైన మేలుకలుగునేమోయని తలఁచి యిట్లు చెప్పెను.

అట్లుముఖర్జీని వీడ్కొని యాతఁడు భవానిశంకరునిగృహముఁ జేరెను. అచట రవీంద్రునికీవార్త దెలుపఁగా నాతఁడు చాలసంతసించెను. రమేశుఁడు వాని కాసర్టిఫికేటు నిచ్చి మరునాడియ్యవలసినదనికోరెను. తరువాత సంభాషణలో తాను కనుఁగొనిన ముఖ్యవిషయము జమీందారునుకాల్చిన తుపాకిలో రెండు తెరగతులు గుండ్లు నుపయోగించిరనియు, నయ్యది విచారణసమయములో చెక్కుడు సహాయకారిగా నుండఁగలదనియు చెప్పెను. దీనికి రవీంద్రుఁడు సంతసించెను. రమేశుఁడును వెడలిపోయెను.

ముసలిరాఘవుఁడప్పుడే వచ్చి రవీంద్రునితో నాఁటియుదయము ముఖర్జీ యిరువురుభటులతోడరా కమలాకరుని పీఠాసదనమునకుఁ దీసికొనివచ్చెననియు, తానుసీల్లువేసిన సిటిసీసా, కమలాకరుఁడు ధరించిన వస్తువులు, తుపాకి మొదలగు వానిని తీసికొనిపోయెననియు, చెప్పెను. మరియు కమలాకరుని తుపాకి తాను చూచుటకు పిలమ్యో

ననియు, నది నిశ్చయముగ నాతఁడు ప్రయోగించియుండెననియు చెప్పెను. అది విని రవీంద్రుఁడు కొంచెము ధైర్యపడినను తిరిగి ధైర్యము తెచ్చుకొనెను. తదనంతరము వారు సంభాషించుకొనుటలో కమలాకరుని కలసికొని మాట్లాడినచో నెంతయు బాగుండుననియు, నయ్యది సాహాయ్యకారిగా నుండఁగలదనియు చెప్పెను.

వీరి సంభాషణమాలకించినయానందమయి, తత్క్షణమే లోనికేగి, తనపెట్టెను తెరచి, యిరువదివేలరూప్యముల బ్యాంకినోట్లు చేతఁబట్టుకొని వస్త్రములలో గుప్తపరచుకొని, తాతనుపిలచి, తానొకమారు బైటకేగవలసియున్నదనియు, తనవెంట రావలసినదనియు కోరెను; అతఁడామెవెంట బయలుదేరెను; ఆమె యెచటికేగును? ఆమె కంతటి ధనమేల? అంతరహస్యమేమి?

---

## ౧౪ వ ప్రకరణము.

### సాంకేతికభాష

తనకత్యంతప్రేమాస్పదురాలగు తనమనుమరాలిమాటను త్రోసివేయలేక యామెను వెంబడించిన భవానీశంకరుఁడు వీధిలోనికేగిన తరువాత “ఇట్టిరాత్రిసమయమున నీబాలిక యెచటికేగఁగలదు? ఏమిచేయఁబోవుచున్నది?” యనుకొనుచు వితర్కించుకొనుచుండెను. కాని, సాహసించి యడుగఁజాలకుండెను. ఒక్కొక్కమారడుగుదునాయని తలంచియు వెనుదీయుచుండెను. ఇట్లు కొంతకాలము గడచిన పిమ్మట నెట్టకేలకు “అమ్మా! ఇపుడెచటికిపోవుట?” యని ప్రశ్నించెను. కాని యామె “తాతా! నన్నిప్పుడడుగవలదని ప్రార్థించుచున్నాను. ఒకగంటలో నీకన్ని సంగతులును విశదముకాఁగలవు” అని బదులువల్కెను.

ఇట్లు వారు కొన్నివీధులు దాటిపోయి యొక యింటిముంగిట నిలచిరి. ఆయిల్లు మనమిదివరలో ప్రస్తావించిన కరంచందునకు చెంది యుండెను. అట వీధిగుమ్మములో తనకై వేచియుండుమని తాతకు తెలిపి యానందమయి లోనికేగెను. అప్పుడెనిమిదిగంటలయ్యెను. కరంచందప్పుడే యింటికివచ్చి వస్త్రములను విడచి చుట్టవెలిగించెను. ఇంతలో నానంద లోనికేగెను. లోనికేగఁగనే యాతఁడాచుట్టనావలఁబారవైచి నమస్కరించెను. "నేఁడుసుదినము.అమ్మా! నేఁడేలమిారిట్లుదయచేసినారు. ఎల్లరకును కుశలమా?" యని ప్రశ్నించెను.

"అందరకునుకుశలమే. నీతోడ కొంచెము పనియుండుట నిట్లు వచ్చినాను. కొంచెము కాలము మాట్లాడుటకు తీరికయున్నదా? మిాయిష్టానుసారముచేయవచ్చును." అంతవారిరువురును సుఖాసీనులైన పిమ్మట నానంద యిట్లుపల్కెను.

"నేను కమలాకరుని వరించియుంటిననియు, నాతనిని కొలఁది దినములలో వివాహమాడనుంటిననియు నీవెఱింగిన సంగతియే కదా."

"చిత్తము!"

"అతనిపై నేరముమోపుటయు, నాతఁడిపుడు దుస్థితిలో నున్నాఁడనియు, నాతని గౌరవమునకు భంగముగలుగుటయేకాక ప్రాణమునకు గూడ నష్టముసంభవింపఁగలదనియు నెఱుఁగుదువుకదా?"

"చిత్తము"

"ఇట్టిసమయములో నీబోటిస్నేహపాత్రుఁడు, నంతయు నెఱిఁగియున్నవాఁడు నీవుఁగూడ సాయపడకుండుట న్యాయమా?"

"తల్లీ! నిజమే. కాని, నాచేతనగుసాహాయ్యమెదియు లేదు. అతనిని మొదటవిచారించినపుడు నేనుంటిని. అతనినడతనుబట్టి యాతఁడు నిర్దోషియని తోఁచకమానదు. ఆతఁడానాఁడు చూపిన నిశ్చలత్వమును ధైర్యమును, జూచినవాఁడెవ్వఁడాతఁడు నిర్దోషి కాఁడనుకొనును?"

"నీచేత నొక సాహాయ్యము కావలసియున్నది. నీవు మేజస్ట్రేటు గుమాస్తాగానుండుటచే నయ్యది నీకుమాత్రము సాధ్యము. అదెట్టిదనఁగా, నేనొక లేఖ కమలాకరునకు వ్రాసెదను. నీవాతనికందఁజేసి తిరుగజాబును గొనితేవలయును."

ఇదివినఁగనే యాతఁడు కంపించెను; అతనిధైర్యమంతయు నొక్కమారాతనిని విడచెను. అంతనాతఁడు,

"అమ్మా! అది నాతరమగునా? నన్నిట్టిపనిచేయుమనుట మీకు భావ్యమా! నేనీపనిచేయుచుండఁగా నెవ్వరైనచూచినచో నాగౌరవమంతయు పోవుటయేగాక నాయుద్యోగమూడిపోవునుగదా? నాజీవనోపాధి పాడయిపోవదా? అదియేగాక చాలకట్టుదలతో పనిచేయుచున్న మేజస్ట్రేటు నన్నూరక వదలివైచునా? నాకింకజీవములుండునా? నాకు కారాగారప్రాప్తియో మరియేశిక్షయో కాదా? నేనదిచేయఁగల్గుదునా? క్షమింపుఁడు" అనియెను.

"సోదరా! నీవట్లనకుము. ఈనోట్లను నీవు తీసికొనుము. నీయుద్యోగముపోయినను దీనితో నీజీవితకాలమంతయు రాజువలె సుఖంపగలవు. నాకు పతిభిక్షపెట్టుము." అనిచేతులను బట్టుకొని బ్రతిమాలెను. కరంచందు మనస్సుకరగి నీరయిపోయెను. అతనికి వెనుకనూయి, ముందరగోయి యున్నట్లు చేయుటకును తోచకుండెను. ఎట్టకేలకు ధైర్యము తెచ్చుకొని 'ఇది నాచేతనెట్లు కాగలదు. నేను మేజస్ట్రేటుతో కారాగారమున కేగినను మరలవారిని వెంటనే తిరిగిరావలెను. అదియుగాక వారితో రక్షకభటులుండరా? వారు చూచిన నింకెక్కడియాశ. కాని, కారాగారరక్షకుఁడగు మాధవునొడంబరచినచో నేమయిన వీలుకలుగునేమో చూచెదను. అతఁడేకాక నేరస్థుఁడును, కమలాకరునకు సేవఁజేయుటకై నియోగింపఁబడినవాఁడు నగు రంగస్వామినాయు నపేక్షింతును. అతనికింకను విముక్తికాలేదుగదా? ఎద్దియైన

వానినికి భ్రమకల్పించినచో నాతఁడియ్యకొనునేమో? మీరు లేఖ వ్రాసి నా కిండు. నాజీవములుండగ మీదగ్గర నేను ధనము తీసికొందునా? ఇదివరలో మీరుచేసిన మేలు చాలదా? ”

అంత నానంద వానిని కమలాకరునియొద్ద నేయేపుస్తకములున్నవనియడిగెను. అతఁడు చదువుకొనుటకై కొన్ని పత్త్రములిచ్చియుండిరనియు, నవీనమోహనుని దగ్గరనుండి యాతఁడు కోరిన పుస్తకములిచ్చిరనియు చెప్పెను. ఆమెసంతసించి,

ప్రియతమమా! నీ నిర్దోషిత్వమును గూర్చి మేమించుకేనియు సందేహించుటలేదు. ఏమిచేయుమనెదవో తెలియఁజేయఁగోరెదను. ఆలసింపఁజనదు. మీతల్లి నిన్నటిరేయి, ప్రసిద్ధన్యాయవాదియగు రవీంద్రనాథదత్తాగారితో నిచటికివచ్చెను. మనపత్త్రము నీదగ్గరనున్నది కదా?

“ఆనందమయి”

అనులేఖవ్రాసి కరంచందునకిచ్చెను. మరియు వానికిష్టమున్నచో చూడవచ్చునని చెప్పెను; అతఁడు వలదని జేబులోబెట్టుకొనెను. ఆనంద వానిని వీథ్యాగని బైటనుండినతాతను కలసికొని యింటికేగి యావద్వృత్తాంతము వానికి వినిపించెను; అతఁడందులకుచాల సంతసించెను. ఈసంగతి యేరికి తెలియకుండినను రవీంద్రునకుమాత్రము తెలియఁజేసిరి. అతఁడామెమనోధైర్యమునకును ప్రేమకును సంతసించినను వారుపయోగించిన మార్గము ననుసరింపలేదు. అతఁడియ్యది యక్రమమనియు, లంచములిచ్చువారును పుచ్చుకొనువారునుకూడ నేరస్థులే యనియు, ఇట్టివి దొరతనమువారికి తెలిసినచో నీప్రయత్నము కొనసాగక పైగా దండనకుకూడ పాల్పడవలసివచ్చుననియు తెల్పెను. కాని, తానెట్లయిన కమలాకరునితో మాట్లాడవీలు గల్గినచో నేదైన

సహాయము జరుగునని తలంచుచుండినవాఁడగుటచే నెట్టకేలకియ్యకొనెను; అంతట వానందయు 'అయ్యా!' ఇఁక మనకు తగినసాహాయ్యము జరుగునా? కమలాకరుఁడిఁక మనతో నుత్తరప్రత్యుత్తరములు సల్పునుగదా!,, యనియె.

,, జరుగవచ్చును. అతఁడు వ్రాయులేఖలు పెక్కురచేతులనుండి రావలసివచ్చుటచేతను, సంగతులు గూఢములగుటచేతను పూర్ణముగా వ్రాయకపోవచ్చును. ఆకారణమున వానినుండి జవాబువచ్చువరకును "చెప్పలేను" అనియె. నవీంద్రుఁడు "అందులకు తగినశ్రద్ధ తీసికొనియే యున్నాను. పరికిని తెలియనట్లుగా నాకతఁడు వ్రాయగలఁడు. అందులకు సందియములేదు అట్లయిన మనము దానికొరకై నిరీక్షించియుండవలెను."

నిజమే. పాపము వారు కమలాకరుని ప్రత్యుత్తరముకొఱకయి మరునాటియుదయమువరకును నిరీక్షింపవలసియుండెను; ఆరాత్రి నిద్రలేకయే ఆనందగడపెను. మరునాఁడు తెల్లవారినప్పటినుండియు పలుమారులువచ్చిచూచుచుండెను. ఏదైనవీధిలోచప్పుడయినచో నల్లరును తమయింటికంటయే మ్రోగినదని పరువెత్తి కండ్లు దోరబెట్టిచూచుచుండిరి. కాని, నిష్ఫలప్రయత్నులై తిరిగి వచ్చుచుండిరి. ఇట్లుసాయంకాలమువరకు జరిగినను లేఖరాలేదు చివరకు విసిగి భవానితో నానందయు బంధుగులను చూచుటకై పోయెను. వారిద్దరును వెడలిన పదినిముసములకొక బాలుఁడొకకవరును దెచ్చియిచ్చెను. భవానీశంకరుఁడాత్రముతో దానిని విప్పెను. అదినిజముగ కమలాకరునుండి వచ్చినదే. అందేదియో కొన్నియంకెలు వేసిన కాగితముండెను. వారికది యర్థముకాలేదు. కాని, సహజముగ కుశాగ్రబుద్ధియగు నవీంద్రుఁడియ్యది యొరులకు తెలియకుండునట్లుగ వ్రాసినసాంకేతికభాష యని గ్రహించెను. ఆతఁడద్దానిని చదువుటకు ప్రయత్నించినను కార్యము

లేకపోయెను. ఇట్లు వారు దానినిగూర్చి మాట్లాడుకొనుచుండఁగా నొకింతకాలములో నింటికి తాను లేనప్పు డేదయిన జాబువచ్చెనేమో యని యాతురపడుచుండిన యానందయు తిరిగివచ్చెను. భవానీశంకరుఁడామె కీవార్తనెఱింగించుటయు నామె యాలేఖఁగైకొని తనగదిలోనికి పోయెను;

ఇట రవీంద్రుఁడు తనంతనానందమయి యిదివరలో కమలాకరుఁడేరికిని తెలియకుండఁగనే జాబువ్రాయఁగలఁడని చెప్పినది జ్ఞప్తికి వచ్చి వారియన్యోన్యానురాగమునకును, తెలివితేటలకును లోలోనసంతసింపుచుండెను. తనమనుమరాలి యుక్తికి భవానీశంకరుఁడు తనలో తాను నవ్వుకొనుచుండెను. ఇంతలో చదువుపూర్తియై తనవారికి తెలియునట్లుగా పరివర్తనముగావించిన కాగితమును తీసికొని యానంద ప్రవేశించినంతనే భవానీశంకరుఁడు 'ఓసి! జిత్తులమారి! ఈయుక్తులనెక్కడ నేర్చితివే! సహవాసముచేసినందుకు నీకాబోవుమగఁడు నేర్పినదా యిది' చాలు చాలు, మీరెట్టిభాష నేర్చికొంటిరో చెప్పుమని హాసములో ప్రియత్నించుటయు, చిరునగవొలయ మృదుమధురభాషణములతో నాతనిదరిఁ జేరి యాతని నెఱసిన వెంట్రుకలను సవరుచు నానందమయి "తాతా! కొలఁది కాలముక్రితము రహస్యవర్తమానములను తెలుపుకొనుటకై మేమీమార్గము గనిపెట్టితిమి. ఇది తెలిసినవారికి సులభమే. ఇదియుపయోగించువారేది యోపుస్తకమొకదానిని సాంకేతికముగ నేర్పరచుకొనెదరు. అందుండుపుటసంఖ్య మొదటియంకెయనియు, రెండవయంకె పంక్తియనియు, దాని తరువాత రెండుబొట్లును పిమ్మట నొక్కొక్క యంకెయు విరామములతో వేతురు! ఇవి యక్షరములు. ఇది తెలిసికొనుటకు పరులకు సాధ్యముకాదు. ఇంకనుగుప్తముగ నుండుటకై కొందఱు నెలలసంఖ్యను బట్టియు, వారములసంఖ్యనుబట్టియు, నొక్కొక్కసంఖ్య తగ్గించుకొనుటయు, మొదలగు నియమములే

ర్పరచుకొందురు. ఆకారణమువలన నయ్యది యొండొరులకు గ్రాహ్యముకాదు." అని వివరించిచెప్పుటయు నెల్లరును సంతసించిరి. అప్పుడు తాను పరివర్తనముఁగావించిన లేఖనుసిగ్గుతో నానంద తాతకిచ్చుటయు నాతఁ డీ క్రిందిరీతిగా నెల్లరకును చదివివినిపించెను.

"నీలేఖనుజూచి కడుంగడు సంతసించితిని. నాకేదియో తోచుటయు, నెందులకైన సర్కారకువచ్చునని తలంచి మనపౌత్త్రమునుగూడ యీయవలసినదనికోరుటయు నత్యంతదయతో నవీనమోహనుఁడు మనపౌత్త్రమును మఱికొన్ని పుస్తకములును నాకిచ్చెను. వానికెంతయు కృతజ్ఞులముగదా!

మీకందరకును ముఖ్యముగ నీకును నాయందు సదభిప్రాయముండుటయే నాకు పదివేలు.

నీకత్యంతదుఃఖావహమగు విషయము, నేను నిరపరాధినై యుండియు నట్లు ఋజువుచేయుటకై తగినదిదర్శనములను చూపక, మీకీభావముపహించి కారాగారవాసము సేయుచుండుటయే యని నాకు తెలియును. కాని, నేనట్లుచేయకుండినను నానిర్దోషిత్వము నితరులుస్థాపింతురనియు, నావ్యక్తి కడకైన నిజముచెప్పకుండువాఁయనియు నెంచియుంటిని. కాని, మొదటివిచారణ జరిగినప్పటినుండియు. నాలోచించి చూచినచో నీప్రపంచమున నిరపరాధులును, సత్యశీలురును సర్వదా జయముఁగాంచనేరరనియు, నధర్మము నసత్యము నే జయముగాంచునని యు తోచుచుండును. కావున నాకు వీలుచిక్కినచో నిజమునంతయు విశ్వాసార్హుఁడును, మనదేశాచారవ్యవహారముల నెఱింగినవాఁడునగు నొకన్యాయవాదికి తెలియఁజేయవలెనని తలంచుచున్నాను. మాతల్లి నన్ను రక్షించుటకును ప్రసిద్ధుఁడగు న్యాయవాదిని తీసికొనివచ్చినందులకామెకు నామనఃపూర్వకములగు నమస్కారములు.

కాని, నేనాయనకు నాసంగతినంతయు చెప్పఁజాలను. అందుల కాతఁడు నన్ను క్షమించునుగాక. నాకు చిరపరిచితుఁడును మాకుటుంబమునంతయు నెఱిఁగినవాఁడునగు న్యాయవాదులలో మేటియగు గనేశచంద్రచటర్జీని నారహస్యప్రకటనమునకుగాని, తగుచర్యనుదీసికొనుటకుగాని తగినవాఁడని నిశ్చయించితిని. అతనికి మీరీసంగతిని తెలియఁజేయుదురుగాక.

నన్ను విచారణసంపూర్తియైనపిమ్మటనో, పూర్వమో న్యాయవాదితో మాట్లాడుకొనుటకనుజ్ఞనిత్తురు. అపుడు నేనాతనికంతయు నెఱింగింతును. అంతదనుక నేనేరికిని చెప్పఁజాలను. నీకును తెలియజేయనొల్ల. అట్లువ్రాసినందు కన్యథాభావింపవలదనియు, కోపగించుకొనవలదనియు తలంచెదను.

నిజముగా మనకు మేలు జరుగవలెనన్నచో విచారణనింకొక న్యాయాధీశునిచేసగునట్లు ప్రయత్నింపుము; ముఖర్జీ దుర్మార్గుఁడు; దురాశాపరుఁడు; వాఁడు నన్ను నేరము నొప్పుకొనఁగోరుచున్నాఁడు. నేనట్లుచేయనని వానితో స్పష్టముగఁ జెప్పివైచితిని. కాని, యాతఁడు తన ప్రయత్నములు వ్యర్థములైనచో, నేదియో కల్పనఁ జేయఁగలఁడు; కనుక తగుశ్రద్ధవహింపుము. మీకీకష్టముఁ గలుగఁ జేసినందులకు క్షమింతురుగాక; ఇంకను వ్రాసియుందునుగాని, యీలేఖను దెచ్చియిచ్చి యీలేఖను గొనిపోవు భటుఁడు తొందరపెట్టుటచే నింతతో విరమింపవలసివచ్చెను. నీవు నాయందలి ప్రేమను విడకుందువుగాక; అందరకును నానమస్కారములు.

ప్రేమార్థి,
కమలాకరరాయుడు.

ఈయుత్తరము చదివినంతనే రవీంద్రుఁడును భవానీశంకర ప్రభృతులును నిరుత్సాహులై తమచూడ్కుల నానందకు గన్పట్టకుం

దునట్లు వేరొకవంకకు ద్రిప్పుకొనిరి; ఆనందయు వేరొకరీతిగ నాలోచించుకొనుచు కొంతవడికి తాతనుజూచి „తాతా! మీరందరును వింటిరిగదా! ఇంక కమలాకరుఁడు ద్రోహికాఁడనుట నిశ్చయమేనా?" యని ప్రశ్నించెను;

„నిశ్చయమే'' యనిమెల్లగ భవానీశంకరుఁడు పల్కెను; రవీంద్రునిజూచి "అయ్యా! కమలాకరుఁడు వేరొక న్యాయవాదికిగాని తన రహస్యము చెప్పననుట కేమియు ననుకొనరని తలంచెదను'' అని యానందపల్కెను.

„నేనుకూడ నాతనితో సంగతిసందర్భములను బాగుగ నెఱింగిన న్యాయవాదికే చెప్పుమని సలహానిచ్చియుండువాఁడ''నని సురేంద్రుఁడు నుడివెను.

ఇట్లు వారు మాట్లాడుకొనుచుండఁగ నెవరో తలుపుతట్టుటయు నెవరువారని ప్రశ్నింపఁగా నేను భవానిననిప్రత్యుత్తరము వచ్చెను; భవాని లోనికేతెంచెను; ఇదివరలో రెండుమూరులు సేవకుఁడు భోజనములు సిద్ధమయినవని పిలిచినను వారు వినకుండుటచే భవాని స్వయముగ నాహ్వానించుటకు వచ్చెను; వారు నామెరాకకు సంతసించిరి; ఆమెతో గణేశచంద్రచటర్జీకి కబురంపుమని చెప్పనుద్దేశించియుండుటయు, నామెవచ్చుట వారికి సంతోషమయ్యెను; అంత వారామెను గూర్చుండుమని జరిగిన సంగతి నంతయుఁ దెలియఁజేసిరి. ఇదివినినంతనే యామె కాశ్చర్య, భయ, సంభ్రమములును నిరాశయు నొక్కమారు దయింప "నింకలాభము లేదనుకొనెద'' ననిపల్కెను. కాని, గంభీరహృదయయు, సహజధైర్యశాలినియు, కమలాకరుని నిర్దోషిత్వమందు పూర్ణముగనమ్మి „సత్యమేవజయతే'' యనువాక్యమునమ్మి యుండినది యునగు నానంద యామె నూరడించి ప్రస్తుతకార్యములకు దోడ్పడవల

సినదనియు, నూరకవాపోవుటవలన నేకార్యమును జరుగఁజాలదనియు, బోధించెను. కాని భవాని యెంతకును ధైర్యము దెచ్చికొనకుండుటచే "కష్టసమయమునందాతనికి సాయముచేయుటకు నేనొక్కతనే మిగిలితివా?" యనుటయు రవీంద్రుఁడు "నాతోఁ బరువు"రన్ని ధైర్యముదెచ్చికొనిపల్కెను.

పిమ్మట వారికేసును వేరొక న్యాయాధిపతియొద్దకు మార్చుకొనుటకును, గణేశచంద్రుని పిలిపించుటకును వలయు ప్రయత్నములను గూర్చి మాట్లాడుకొనుచుండిరి;

గణేశచంద్రుఁడు పాటలీపుత్రమునందలి న్యాయవాదులలో వర్గేసరుఁడు. అతఁడు కలకత్తా విశ్వవిద్యాలయములో గొప్ప పరీక్షలఁ దేరి, చాలక యింగ్లాండునకుఁ గూడ బోయి గొప్పపరీక్షలనిచ్చివచ్చెను. ఆయన వాక్చక్యమునకు మెచ్చి గవర్నమెంటు వారాయనను కలకత్తా హైకోర్టులో న్యాయాధీశునిగ నియమింపఁబోయినను, స్వాతంత్ర్యాభిలాషియగువాఁడు దొరతనమువారికొలువులో ప్రవేశించుటకొప్పుకొనలేదు. ఆతనికి నలువదియవయేట భార్యగతించెను; అప్పటినుండియు నాతఁడు లౌకికవ్యాపారములయందు విముఖుఁడై యింటియందే కాలముగడపుచుండెను;తన కదివరలో నుండియు పోషణకర్తలును, మేలుగోరినవారునగు జమీందారుల కేదైన గొప్పకేసులువచ్చినచో నతఁడు కోర్టునకేగును కాని యెవ్వఁడైనను తన యెత్తుధనమిచ్చినను సగేయునియక్రమములగు కేసులను బట్టఁడు కావున అతడు చేపట్టిన కేసు నెగ్గితీరవలసినదియే. అతని సహజవాగ్ధోరణియు, నున్నతవిద్యయు,నాతనికి మెఱుఁగు వెట్టువినయమును జూచి యీనుట్టుపట్ల జమీందారులెల్లరును తమ కేసులనాతని కేయిచ్చుచుండిరి; అతని మాటయనినచో నిజముగ రాజప్రతినిధియైనను మీఱడని పలువురు దలంచుచుండిరి.

చాలకాలమునుండియు ధర్మపురముజమీందారుల కేసులన్నియు నీతడే చూచుచుండెను; కాని, రెండుమూడు వత్సరముల క్రితము మాటపట్టింపువచ్చుటచే వారీతనిని పిల్చుటమానివైచిరి; ఇతఁడును మొదటనించుక చింతించినను స్వగౌరవ లోపమున కిచ్చగొనని వాఁడగుటచే వారికడ కేగుట మానివైచెను; ఆకారణమున నీతనిని బిలుచుట యన భవానికిగాని యామె భర్తకుగాని యిష్టములేదు. కాని, కమలాకరుఁ డాతని విలువనెఱింగినవాఁడును, చిన్నతనమునుండియు నాతనిని పితృవాత్సల్యముతో జూచుకొనుచుండిన వాఁడునగుటచే నీ కష్టసమయమున నాతని సాయమపేక్షించినచో నాతఁడువచ్చితీరునని యెఱింగియుండెను. గణేశుఁడును కమలాకరునత్యంతవాత్సల్యముతో నరయుచుండెను. ఆతనికేదైన తెలిపినచో నాతనితో నదియంత మొందవలసినదేగాని ఫాలాక్షునికైనను చెప్పనంతటి విశ్వాసపాత్రుఁడు. ఆకారణమున కమలాకరుఁ డాతనినే తననేరము చెప్పుటకర్హునిగా నిశ్చయించెను.

అభిమానముకొఱకు జూచుకొనినచో వారి యేకపుత్రుఁడు మృత్యుదేవతపాలును, పాలవంటివంశ సుపకీర్తి పాలును, దంపతులిరువురును, ఆనందయు, నామెనుబట్టి ముసలియగు భవానిశంకరుఁడును, విచారసాగరముపాలును గావలసివచ్చుననియు, నెల్లరును నొక్కిచెప్పుటచేత నెట్టకేలకు భవాని గణేశచంద్రునకు వర్తమానమంపుగునని వాగ్దానము చేసెను. కాని, యీసంగతి తన మగఁ డెఱింగినచో, నాతఁడు సమ్మతింపకపోవచ్చుననియు, నందుచే కార్యము చెడుననియు తలఁచి భవానియే గణేశునకు స్వయముగ వర్తమానమంపెను. నాఁటి సాయంకాల మేడుగంటలకు గణేశచంద్రుఁడు వచ్చి చేరెను. ఆతఁడు వారి కుశల మడిగెను. ఆతని పల్కులందు కమలాకరునిఁ గూర్చిన విచారముండుట యానందకుఁ బొడకట్టెను. ఆకారణమున నాతనిని

"కమలాకరుఁడు దోషియని తలంతురా?" యని ప్రశ్నించెను. ఆమె యభిప్రాయము సరియై యుండెను. అతఁడిదివఱలో కమలాకరుని యెడ సదభిప్రాయము గలిగియుండినను కోర్టులో తన సోదివా రెల్లరును జెప్పుకొను మాటలనుబట్టియు, నిరూపింపఁబడిన నిదర్శనములను బట్టియు, నూరివారి పలుకులనుబట్టియు దోషియని తలంచెను. అదియే వారికిని జెప్పెను. పిమ్మట వారీసంగతినంతయు తా మాతనినుండి రహస్యముగ లేఖలనందుచుండినసంగతియు సంగ్రహముగ వాకుృచ్చిరి. అతఁడు ప్రథమమున నించుక యాశ్చర్యము నొందినను పిమ్మట నించుక యుష్టతను సూచించెను; ఇట్టిప్రవర్తన తమకోటి న్యాయ వాదులకుతగనిపనియని రవీంద్రున కాతఁడు సూచించెను; రవీంద్రుఁడు కొంచెము సిగ్గుపడినను "మొదట నిట్టిపని జరుగునని తెలిసినచో నేను సమ్మతింపకుండెడివాఁడనే; కాని, జరిగినదానికివిచారించిన లాభమేమి? కావున, దీనివలన గల్గు ఫలితము ననుభవింపకుండుట కానిపని. ఆ కారణమున దీనియంతయు చూడఁదలఁచి యున్నాను." అని చెప్పెను; అందులకు గణేశుఁడును వల్లెయనెను; కమలాకరుని జూచుట కనుజ్ఞయైనవెంటనే యాతనిని కలసికొని సంగతులన్నింటిని కనుఁగొందు నని చెప్పెను. పిమ్మట నాతఁడు వారిని వీడ్కొని వెడలిపోవుటయు, కరంచందు నెట్లయినను గలసికొని మాట్లాడఁగోరి వాని నొకసారి యానాఁటిరేయి తమ తోఁటలోనికి రావలసినదనియు, నొకలేఖ కమలాకరున కందజేయవలసినదనియు నిచ్చి కరంచందున కానంద కబురు పంపెను.

---

## ౧౫ వ ప్రకరణము

### ఆనంద సాహసము.

పూర్వము తన సహోదరు లిరువురకును తన రహస్యముల నన్నియు దెలియజేయుచుండెను కరంచందు నేఁడు ఆనందతో మాట్లాడి నప్పటినుండియు వారి కేదియు చెప్పుట మానివైచెను; వారొకటి రెండు పర్యాయము లావిషయమై ప్రశ్నించియు నాతనినుండి సనుత్తరములకు మాఱు కోపమునే గాంచి వానినిఁక పైదానినిగుఱించి యడుగుట మానుకొనిరి.

ఆతఁ డానందలేఖను కమలాకరున కందజేయుటకు సమాధాన పడినప్పటినుండియు నీకృత్య మెట్లు నెఱవేఱునా యని చింతింపు చుండెను. మరునాఁడు ముఖర్జీతో చెఱలోని కేఁగినను వెంటనే తిరిగి రావలసివచ్చెను. కాని, ఖైదీకి సేవకుఁడుగానుండిన రంగస్వామి యిది వరలో ఖైదుచేయఁబడినపుడు పొగచుట్టలు, తినుబండారములు నిచ్చు చుండుటచే నాతని సాయముగొని మొదటిలేఖను లోనికిఁ బంపి యెట్టెటులో ప్రత్యుత్తరము వడసెను; కాని, వానినే నమ్ముకొని కార్యము సాధించుట దుర్ఘటమనియు, కర్మవశమున నేఱికంటనైన బడుట తటస్థించినచో తన గౌరవము, మర్యాదయు, తన్ను వీడుననియు నాకారణమున నెట్లయిన మాధవుని సాయ మత్యంతావశ్యక మనియు, నది యెట్లు లభ్యమగునా యనియు నాలోచించు కొనుచుండఁగా నానందపరిచారిక వచ్చి లేఖలనిచ్చెను. దానికాతఁడు ప్రత్యుత్తర మంపి భోజనముచేసి యానందను జూడనేగెను; అతఁ డచటి కేగునప్పటి కానందయు నాతనికై వేచియుండెను; వారు లోనికేగిన పిమ్మట పరిచారిక యొండొక యాసనముం దెచ్చివైచుటయు కరంచందు కూ

ర్చుండెను; పరిచారికయు పోసికేగెను; అంత వారి కిట్టిదిసంభాషణ జరిగెను.

"సోదరా! నిన్నీ సమయమున నిచటికి రావించినందులకు క్షమియింప వేడెదను."

ఇదివరలో వాని యూహాలెట్లున్నను, యామె మాటలు విన్న తోడనే యిట్టి శ్రీమంతురాలు, అల్లుఁడగుత నకిట్టి గౌరవము నొసఁగుట కాతఁడు పరవశుఁడై "అమ్మా! విధేయుఁడ" నఁయెను.

'నిన్నొకయత్యంతావశ్యకమగు పనికై యిచటికి రాఁజేసితిని"

"ఎట్టిది? మరియొక లేఖఁ బంపుటయా?"

'కాదు. నేనెట్లయిన వాతనిఁ మొకమారు చూడ్వలెను. వానికెంతటి ధనమైన నిచ్చుటకును, వానికిఁ సేవకావ్య లెయొక్క యవసరము లేకుండఁ జేయుటకును, నాగానమిచ్చు నట్లయిన నావిన్నపములుగ మాధవు నొడంబఱచుము."

ఇది చాల కష్టసాధ్యమని యెఱింగియుండియు, లోలోన నధైర్యపడుచుండియు, నామెమాటలు కెదురాడలేక మరునాఁడీసమయమునకే దీని పర్యవసానమును దెలియఁజేయుదు నని చెప్పి యప్పటి కామెను వీడ్కొని యాతఁడింటికేగెను.

మరునాఁడామె నాఁటికై పూర్వదినమువలెనే యెదురుచూచుచుండెను. కరంచందు పదిగంటలగునప్పటికి వచ్చి లోనికేగినంతనే తానెట్లు కేలకు మాధవునొడంబరచితిననియు, వాడందులకు కొన్ని నియమముల నేర్పరచెననియు చెప్పెను.

వాటి నాతఁడామె కీరీతిగ చెప్పసాగెను.

"మీరు రేపురాత్రి తొమ్మిది గంటలకు బైలుముందు తిరుగుచుండవలెను. అపుడు వీలుగా నుండినచో మాధవుని భార్య

రాధ మిమ్ములను లోనికిఁ దోడ్కొని పోవును. లేనిచో నామె మాట్లాడువరకును మీరట్లే యెరికి ననుమానము గలుగకుండునట్లు తిరుగుచుండవలెను. ఆమెయు సమయమును చిక్కఁగనే లోనికిఁ దోడ్కొనిపోయి తన గదిలో నివసింపఁ జేసి తిరుణమున కమలాకరునకు మిమ్ముఁ జూపును. మీరా దినమును, మరునాడు సాయంకాలము వరకును రాధగృహమందుండుటకు సంసిద్ధులై యుండవలెను."

అందుల కానంద సమ్మతించి ధనము నామరునాఁడే వానికిచ్చునట్లు చెప్పి వానికిసెలవిచ్చి పంపివేసెను.

ఇచట కారాగారమున కేగుటకు కరంచందు నొద్ద సమ్మతించుట యానందకు సులభమే కాని, తమ పితామహు నొప్పించుట యంత సుకరముగాదు. ఆమె మరునాఁటియుదయమే తాతను సమీపించి యాతనితో నత్యంతవినయముతో సంగతినంతయు జెప్పి తాను కారాగారమున కేగుటకు సమ్మతి నీయుగోరెను. ఇదివరలో ప్రేమాస్పదురాలగు తనమనుమరా లేదియడిగినను సరియనుట దక్క యితరమెఱుంగని భవానీశంకరుఁడు నేఁడట్లు చేయుడమయ్యెను. ఆమెకొఱకును, ఆమెను వలచి పెండ్లాడబోవు నాతని కొఱకును నాతఁడేదియైనను చేయుటకు వెనుదీయ లేదు. తుదకు మనుమరాలు వేలకొలఁదిరూప్యములడిగినను కాదనియు, నేటికనియునైన యడుగలేదు. ఆమె దినమంతయు నింటిలో నుండక, తనకగుపడకుండఁగ, మర్యాదవిహీనమగుస్థలమున నొంటిగ నుండుటకాతఁడు సమ్మతి నెట్లీయఁగలఁడు! గౌరవమే జీవనముకన్నను మిన్నగ నెంచు నాతఁడెట్లు దీనికి వల్లెయనుట! అతఁడు తుదకు, నేనిందులకెంతమాత్రమును సమ్మతింపనని స్పష్టముగ జెప్పివైచెను. అంత నామె వానిపాదములకడ మోకరించి కరములు మొగిడ్చి "తాతా! ఇంత దనుక పుట్టినప్పటినుండియు నీయాజ్ఞ మీఱనైతిని. కాని, నేఁడు నాయభిమానరక్షణకును, నామనోహరు ప్రాణరక్షణకు

ను, యెవరికొఱకు నింత దనుక నిద్రాహారములను మాని పరితపించు
చుంటిమో, యానిర్దోషి, సుగుణాలవాలమగు నాప్రాణేశునిమాన
రక్షణమును, నేఁడుమీయాజ్ఞ నుల్లంఘించునంతటి యవసరమును గలు
గఁజేయకుమని ప్రార్థించుచున్నానని దీనముగ బల్కి వాపోవఁదొడంగె
ను. అంతట నాతఁడు ఖిన్నుఁడై యెలుంగెత్తి "హా! రమానాథా! యెం
తటి విపత్తును దెచ్చిపెట్టితివి? అడ్డాలనాఁడు బిడ్డలుగాని గడ్డాలనాఁడు
బిడ్డలా యనుట నిక్కమయ్యె. చిన్ననాటినుండియు పెంచి,
పెద్దదానిఁగ జేసిన నామనుమరాలు, నాయీచేతులతో పెంచిన యీ
పసికూన, యీదినమున దయమాలి నామాటలను తిరస్కరించుట
యా?" యనిబిగ్గరగ నేడ్చుచు నెట్టకేలకు ధైర్యమును దెచ్చుకొని "సు
నందా! యీయింటికంతకును నేను సర్వాధికారిని. నీవిచటినుండి
కదలవలదని నేను శాసించుచున్నా"నని ఖండితముగ బల్కెను. సహజ
ముగ ధీరయగు నామెయు నించుకైన వెనుదీయక, "అట్లయినచో నేఁటి
నుండియు నాయాసను విడుము. నీవునే చెప్పినదానికి నేటిసాంకాల
ములోపుగ నీసమ్మతి నీకున్నచో నెట్లయిన నాప్రాణములను త్యజిం
చివైచెదను. ఇఁక నీవంశగౌరవము నీపేరిమయు నన్నియు నీదగ్గరనుం
చుకొని భద్రముగ నీవె యనుభవింపుము" అనియాతని కాళ్ళపైబడి
వలవల యేడ్చెను. దానికాతఁడేమియు ననలేకపోవుటయేగాక, తాను
ఒప్పుకొనకున్నచో నిజముగ నంతపనిచేసి తీరునని భయంపడి సాహసు
రాలగు నామెతో నేలవృథాప్రయాసమని తలంచి, యాతఁడు దుఃఖ
ముతో నాగదిని విడచి బైటకుపోయెను. సాయంతనమువఱకు వారిరువు
రును మరల కలసికొనలేదు. కాని, యారుగంటలు కొట్టినతోడనే యెట్ట
కేలకు మనస్సును సరిపెట్టుకొని యామె గదిలోనికేగ, భోజనమైన
నెల్లక, మలినవస్త్రములతో. జీరాడు కేశభారముతో శయ్యపైపడి
పొర్లాడుచు దుఃఖించుచున్న తనమనుమరాలిని సమీపించి యామెచే

తిలో చేయిసాచి మెత్తిముద్దాడి కురులను సవరించుచు తనసమ్మతిని దెలిపెను. వారుచితాహారముల భుజించి, రవీంద్రభవానులకు నానం గతిచెప్పి, బందిఖానకేగిరి; అప్పటి కొసమిది గంటలయ్యెను. వారువచ్చిన కొండనే రాధనమస్కరించుటయు నానంద తాతను వీడ్కొని, దీవనలువడసి రాధంగూడి లోపికేగెను. భవానీశంకరుడును యింటి దారిపట్టెను.

---

## ౧౬ వ ప్రకరణము.



చెఱసాల

పాటలీపుత్రమున నుత్తరదిక్కున చెఱసాలయుండెను. మును పాషాణమయమగు కోట యుండెడిది; ఆకోట శిథిలమైనను దానిచుట్టును ప్రాకారము రెండువరుసలు మాత్రము చెడిపోవక నిలచెను. దానిలోననే దొరతనమువారు చెఱసాలయు, దానికావలి కొక చిన్నగృహమును నిర్మించిరి తక్కిన భూమిలో నాకారాగారరక్షకుడు కూరలు మొదలగునవి పండించుకొనుచుండును. అయ్యది నగరమునకు రాత్రులం దత్యంతభయావహమై చూపరులకు వెఱపుగొలుపుచుండును. అందు చెఱసాలరక్షణకై కావలియిచ్చు భటులు రెండుగోడలకు మధ్య తిరుగుచుండ లోన రక్షకుడును వానిభార్యయు పిల్లలును వసింతురు. తెల్లవారగనే రాత్రికావలివారు పోవుటయు, నిద్దరుభటులుమాత్రము పగటివేళ ద్వారమును రక్షించుచుందురు.

నాటిరేయి ద్వారమునొద్దర కావలియిచ్చువానిని దక్షిణపుదిక్కుననుండు సహచరుని యొద్దకేదియో పనిగల్పించిపంపి, రాధ యానందను లోనికిగొనిపోయెను. పోవునపుడు భీతాత్మయగుటచే నానంద లోని

కేఁగఁగనే నిట్టూర్పువిడచి యధికాయాసముచే మాటలాడఁజాలకదగ్గర నుండిన మంచముపై కూలఁబడెను. అదిచూచి భయపడి రాధయామెకు సేదదేరునట్లు చల్లనినీటిని మొగముపై చిలికి శ్రమనివారణార్థము తీయని వేడిపాలను త్రావనిచ్చెను. ఇంతలో మాధవుఁడులోనికివచ్చెను.

మాధవుఁ డానందకు నమస్కరించి చేతులుకట్టుకొని నిలచెను. ఆమె వానిని కృతజ్ఞతాసూచకదృష్టులతో చూచుచు "మాధవా ! నీవు నాకై పడిన కష్టము నెఱింగితిని. నీకష్టమునకు బహుమతిగానీయఁ దలంచిన పదివేలరూప్యముల నివె గొనితెచ్చితి"నని యామె కాసుల మూటను వానికందిచ్చెను.

మాధవుఁడు తానికార్యమునకు చాలకష్టముపై నొడంబడి నను నిజముగ విశ్వాసపాత్రుఁడు ; అతఁ డిదివరకెన్నఁడు నింతధనము గాని, యిట్టికార్యములలో పాల్గొనుట కాని, యెఱుఁగఁడు. వానికీధనము ను జూచుటతోడనే కన్నులు చెదరిపోయెను. కొంతవరకు నాతఁడు మాటలాడఁ జాలకుండెను. చివర కాతఁడు భార్యచే ప్రబోధితుఁడై తెలివిఁదెచ్చుకొని దానిని భార్యకిచ్చి "అమ్మా ! తమదగ్గరనుండి నేనింత ద్రవ్యమును పుచ్చుకొనుట కర్హుఁడను కాను. నాపొట్టకొఱకైయైనచో నిట్టిపని గావించియుండను. కాని, నాకు మితిమీరిన సంతానముండుటచే వారిపోషణమునకై యిట్టి పాపపుపని కొడంబడితిని. క్షమింతురుగాక" యని వినయపూర్వకముగ నానందతో మనవిచేసెను.

ఆహా! యీలోకమున ధనాఢ్యులకు సంతానము లేకయుండి పరితాపము గలుగ జేయుచుండ, కడుపునిండ కూడుదినుటకైన లేని దరిద్రులకు మితిలేని సంతానము గల్గుచు, దుఃఖావహమగుచున్నది గదా! వారికి సంతానము సుఖమిచ్చుటకు మారు, గృహమును నరక కూపముకన్న మిన్నగనొనర్చి, రోతపుట్టించుచుండుట జనసామాన్య

మగు విషయమే. దరిద్రుఁడు పగలంతయు కష్టపడి పనిచేసినను నాలుగై దణాలకన్న నెక్కువఁ గడింపఁ జాలఁడు; అదివారికూడు గుడ్డలకే చాలకుండుటయే గాక బిడ్డలఁగూడి కడుపు నిండుగ గంజియైన త్రాగుటకు వీలుగలుగ దయ్యె. అట్టివానికి సంసారమనిన నెంతసౌఖ్యకరముగ నుండునో చూడుఁడు. కాని, వానికి భార్యాపుత్రాదులనుపోషింపక తప్పునా? అతఁడు మంచికులజుఁడైనను గౌరవమును పాటించి పనిసేయకున్న గడువదుకదా. అభిమానమునకు కూలిచేయకుండుటకై యకార్యకరణమునకు సిద్ధపడి దొంగతనము మొదలగు దురితములకు గడంగును. కనుకనే మాధవుఁడు నిట్టియకార్యమునకొడంబడెను. కావుననే "ధనమూల మిదంజగత్" అనువాక్య మీకాలమున సత్తమోత్తమ ధర్మమై వెలయుచున్నది.

ధనమును భద్రపరచికొనిన పిమ్మట నవలికేగి పదునొకండు గంటలైన పిమ్మట కమలాకరునకు సేవచేయుటకై నియమితుఁడగు రంగస్వామిని నిదురింపబంపి, మాధవుఁడానందమయిని దీసికొని కారాగారమును దెరచెను. మాచదువరులకీపని యాతనికెట్లు సాధ్యమగును, యితరులెవ్వరును నుండరా యనుసందియము గలుగవచ్చును. దీనికి ప్రత్యుత్తరమేమన, నాయూరిజైలులో చిన్ననేరములుచేసిన వారును విచారణకుపూర్వముంచబడు వారును మాత్రమే యచట నుందురు తక్కిన వారందరును పరిభాష కారాగారమగు (Central Jail) కలకత్తా చెరసాలకు పంపబడుదురు ఈసమయములో నీపైతరగతులకు చేరినవారు రంగస్వామియు కమలాకరుఁడు నైయుండిరి. కమలాకరునిసంగతి మనకు తెలిసియేయున్నది. ఇఁక రంగస్వామియన్ననో సమీపమున నున్న కోటలోనుండి కూరలను దొంగిలించిన నేరమున కాయూరిన్యాయాధిపతి యాతనికొక పక్షము మాత్రము కారాగార

మున నుండునట్లు శిక్షించెను. కావున, వాయిరువురు నిందుండిరి. ఆకారణమున నిర్భయముగ మాధవునకు తలుపు తీయవీలుగలెను.

తలుపు తెఱచినంతనే కమలాకరుఁడు కానిసమయమున మాధవుఁ డిట్లు లోనఁ బ్రవేశించుట కేమికారణ ముండునని తలంచి "యెవరువా" రని ప్రశ్నించెను.

చెఱయం దున్న యీ నాలుగుదినములును కమలాకరుఁ డెట్లు గడపెనో చూచుట మనవిధియైయున్నది. ప్రథమమున నాతనికి మనసు చెదరిపోవుటయు నున్మత్తునివలె నాదినమంతయు నేరికోడను పలుకక రక్షకుఁ డన్నము తెచ్చిపెట్టినను తినక గడపెను. మఱునాఁటిసాయంకాలమున నాతనికి స్వస్థత చేకూరుటయు జరిగినవిషయములనెల్ల దలంచుకొని విచారింపుచుండెను. ఇంతలో మాధవుఁ డాతని కాహారముఁ గొని తెచ్చుటయు నాతఁ డేదియు ముట్టకుండెను. ఇదివఱలో బాగుగ నెఱిఁగినవాఁ డగుటచే నారక్షకుఁ డాతనియందు దయగల్గి యున్నమాఁ జినకున్న నించుక వేడిపాలనైనఁ గ్రోలుఁడని బలవంతము సేయుటయు నాతఁ డెట్టకేల కట్లొనర్చెను. మరునటియుదయమునందే యిరువురు భటులు పరివేష్టించి రా ముఖర్జియగు దెంచి కమలాకరుని సీతా సదనమునకుఁ దోడ్కొనిపోయెను; రాత్రిసమయమునుండి యాతనిఁ దీసికొనిపోవునపు డాయూరితుంటరు లాతని పలువిధములఁ గేలిజేసియు దూషించియు నవహసించుటయు నాతఁడు వ్యాకులచిత్తుఁడై యుండ ముఖర్జి యాతని నెట్టులయిన నేరము నొప్పుకొనుమని నిర్బంధపెట్ట సాగెను. కాని, సహజముగ ధైర్యశాలియు, నిర్దోషియు నగు నాతఁ డెట్లు సమ్మతింపఁగలఁడు? అట్లు తన ప్రయత్నము లన్నియు విఫలములగుటయు సాయంకాల మీయాతనిని విడి ముఖర్జి వెడలిపోయెను. ఆ రాత్రియే ఆనందమయినుండి లేఖ యరుదెంచుటయు నాతఁడు కడుం గడు సంతసిల్లి ప్రత్యుత్తర మంపెను. అధికసంతోషముచే నాతఁడు

వివశుఁడై మఱునాఁ డంతయు నున్మత్తునివలె సంచరించెను. మరల తెలివివచ్చినపిదప తానిదివఱ కంపిన లేఖ కేదైన జవాబు వచ్చినదా యని యడిగి నిరాశుఁడయ్యెను. ఇట్లాలోచనామగ్నుఁడై యుండ రాత్రి యందు కానితరుణమున తలుపు తెఱచుట యాతని కాశ్చర్యము గలి గించుటయు నాతఁడెవ్వరని ప్రశ్నించెను. అంత “నేను మాధవుఁడనని బదులు పలుకఁగనే తన యాశ లన్నియు నిరాశలగుటయు నాతఁడు మాఱుపలుకఁడయ్యెను.

మాధవుఁడు నానందను లోనికంపి ‘మీకొఱకు మీచుట్టములు వచ్చినా” రని చెప్పెను. కమలాకరుఁడును “చుట్టములా? యెవరు?” అని యనుచుండఁగనే మాధవుఁడు దీపమును పైకిచూపుటయు నానంద ముఖచంద్రుఁడగుపడినతోడనే యాశ్చర్యభరితుఁడై “ యిదికలయా, నిక్కువమా, మేలుకొనియుంటినా, నిదురింపుచుంటినా”యని తలంచు కొనుచు నాతఁడు వివశుఁడయ్యెను. ఇట్టిసమయమున నాతని సందేహ విముక్తునిగా జేయుటకు “నే నానందమయి” నని చెప్పఁ దలంచియు నానందభారముచే నానంద మాట్లాడఁ జాలదయ్యెను. అంత సంగతి నంతయు గ్రహించి మాధవుఁ “డీమె యానంద. నిన్నుఁ జూడవచ్చిన” దని చెప్పెను.

అతఁడును సంతోషముతో నామెను సమీపించి కరస్పర్శనము గావించెను. అంత నానంద ధైర్యము దెచ్చుకొని “మిత్రుఁడా!” యని పలుకరించెను. ఇంతలో మాధవుఁడును వానితో “ ఆర్యా ! ఎంతటి యకార్యమునకైన నొడంబడి యామెను మీదటఁ జేర్చితిని. క్షమింపవేడెదను. ” అని పల్కెను. అంత కమలాకరుఁడు ధైర్యముఁ దెచ్చుకొని “మిత్రమా! నీఋణము నేనెట్లు దీర్పఁగలను? నేను భగవత్కృపచే నీ చెఱనుండి విముక్తుఁడనైతినేని యీవిషయమును మఱచి పోవనని వాగ్దానము చేయుచున్నా” నని పల్కెను. ఆనందనుద్దేశించి

"చెలీ! ఆహా! నే డెంత సుదినము! నే జేసిన పూర్వపుణ్యపరిపాకము వలన నిన్ను మరల జూడఁగంటిని. నా కన్నుల కఱవు దీరె; నాజన్మము తరించె; ఇఁక మరణించినను సంతృప్తహృదయుఁడనై యుండ నట్లు చేయఁగల" నని పలికెను.

"మిత్రమా! ఇది మాతాపితల యకార్యమనియు, నేను మానాభిమానములను త్యజించి చెఱలోనికి వచ్చినను నీకు కోపము గలుగ వచ్చునని చెప్పినను, మన యిరువురకును గలుగఁబోవు ఆపదను దలంచి నేను రాకుండ నుండజాలకుంటిని. ఈ కార్యము తప్పయినచో క్షమింపు" మని యానంద మనవి చేసెను.

వీరిట్లు మాట్లాడుకొనుచుండఁగా తానచట నుండుట భావ్యము గాదని మాధవుఁడావలికేగెను. ఈమాటలు విన్నప్పుడు నీకమలాకరునకు అమితానందము గలిగెను. వివాహమాడ నున్నస్త్రీరాలై తిరిగి పరిశుద్ధిగ తన్ను ప్రేమించిన యువతీలలామ తనకొఱకిట్లు పాట్లు బడుచుండి తన పై ప్రీతిగ వచింప నెవనకు ఆనందము గలుగకుండును? అట్టి సమయము నొక క్షణమైనను జారనీయఁగదా? "ఆహా" యనుటకు దప్ప నాతఁడేమియు పలుకఁజాలఁడయ్యెను. కాని తన కార్యము భంగమగునేమో యని భయపడి యెట్లయినను తన కార్యమును సాగించుకొన దృఢచిత్తురాలైన యానంద వానిని మాటలాడనియకుండఁగనే,

"కాని, నీవు దోషివని మే మెవ్వరము నొకమారైన ననుమానింపలేదు. నేనును మాతాపితయు మీజనకియు నందఱమును నీవు దోషరహితుఁడవనియు, అన్యాయము జరగెననియు నమ్ముచున్నాము. లేనిచో నేనిచటికి వచ్చియుండను కదా! ఇపుడు నీకొఱకిచటికి వచ్చుటలో ముఖ్యోద్దేశము సంగతులన్నియు దెలియఁజెప్పి నీసహాయము నడుగుటయే. నీవిట్లు మౌనము వహించియుండుటచే నీ నేరము స్థిరపడు

యున్నది. దానఁ గలుగఁబోవు ఫలితమేదియో నీ వెఱిఁగియేయున్నావు. కనుక, దయయుంచి నాయందించుకేనియు ననురాగ ముండినచో నే నేమి చేయవలెనో చెప్పుము." అని దీనముగఁ బ్రార్థించెను.

"నా కిదంతయు తెలియును. కాని, నేనిట్లు చెప్పఁగలిగియుం డినచో నేనిట్లు బాధపడవలసిన యగత్యమేమున్నది?

"అట్లయినచో జెప్పవీలు లేదా?"

"వీలును లేదు. చెప్పినను నమ్మతగియుండ లేదు. ఇదివరలో జరిగినదంతయు చూడఁగా నేరమంతయు నేనే చేసినట్లు పొడకట్టక మానదు. దానికితోఁడు నావిజవృత్తాంత మెవ్వరితోఁడను చెప్పుటకు వీలును లేదు. చెప్పినను నా నిర్దోషిత్వము స్థిరపడకుండుటయే గాక నితరులమీఁద నిందారోపణ సేయవలసివచ్చును. దానివలన లాభ మేదియు లేదుకదా!

"అట్టులా?"

"అగును. అంతేగాక, నేర మొనర్చినవాఁ డెవఁడోగాని చాల నేర్పుతో చేసినాఁడు. తగిన జాగ్రత్త తీసికొన్నట్లుచు తోఁచుచున్నది. అందుచేత నాతనిని తెలిసికొనుట కష్టము. న న్నానమయమున నెచ్చట నుంటివని ముఖర్జీ ప్రశ్నించెను. కాని, నే నెట్లు చెప్పగలను? చెప్పినచో నేరముచేసినట్లే స్థిరపడునుకదా?

"అట్లయిన నిఁక కర్తవ్యమేమి?"

"ఇదంతయు గణేశునకు తప్ప నితరులకు జెప్పఁజాలను."

"నాకును చెప్పరాదా? నీసహధర్మచారిణినై నీ కష్టసుఖము లను పాల్గొనవలసినదానను గదా! ఏటికీసంశయము?"

"కూడదు! ముఖ్యముగ నిష్కల్మషహృదయవగు నీకు చెప్పఁ జాలను! అది తెలియఁజేసి నిష్కల్మషమగు నీ హృదయమును మలిన

యుక్తము చేయఁజాలను! క్షమింపుము! అంతవఱకు నోపిక పట్టి సహించుము!

„ఆలస్యమగుకొలఁది నీకు మేలు కలుగఁజాలదు!''

„అది నాకుఁ దెలియును. కానిమ్ము. దైవముపై భారమువైచి యున్నాను. సత్యమే జయము గాంచుచో నేను రక్షింపఁబడుదును. లేనిచో జరుగవలసినది జరుగనిమ్ము."

ఇట్లు పల్కుచుండగనే మాధవుఁడు కాలాతీతమయినదని యు నిఁక విరమింప వలసినదనియు ప్రార్థించుటకై లోనికి వచ్చెను. ఆనంద కమలాగుని మనోదార్ఢ్యమును, పట్టుదలయు, నెఱింగిన దగుటచే నిఁకలాభము లేదని తలంచి సెలవు దయచేయుము. పోయివత్తు"నని యాతఁడు నిడఁజాలక యామెను వీడ్కొనెను.

మరునాటి రాత్రి యెరికిని తెలియకుండఁగ మాధవుఁడామెను స్వస్థానమునకుఁ బంపివైచెను.

---

౧౭వ ప్రకరణము.

శివలింగ మూర్ఖుఁడా

ఆనందను కారాగారము దగ్గర వదలి యింటికేగిన భవానీశంకరరాయలు నా రాత్రియంతయు నిద్దుర పట్టలేదు. ఇదివరలో తన్నువిడచి యుండని తనముద్దులబాలిక నేఁడు తన్ను విడచి యొంటిగ, నెన్నఁడు నెవ్వరును పోనిచ్చగింపని స్థలమునకు పోయియున్న సమయములో నాతని కెట్లు నిద్దురపట్టఁగలదు? ప్రొద్దున నే లేచి, కార్యములనిర్వర్తించికొనినను, అతని మనసంతయు వ్యాకులతఁ జెందియుండెను. అందుచేత నతఁడు మామూలు ప్రకా

గము కాఫీనైనను త్రాగక యిటునటు తిరుగుచుండెను. ఇంతలో తొమ్మిదిగంట లగునప్పటికి తాతని చింతయను తిమిరమును బోగొట్టనరుదెంచుని శాకగానినిమాడ్కి యుల్లము పల్లవింప తలవనితలంపుగ నానందముఖచంద్రుడెగురరయ్యెను. సంతోషసంభ్రమములు లుప్పతిల్ల నా తండ్రి యామెను కౌగిలించుకొని, చెక్కులు ముద్దాడినంతనే యామె శరీరము జ్వరము తగిలినరీతి వెచ్చగనుండెను. కండ్లెఱ్ఱవడెను. ఇదిచూచి యాతండమ్మా! ఇట్లుంటివేల? జ్వరము తగిలినట్లున్న దేల? యనియాత్రముతో నడుగగా నామె "తాతా! రాత్రియంతయు నేడ్చుచుంటిని నేను పోయిన పనియంతయు వృథాయయ్యెను" అని పలుక "ఏమి? నీయత్నములు విఫలములయ్యెనా? నీవు, మిథునపురజమీందారిణివి, యిట్లుపోయి అడిగినను దుర్మార్గుడగు నాకమలాకరుడు నీతో మాట్లాడలేదా?"

"తాతా! వానిని దూషింపకుము. అతడు నాతో మాట్లాడెను కాని, తన సంగతి యెరికిని చెప్పుటకు వీలులేదని చెప్పినను నమ్మువారుండరనియు, నందముఖ్యముగ నాకెఱింగించుటకు వీలులేదనియు, తాను ప్రోషితననియు, కాని, యద్దానిని స్థిరపరచుటకొఱకితరులపై నేరము మోపవలసివచ్చుననియు, నిజమగు హంతకుడెవడో తనకు తెలియుననియు, తెలిసినను వాడత్యంత నేర్పుతో నీకార్యమును సాగించియుండుటచే స్థిరపరచుటకు తగినంత వీలు లేదనియు, నైనను స్వకీయసంరక్షణార్థమై తన సంగతినంతయు గణేశునకెఱిగింప నిశ్చయించుకొనియుండెననియు, నతవరికును తానేమియు చేయజాలననియు, తనకు నకీలును జూచుటకనుజ్ఞనిప్పుడంతవరకు నోపికపట్టియుండవలసినదనియు చెప్పెను"

ఇదియంతయు వినుచు డిసరవీంద్రుడు తన యూహ సరియనియు, ఏకార్యమునకును స్త్రీయొకతె కారణమైయుండవలెనని

యు వాస్త్రీసంగతిని చెప్పుటకు కమలాకరుఁడు శంకించుచుండుటచే నిట్లు పల్కెననియు నెంచెను. ఇఁక నాతని కీయూరివారి సంగతులనెల్ల భోగట్టా చేయవలెననియు, నందులకు తానేగుచుండిన వార్త వీరికి తెలియకుండుట యుక్తమనియు, తనకు సాయముచేయుటకై రమేశునిగాని, సురేంద్రునిగాని, యేర్పరచుకొనుట యుక్తమనియు తలంచుచుండ నింతలో నాడబోయిన తీర్థమెదురైన యట్లు రమేశుఁడచటి కరుదెంచెను.

రమేశుఁడిచటికి వచ్చి నాల్గుదినములైనది. అతఁడిచ్చిన పత్రిమును దీసికొనివచ్చుట కెవనినో పంపె గాని తానిచటికి రాలేదు. నేఁడాతఁ డొకముఖ్యమగుపనికై యిచటి కరుదెంచెను. తనతో గూడ శివసింగును మరల పరీక్షించి, యభిప్రాయము నీయవలసినదిగా నొకవైద్యుని దొరతనమువారు నియోగించిరి. అతఁడు శివసింగు వట్టి మూర్ఖుఁడు నున్మాదుఁడనియు చెప్పెను. కాని తగినంత పరీక్ష సేయుఁగా శివసింగు తామెల్లరును దలంచుచుండినంతటి మూర్ఖుఁడు కాడనియు, నతనికి నిజముగ తెలివితేట లుండెననియు, నవి వాని యిచ్చవచ్చినపు డుపయోగింప బడుచుండుననియు, లేనిచో నాతని నేమిచేసినను పిచ్చివానివలె నటించుననియు రమేశునకుదోచెను. ఈయభిప్రాయము సరియని నిరూపించి, శివసింగుపై తనకు గల పగను దీర్చుకొనవలెనని యాతని యుద్దేశము. కాని పైకి మాత్రము తాను పగచేత నిట్లు చేయుచున్నాఁడని పరులకు దెలియకుండు లాగున సంచరించుచుండెను. ఈయదనులో కమలాకరరాయలు, నానందములు కుటుంబముల వారిని తనకు సాయము చేయవలసినదని కోరవలసియుండెను. వారిచే దొరతనమువారి కర్జి పెట్టించి, శివసింగును తిరుగ పరీక్షించుటకు సమర్థులగునొక వైద్యులసంఘమును నియమింపఁజేసి పని చేయునట్లుగ నేర్పాటు గావింపవలెనని యాతని యభిప్రాయము.

రమేశుఁడు తానువచ్చినపనిని వీరికి తెలియఁ జేసెను. ఇచ్చట వీరికొక సందియము పొడమెను. శివసింగు నిజముగ పిచ్చివాఁడు కాడని స్థిరపరచినచో కమలాకరునకు ప్రతికూలముగా నాతఁడిచ్చిన సాక్ష్యము స్థిరపడునుగదా? స్థిరపడినచో కమలాకరుఁడు శిక్షాపాత్రుఁడు కాఁడా? ఇట్టిసమయములో శివసింగున్మత్తుఁడు కాడని ఋజువు చేయనుద్యమించు రమేశునకు వారు సాహాయ్యపడుటెట్లు? కాని, రమేశునకు శివసింగు ద్రోహియనియు, నాతనిని వలలో వైచికొని కమలాకరుని నాశము గావించుటకు కుట్ర చేయబడినదనియు, శివసింగు నిజముగ వెఱ్ఱివాఁడు కాడనిస్థిరపడినచో నీమోసము బయల్పడుననియు, తన్మూలముగ కమలాకరుని నిర్దోషిత్వము స్థాపింపవచ్చుననియు. దృఢమైన నమ్మకము గలదు. అందుచేత వీరినెట్లయిన సమ్మతింపఁజేసి తన కార్యమును సాగించుకొనుటకై రమేశుఁడు వచ్చెను. కాని, భవానిశంకరునకు మాత్రమిది సమ్మతముగా లేదు. అందుచేనాతఁడు రవీంద్రుని సాయమపేక్షించెను. రవీంద్రుఁడొకదినము గడువుకోరెను. కాని, రమేశుఁడిక నాలసింపవీలు లేదనియు, బహుశః వీరలు సాహాయ్యముచేయ నొల్లరనియు, తానే యెట్లో ప్రయత్నించి సఫలీకృతుఁడు గావలయుననియు నిశ్చయించి కోపముతో నొకగంటయైన నాలసింపవీలు లేదనిచెప్పి వెడలిపోయెను ఇట్లాతఁడు పోయిన వెంటనే కమలాకరునకొకలేఖ వ్రాసి తత్క్షణమే జవాబునీయవలసినదని కరంచందు ద్వారా వానికి రవీంద్రుఁడు పంపెను. దానికి కమలాకరుఁడును రమేశుఁడు తలంచినట్లుగా శివసింగు మూర్ఖుఁడు కాడు. అతని నితరులెవరో ప్రేరేపించి యిట్లు చేయించియుండవచ్చును. కాని, మీరీవిషయములో నేను మరల తెలియబరచు వరకుగాని, గణేశునితో మాట్లాడువరకుగాని, యేప్రయత్నమును చేయవలదని కోరుచున్నాను.

మనమీవిషయములో నెంత చిన్నతప్పొనర్చినను మనకది ఏషమముగా పరిణమింపవచ్చును. కనుక దయయుంచి ప్రథమ విచారణ పూర్తియగువరకు నే కార్యమును జేయకుండుడు. అది బహుశహా రెండు మూడు దినములలోనే పూర్తి కావచ్చును" అని బదులు వ్రాసెను.

ఈలేఖచదివినంతనే భవాని "హా మూర్ఖుడా! యెట్లుజాగు చేయుచున్నావు. ఇదియే నిను విషమమగును." అని విలపించెను.

భవానిశంకరుడును "ఈతడు చెప్పినట్లు యుక్తమా? " యని ప్రశ్నించెను. అందు "ఆతనికంతయు తెలియును. కనుక నాతడు చెప్పినట్లు ప్రవర్తించుటయే లెస్స" యని నుడివెను.

రవీంద్రుడు "చేయవలసినదంతయు చేసితిమి. ఇక మనమాత్ముడు చెప్పినట్లొనర్చుటయే కర్జ" మనియెను.

---

## ౧౮ వ ప్రకరణము.

### రహస్యము

ఆనందభవనము భస్మీభూతమైననాటినుండియు పాటలీపుర వాస్తవ్యుల కిది తెగనివనిగ్గెను. ఇదివరలో నేపనియు లేకుండినవారికిపుడు కమలాకరుని నేరముంగూర్చి మాట్లాడుకొనుటయో, విచారణ కేగుటయో ముఖ్యమగుపనియయ్యెను. ఎవరైన నిరువురుమనుష్యులు వీధిలో కలసికొనుట దటస్థించినచో "వింతలేమి? కమలాకరుని నేరమునుగూర్చి విశేషములేమి? క్రొత్తసంగతులేమైన దెలిసినవా? " యని ప్రశ్నించుకొనుటయే కుశలప్రశ్నలయ్యెను. ఇక నీనేరమునకు సంబంధించినవారుగాని, మేజస్ట్రీటుగాని, భవానిశంకరపరిభృతులు

గాని వీధిలోనుండి పోవుచో నదివరకెన్నఁడును వీధితలుపైన దాటియెఱుఁ
గని ఘోషాస్త్రీలుసహితము తలుపోరగిల బెట్టుకొని వారిముఖములఁ
జూచుచు, వారిముఖవికాసము లెట్లున్నవో పరీక్షించుచుండిరి. వీరంద
రికిని ముఖ్యముగా చూడఁదగినది పాపము రాధాకాంతునిముఖకాంతి
కృష్ణపక్షచంద్రునివలె నానాటికి తఱుగుచుండుటయే అతనికి దిన
ములుగడచుకొలఁది నేరస్థుఁడుగా తలపఁబడినవాని బందుగుల ముఖ
ములందుగాని, వానిముఖమందుగాని మార్పేమియు లేకుండుటయు,
ధైర్యము సడలకుండుటయుఁ జూచుకొలఁది యనుమానమున ధైర్య
ము వృద్ధి కాఁజొచ్చెను. వానికి నిద్దురలో కలలువచ్చినను, కమలాకరు
నిసంగతియే. ఒంటిగానుండినను కమలాకరుని తలంపే. అతనిమనోవ్యా
ధివలన రుగ్ణతగలుగుచున్నదని యెల్లరు ననుమానింపసాగిరి మాట
సందర్భమున తనకు నిద్దురయైన సరిగపట్టుట లేదని నవీనమోహనుని
తో నాతఁడు చెప్పగా "నీవు యీనేరమును స్థాపించి యశముగాంచఁ
దలంచుచున్నావు. కష్టములేనిదే ఫలముగలుగదు. కనుక నీవు కష్ట
ము లనుభవింపవలసినదే. వేటి కీపిచ్చితలంపు? ఇఁక నీవ్యాపారమునుండి
తొలఁగుటయే యుక్తము" అని చెప్పెను. ఈమాటలాతనికష్టమును,
దుఃఖము నినుమడింపఁజేసెను. నిరాశయధికమయ్యెను. ఇఁక కమలాకరు
నెట్టులయిన నేరస్థుఁడని యొప్పుకొనునట్లు చేయుటకై యాతఁడను
దినము నుదయమేపోయి చేతనగునన్ని ప్రయత్నములు సేయుచుండెను.
కాని, దానివలన కమలాకరుని మనోధైర్యము వృద్ధియగుచుండుటతక్క-
వేరులాభమెద్దియు గలుగుచుండుట లేదు ఇట్లాతఁడు చేయవలసిన పను
లన్నియు చేసి దీనిని చివరకు పైయధికారులకు నేరమును విచారించు
టకు సెషన్సునకు (Session court) పంపవలసినదిగావ్రాసి కమలాక
రునిఁ జూడఁబోయెను. కడసారిప్రయత్నముగ నాతనిని "కమలాకరా!
యేలయీకష్టములు. నీతప్పు నేలయొప్పుకొనవు; ఒప్పుకొన్నచో నీకు
కొంతశిక్ష తగ్గునుకదా" యని నుడివెను.

"ఓయీ! ముఖర్జీ! నీవిదివరకు నాయిత్రునివలె నటించుచు నన్నీకష్టమున పాల్జేసితివి. దీనసీకిహానునందునగూడ సౌఖ్యముగల్గుట కల్ల. నిర్దోషిగానేనట్లు నానేరము నొప్పుకొందును. నానేరమును విచారించుటకు ప్రధానన్యాయస్థానమున కంపుము. నీవు విచారించి యే తీర్పునిచ్చినను, మావారు దీనిపై నభియోగము (appeel) తెత్తురు. అపుడు నేను నాకు తోచినట్లు నానిర్దోషిత్వస్థాపనముఁ గావించుకొందును." అని ఖండితముగ చెప్పివేయుటయు, నాతఁడు "సరియే. అట్లే ప్రధానస్థానమువారికి వ్రాసెదను. నేటితో నావిచారణ ముగిసినది. నీసంబంధమగు కాగితముల నన్నిఁటిని హైకోర్టునకు పంపుటకు నవీనమోహానున కిచ్చినాను. ఈదినమునుండియు నీవు విడిఖయిదులోనుండవలెను మీవారికి లేఖలను వ్రాసికొనుటకుగాని, మీబంధుగులను సందర్శించుటకుగాని,తగిన న్యాయవాదితో నాలోచించుకొనుటకుగాని యనుజ్ఞ నొసంగితిని. నీయిచ్చవచ్చినట్లు చేసికొనవచ్చును. నాదగ్గరగుమాస్తాగానున్న కరంచందు నీలేఖలను మీవారికంపగలఁడని చెప్పెను. ఇయ్యెది యిప్పటిన్యాయశాస్త్రప్రకార మాచారమై యుండెను. అప్పుడే కమలాకరుఁడు తనవారికి "నాకుస్వేచ్ఛనొసంగినారు. రేపుప్రొద్దున్ననే గణేశునిచటికంపుఁడు" అని లేఖవ్రాసి కరంచందు చేతికిచ్చెను

ఈలేఖ సాయంకాలమే భవానిశంకరునకందుటయు నాతఁడు గణేశునకు కబురుచేసెను. గణేశుఁడు కమలాకరుఁడు దోషియని నమ్మియుండుటచే నాతనిచూత్మ "యిట్టియన్యాయప్రవర్తకులకై యేల వాడంతు"వని నిర్బంధపరుపసాగినను వాగ్దానముప్రకార మాతఁడు విధిలేక యొప్పుకొనవలసివచ్చెను.

నాటిరేయి యంతయు కమలాకరుఁడు మరునాడు గణేశునితో తానునడచుకొనవలసినదెట్లో నిశ్చయించుకొనుటయందే నిద్దురలేక

గడచెను. సూర్యోదయమయ్యెను. చండకిరణుని కాంతితోపాటు కమలాకరుని యాత్రియును వృద్ధియగుచుండెను. తదేకధ్యానముతోనున్న యాతనికి దగ్గరకువచ్చిర మేశుఁడు నిలచియుండుటయుఁ దెలియదయ్యెను గణేశుఁడాతనిపై చేయి వైచుటతోడనే కమలాకరునకు మరల జ్ఞప్తి వచ్చుటయు గణేశుని ముందు మోకరించి వినయవినమితగాత్రుఁడై నమస్కరించెను. గణేశుఁడు నాతని నాశీర్వదించి లేవనెత్తి "కమలాకరా! నాతోడ నేదియో ముచ్చటింప నెంచితివఁట" యని, యసమ్మతమగు భావముతో పల్కెను. వానికంఠధ్వనిని బట్టి యాతని మనోగతాభిప్రాయము నెఱింగి కమలాకరుఁడు లేచి దూరముగ నిలువఁబడి "మీకుగూడ నేను ద్రోహినని యెంచుచున్నదా" యని ప్రశ్నింప గణేశుఁడు నవ్వుచు "ఔ" నని ప్రత్యుత్తరమిచ్చెను. "నాముఖ్యమిత్రుఁడవై నాసంగతినంతయు పూర్ణముగ నెఱింగిన మీబోంట్లకుగూడ సందియముఁగల్గినప్పుడు నాప్రతికూలు రెట్టి ప్రబలసాక్ష్యములను సేకరించిరో బోధపడుచున్నది. ఆహా! యెంతజరిగినది! నేను మొదటనే చెప్పివేసియున్నచో నిట్లు రాకుండెడిదిగదా? నామర్యాద, నాసత్ప్రవర్తన, యంతయు నీసమయములో నన్నియు నిష్ఫలములయ్యెగదా! సరియే! దీనికేమి. నేనొక్కఁడనే దీనివలన నష్టమునొందుచో నేనీసంగతినే చెప్పకయుండెడివాఁడను. కాని, నామర్యాదయు, నాసౌఖ్యమే కాక, నావంశమును, నన్ననవరతము నిశ్చలమగుభక్తితో ప్రేమించి, నాకష్టమునే తనకష్టముగను, నాసుఖమునే తనసుఖముగను భావించి, నాకై ప్రాణములైన ధారవోయుటకు సంసిద్ధమై యున్న సుగుణాపురాశియగు నానందయు, తన్మూలముగ నామె వంశమును గూడ కళంకితములగుచుండ నేనూరకొనుటపాడిగాదు. ఇంతటిప్రబలసాక్ష్యములతో గూడి నన్నిదివరకెంతయు గౌరవముతోను ప్రేమతోను జూచువారి హితులకెల్లరకును గూడ నన్ను నవమానపాత్రునిగను, నిందార్హునిగను జేసి

వైచిన యీనానేరమునంతయు నొక్క వాక్యములో నసత్యముగను, నిరాధారముగను, జేసివైచి వానిరపరాధత్వమునుఒప్పుకొనునట్లు చేయ గలవాడును. చూడుడు "అని దాని దరిజేరి చెవిలో మెల్లగా" పూర్వము మనోరమ నాప్రియురాల"(Iam her lover) నిచెప్పెను.

---

౧౯ వ ప్రకరణము.

స్వీయచరిత్ర

మనోరమయనిన పతివ్రతాశిరోమణియనియు సుగుణాలవాల యనియు, పాటలీపుత్రములో నెల్లరు నమ్మియుండిరని యిదివరలో చెప్పియుంటిమిగదా! అట్టివారిలో గణేశుడు ముఖ్యుడు. భూమినలు చదరముగనున్నదనియు. గుండ్రముగ లేదనియు, నమ్మునట్లు చేయుట యీకాలములో నెంతకష్టమో, గణేశుని మనోరమ దుశ్శీల యని న మ్మించుటకంతకష్టముగా నుండెను ఆతడిది యంతయు కమలాకరుని పన్నుగడయని భావించుటచే నాతనియందుండిన ప్రేమయు గౌర వము నొక్కక్షణములో నశించెను. ఇంక నొకమాటయైన వినుటకాతఁ డిచ్ఛగింపలేదు. కానిసుతునివలె జూచుకొనుచు, నాని పెదతండ్రికాలము నుండియు వారియుప్పుదిని బ్రదికినవాడగుటచే పూర్వమైత్రిని విడువఁ జాలక పీనిమాటలయందు నమ్మకముండినను లేకుండిన నాతఁడు చె ప్పు నీయసత్యవృత్తాంతమును సావధానచిత్తుఁడై యంతమువరకు విను టకు సమ్మతించెను. అంతట వారిరువురును కూర్చుండినపిమ్మట తన పూర్వవృత్తాంతము నిరీతిగ చెప్పఁదొడఁగెను. కమలాకరుఁడు,

"నేను చెప్పబోవునది నిజముగ మనుష్యమాత్రులును అందు ముఖ్యముగ పటలీపురవాస్తవ్యులును నమ్మజాలరని నేనెఱింగియున్నా ను. కాని విధిలేక చెప్పుచున్నాను. ఆనాఁటి సంగతులన్నియు కండ్ల

కుగట్టినట్లు నాకిప్పటికిని కనంబడుచునే యున్నవి. ఇప్పటికి సుమారు నాలుగువత్సరములకిత్రము మనోరమను మా పెదతండ్రిగారి గ్రామ మగు బంకిపురములో నొకజమీందారుగారింట జూచితిని. అప్పటి కామె కిరువదిమూడు సంవత్సరములును నాకిరువదిసంవత్సర ములు నుండును. ఆమె వారికి బంధుగురాలగుటచే వారింటికి పెం డ్లి కాహ్వానింపఁబడివచ్చెను. నేనును మా పెదతండ్రిగారితోఁ గూడ యాహ్వానింపబడి యచటకుఁబోతిని. ఆమెరూపలావణ్యాతిశ యములుగాంచినతోడనే నామనసు చలించెను. ఆమెనాకు భూ లోకరంభయైయుండెను. ఇదివరలో నత్యంతజనసమ్మర్దమగు కల కత్తాలో వసించుచుండి, యసంఖ్యాకులగు స్త్రీలను జూచియున్న నాకామెఁబోలుపూఁబోఁడి నాకిదివరలో గన్పట్టలేదు. ఆమెను జూచిన ప్పటినుండియు నాకొక నూతనభావ ముదయించెను. ఆమెనాజీవితము నందొక ముఖ్యమగు పాత్రికాబోవుననియు, నాచరిత్రకామెయు తో డ్పడగలదనియు నాకొకయశరీరవాణి చెప్పినట్లు తోచెను. వేయేల? నేనామెను మోహించితిని. అచట పెండ్లికై వచ్చినవారిలో నొకని మి త్రత్వమును సంపాదించి యాతని నామెఁగూర్చి ప్రశ్నించితిని అం తు లకాతఁడామె ధనపురేశుని భార్యయనియు వారిది పాటలీపుత్రప్రాంత మున నున్న మధుపురమనియు చెప్పెను. ధనపురంజమీందారులకు ను, మాకు నిదివరకు విరోధముఁబుండినట్లును, వారికి మాకు నొక స రోవరము యొక్కలహామునకు కారణమైయుండినట్లును పలుమారు మా పెదతండ్రిగారు చెప్పుట నాకు స్ఫురించుటయు, వివాహితయు, వి రోధభార్యయునగు కాంతయని తెలియుటతోడనే యాతలంపానము యమునకు వీడితిని. రెండుమూఁడు దినములుగడపి నేను విద్యాభ్యాస మునకు మరల కలకత్తాకేగితిని. ఇదియే మా ప్రథమసమాగమము?

చదువుకొను కాలమందు గూడ నేనెంతమరువవలెనని తలంచి నను ఆమె ప్రతిబింబమే నాకు ప్రతిదినమును కనంబడుచుండును. మరల శీతకాలపుశెలవులకు నేను బంకిపురమునకు పోవుచుండ; నొక నాఁడామె యెచటనుండియో తనబంధువుల గ్రామమగు బంకిపురమునకు పోవుచు రైలుస్టేషనులో నాకు కనఁబడెను. ఆమెనుజూచినంత నే యిదివరకు పరీక్షగొడవలలో నుండి మరచిపోయినవృత్తాంతము మరల జ్ఞప్తికివచ్చెను. కాని, పరస్త్రీతో మాట్లాడుటకు వలనుపడదుగదా! అందుచేత నామె వెంటనే వేరొక శకటమునారోహించి నేను నాగ్రామమునకుపోతిని. ఆమె నన్ను పోల్చుకొనినట్లుమాత్రము నాకెట్టులో పొడకట్టెను.

“శలవు సుమారొక నెలయుండుటచే నేనానెలయంతయు నా యూరనేగడపితిని. ఒకటి రెండుసారు లాయూరనుండిన యామెబంధువుల తోటలోనికివిహారార్థులై తోడిస్త్రీలతో వచ్చుచుండుటఁజూచి నేనామె కండ్లబడుటకై వారువచ్చుసమయమున నాతోటనే సంచరింపుచుంటిని. ఇట్లొక వారము గడచిన తరువాత నామె మరల నాగ్రామమువదలి పతిగృహమునకు పోయెను. ఒకదినమున మాటలసందర్భమున నేదియోయామిషఁబెట్టి మా పెదతండ్రితో ధనపురము వారినిగూర్చి ప్రసంగించుటయు నాతఁడు మాకుగలవైరకారణము మొదలగునవి చెప్పుచు రెండువత్సరములక్రితము ధనపురాధీశుఁడు నవయౌవనవతియు నొకధనాఢ్యుఁడగు కలకత్తాపురవాసియొక్క కూతురగు మనోరమయను నామెను పరిణయంబయ్యెననియు. నేకారణముననో గాని వృద్ధుఁడగు నాతనికిచ్చుటకు మనోరమతండ్రి వెనుదీయఁడనియుఁ జెప్పి యెట్లున్నను వారిరువురు నన్యోన్యానురాగబద్ధులై విలసిల్లుచుండిరనియు, సుమారైదుమాసములక్రితము వారికొక యాఁడుశిశువుగల్గెనని

యని చెప్పెను. ఇది వినిన నాకు నా ప్రేమస్థానమగు స్త్రీ పేరు మనోరమగదాయని తెలియుటచే నాకొకింత సంతసమొదవెను?

“నేనప్పటినుండియు నామెపేరు పలుమారు దలంచుకొనుచు, నామె యాకృతిఁదలపోయుచు, కొంచెము కవిత్వమును నేర్చినవాఁడనగుటచే నామె రూపమును వర్ణింపుచు వలపుదెలుపు పద్యముల నామెపేర వ్రాసి చదువుకొని యానందింపుచుంటిని. ఇట్లుండగ నొకమారేదియో భూములనుగురించి తగవులను బరిష్కరించుకొనుటకై ధనపురజమీందారుగారితో మాట్లాడుటకై మా పెదతండ్రి మధుపురమునకేగుచు నన్నుగూడ తన తీసికొనిపోయెను. అపుడు నా తలంపు లెట్లుండెనో మీరే యూహింపుడు.”

“ఇఁక నా యూహలను కార్యరూపము దాల్చునట్లు చేయఁగల్గు సమయము తటస్థించినదని నా మనస్సునకు తట్టెను. మేమాయూరనున్న కాలమున మాకు సంబంధించిన సీతాసదనములో నివసింపుచుంటిమి. అచటివ్యవహారములు స్థిరపడకుండినను మా పెదతండ్రియు ధనపురాధీశుఁడును మాట్లాడుటలోననె యొక నెలదినములు గడచెను. ఆ కాలమున నేనును మా పెదనాన్నతో తరుచుగా నానందభవనమునకు పోవుచుంటిని. ఒకటిరెండుసారులు పోయినపిమ్మట నొకనాడు మనోరమ మరల నాకండ్లకుఁ గన్పట్టెను. అంత నేను పరవశుఁడనై సిగ్గుచే తలవంచికొంటిని. ఆమె నన్నుచూచిన వెంటనే నన్ను గుర్తించినదానివలె జూచుచు లోపలకేగెను. ఇట్లొకటి రెండుదినములైన తరువాత నే నొకసారి యావీధిలోనుండి మా చిరపరిచితుఁడవగు మీగృహమునకు వచ్చుచుండఁగా నామె వారి మేడపైనుండి క్రిందుగబోవు నన్ను జూచెను. నేనును తలయెత్తి యామెను జూచినంతనే యులికిపడితిని. అయ్యది యామె బాగుగ గుర్తించి చిరునగవు నవ్వెను. ఇట్లు నవ్వుటచే నా కామెయు నన్ను ప్రేమించుచున్నట్లుగ దోచెను.”

"అంత మా పెదతండ్రిగారు వెడలిపోవుచు నన్ను మరువాడు బండిలో రావలసినదనియు, నచటనొక దొరకు కొంత పైకమీయవలసి యుండుటచే మరువాడిచ్చెదరని చెప్పిరనియు, నేనది తీసికొనిరావలసినదనియు చెప్పి వెడలిపోయిరి. నేనును మరువాడా ధనము తీసికొని రైలు స్టేషనుకు పోగా నచట మనోరమయు నొక పరిచారికయు కూడ రైలునెక్కినట్లు చూచితిని. మనోరమ మొదటితరగతి బండిలోను, పరిచారికయు పిల్లయు రెండవతరగతి బండిలోను ప్రయాణము చేయుచుండుట జూచి నేనును మొదటితరగతి బండిలో నామె కూర్చుండిన దానిలో నెక్కితిని. ఆమె నన్ను చూచినంతనే తాను కూర్చుండిన యాసనము వదలి యింకొక యాసనముపైకి పోయెను. ఇదియు శుభసూచకముగ గ్రహించి నే నామె కూర్చుండిన స్థలములో గూర్చుంటిని. మేమిరువురమును గూర్చుండిన బండిలో నేలొకో విధి ప్రేరితముగ నెవ్వరును రారైరి."

"ఇట్లు కొంత కాలముగూర్చుండునప్పటికి బండి కదలెను. నా కార్యసాఫల్యమునకై యత్నించుచుండినవాడనగుటచే నేనామెను మాటలలోనికి దింపితిని. ఆమె తన తండ్రి ధనవంతుఁడైనను, ఒకానొక సంఘము దివాలాతీయుటచే తమయాస్తియంతయుపోయి, తుదకు గౌరవమునకు భంగముకలుగుట సిద్ధముగున్న సమయమున, బాల్యస్నేహితుఁడగు తన తండ్రిని జూడవచ్చిన ధనపురజమీందారు తనను మోహించి తనకు పెండ్లి చేసినచో తండ్రికి ధనసాహాయ్యము చేయుటకియ్యకొనెననియు, తన తండ్రి యీసంగతి తనకు తెలియఁజేయగా, వారి నీయాపదనుండి రక్షించుట తన విధియని తలఁచి యీకొనెననియు, నంతటినుండియు వృద్ధుఁడైనను అగ్నిసాక్షిగ పెండ్లియాడుటచే వానినే ప్రేమించి యుండెననియు చెప్పెను. ఇది వినినంతనే యామె విధిలేక తన ముసలి పెనిమిటిని ప్రేమించుచుండెననియు, లేకున్నచో నట్టివానియందెట్లామెకు ప్రీతికలుగఁగలదనియు దలంచి యామె కాతనియం దసహ్యము జనిం

చుకొనుటను వృద్ధులను వివాహముచేసికొనిన భార్యలవిషయమై యొక చిన్నయుపన్యాసము నిచ్చితిని. ఆమె మనస్సిదివరకే విఱిగియుండుటచే నామాటలయందామె కిష్టమును వానియందయిష్టము నినుమడించుటయు, నేను చెప్పినదానికంతయు “నూ” కట్టుచుండెను. కొంతవడికామెను వశీకరణ జేసితినని నామనంబునకు తట్టినంతనే యామెకు మాపూర్వసమావేశమునుగుఱించి జ్ఞప్తికి దెచ్చుటయు నెట్టకేలకామెయు నాయందిదివరకే కొంచెమనురాగము గలదియగుటచే నాయందలి మోహము వృద్ధియై తన సమ్మతిని నాకెఱుకపఱచెను. ఆహా! ఆసమయమును దలంచికొనిన నాకిప్పటికిని మనస్సు కఱఁగిపోవుచున్నను. అంతకంటె నాకు కావలసినదేది? నాకు స్వర్గపదవి చేకూరినట్లు సంతసించి నాకు నట్టి యభిప్రాయముండుట సూచించితిని. ఇంతలోనన ఖంకిపురమునొద్ద బండినిలచెను నేనొకశకటమును బాడుగకుతీసికొని యామెను గూర్చుండుమని నిర్బంధించితిని; ఆమె యట్లుగావించుటయు నేనామెను వారిగృహమునకు జేర్చితిని”

‘ఆయూరనామె నాలుగైదు దినములుండెను. అనుదినమును సాయంతనము మేమిరువురము నూరిబైటనుండినమామిడితోపులో కలసికొనుచుంటిమి. ఒకనాడామె తాను ప్రతివత్సరము నొకనెల తన తండ్రి గృహమున కలకత్తాలో గడపుచుండుననియు, నాకాలములో మేమిరువురమును సమావేశమగుచుండుట కొకగృహమును కొనవలసినదనియు నాకుచెప్పెను. ఆమెమాట నాకు రామాజ్ఞవంటిదగుటచే నేనూరిబైట నొక తోపును, దానిమధ్య నొకచిన్నమేడను కొని దానికి “రమావిలాస్” అని యామెపేరిట నామకరణము గావించితిని; అందు మేమట్లు ప్రతివత్సరమును తప్పక కలసికొనుచుంటిమి.”

“ఇపుడుకూడ నాగృహము నీయధీనమందున్నదా?” యని గణేశుఁడు పృచ్ఛచేసెను;

"ఉన్నది."

"ఉన్నదనినచాలదు. అట్లు ఋజువు చేయఁగలవా?'

"చేయఁజాలను నేను మాతలిదండ్రులకు తెలియకుండఁగ మా పెదతండ్రిని కొన్నియప్పులను దీర్చుమిషచే పైకమడిగి తీసికొని నాస్నేహితుని పేరను కొంటిని. అచటివా రెల్లరు నన్ను గుర్తింపఁగలరు. కాని యొకనికిని నానిజనామము తెలియదు"

"పోనీ! నీస్నేహితుఁడిపుడున్నాడా?"

"లేడు; చనిపోయినట్లు తెలిసినది;"

"అతఁడు నీకు వ్రాసియిచ్చిన పత్రమున్నదా?"

"అయ్యదియు, నాకు మనోరమ వ్రాసియిచ్చిన యుత్తరములును నాకాలమందు నాకామె యిచ్చిన బహువిధముల వస్తుచయము నేనా మేడయం దొక బీరువాలో పెట్టితిని కాని, యుద్ధకాలమునందు నాయింటియందు విడిసిన సైనికులా వస్తువుల నన్నింటిని పాడుచేసివైచిరి;

"ఆహా ! నీకు ప్రతిమాటును యుద్ధమే యాటంకముగనున్నదే!" యని విసువుకొనుచు గణేశుఁడు పల్కెను;

"అగును"

"మీకు పరిచర్య సేయుటకై యెవరిని నియోగించియుండ లేదా?"

"మాకు పరిచర్యకై యొకయాంధ్రవనిత సీతయనునామెను కుదిర్చితిని; కాని, మనోరమ వచ్చుసమయములం దామె నేదోమిష పెట్టి యూవలకు పంపివేయుచుండువారము"

"ఆస్త్రీ యిపుడెచ్చటనున్నది; ఆమె మనోరమను చూచియుండ లేదా? చూచియున్నచో నీకు కొంత సాహాయ్యముగలుగవచ్చును"

"మాచియుండజాలదు. మేమందులకు తగుజాగ్రత్తతీసికొను చుందువారము"

"పోనీ! ఇపుడామె యెచటనున్నదో చెప్పగలవా?"

"ఆమె స్వదేశమునకు వెడలిపోయినది. ఆమె రాజమహేంద్రవర సామీప్యమున నొకకుగ్రామమందు తన తలిదండ్రులుండిరని చెప్పు చుండెడిది."

"మీయింటిమునలి సేవకుఁడగు రాఘవున కీవర్తమానము నెపుడైన చెప్పియుంటివా?"

"చెప్పలేదు. కాని, యాతనికా పేరుగల గృహమొకటి నాయధీనములోనుండెనని తెలియును."

"సరియే; అదియు నీకు విషముగ నేయున్నది. ఆహా! ఎంత మూర్ఖము." అని గణేశుఁడు గొణుగుకొనెను.

"తండ్రీ! గణేశచంద్రా! నేనిదివరలోనుండియు నీకు చెప్పినదంతయు విని "రామాయణమంతయు విని రామునకు సీత యేమగు" నన్నట్లు మరల నడిగెదవేమి? మనోరమ చాల తెలివైనది. అదియుఁ గాక మాగౌరవములు నిలువబెట్టుకొనుటకు చేయఁదగినంత రహస్యముగ మాకార్యముల జరుపుకొనుచుంటిమి. నాకిట్టిగతిపట్టుననియు, నన్ను ప్రేమించిన, నాయందు నమ్మకముంచిన, నాకై తన మగనిని సైతము వీడసంసిద్ధయైయున్న యామెను మరల నేనే రహస్యము బైటబెట్టి నలుగురిలోన తలయెత్తికొని తిరుగకుండునట్లు సేయవలసియుండుననియు, నేనెట్లు తలంపఁగలను. ఇపుడైనను మించినది లేదు. ఏదియెట్లయినను సరియే. నేనామె సంగతిని బైటబెట్టజాలను. జరిగెడిదేమో జరుగుగాక!"

చటర్జియు ముగము నావలివైపునకు త్రిప్పుకొని,

"సరే! నీసంగతియంతయు సాంతముగ వివరింపుము." అనెను.

ఇదివరకు గణేశచంద్రుని మాటలను వినుటచే నధైర్యపడినను మరల ధైర్యముఁ దెచ్చుకొని,

"ఇప్పటికి నాల్గువత్సరముల క్రితము నేనీగృహము కొంటిని. అప్పటినుండియు తరుచు మేమీయింటిలోనె కలసికొనుచుంటిమి. మనోరమకు తండ్రియింట గారాబమధికమగుటచే స్వేచ్ఛయునధికము. అందుచేత నామె దినదినమును బంధుగులను చూచుటకై మిషపెట్టి నాతో నాలుగైదుగంటల కాలము వసియింపుచుండును. ఒక్కొక్కప్పుడు సమీపముననున్న స్నేహితురాలిని జూడబోవుటకై పొరుగూరు పోవు సాకుబెట్టి రెండుమూడు దినములు నాతోడ నేయుండును. కలకత్తాలో చదువుకొనుచుండుటచే నాయునికినిగూర్చియు, ప్రశ్నించువారు లేరు. క్రిందటి సంవత్సరము యుద్ధము జరిగినంతవరకును మేమిట్లు వర్తింపుచుంటిమి కాని, యింతలోనె నాకేదివలయుననన్న నది యిచ్చుచు, నత్యంతవాత్సల్యముతో నన్నరయుచుండెడి మాపెదతండ్రి గతించుటయు, వానియాస్తియంతయు నాకు సంక్రమించెను. దీనివలన నాయిచ్చవచ్చినట్లు సంచరించుటకును, నాయిచ్చవచ్చినచోటి కెపుడువలయునన్న నపుడు పోవుటకును మిగుల సహాకారియయ్యెను."అని కమలాకరుఁడు తన వృత్తాంతమును మరల చెప్పఁదొడఁగెను.

---

## 20 వ ప్రకరణము.

నేరము జరిగిన రాత్రి

కమలాకరరాయ లెట్టులైన తనసంగతి త్వరలో ముగించి యానందభవనము తగులబడిననాటిరాత్రి సమాచారము చెప్పి, తనకేక ముక్తికి మార్గమిదయిన నున్నదో లేదో తెలిసికొనవలెనని యాతురతతో నుండుటఁజేసి కొంచెము తాళి,

"గణేశా! మీకక్కఱలేని యనవసరములగు విషయములను వదలిపెట్టి ముఖ్యవిషయముల మాత్రి మొఱింగించెదను. పెక్కులేల ? మా పెదతండ్రిగారు గతించిననాటినుండియు నాకు స్వాతంత్ర్యము వచ్చుటయు, మనోరమయు నేదో యొకవంక బెట్టుకొని నెలకొకమారు తప్పక వచ్చి నన్ను కలసికొనుచుండుటయు జరుగుచుండెను. ఇట్లుండు కాలమున నామె నామీద నత్యంతాధికారము జూపుచుండును. ఆమె రమ్మనిన వచ్చుటయు, పొమ్మనిన పోవుటయు, నేది చెప్పిన నది దాసానుదాసుని వలె చేయుచుండుటయు, గనుండెను. నా కామెను జూచునప్పటికి కొంతకాలమునకు భయము గల్గుచుండెను. ఒకనాడు నన్నామె కఠినముగ శాసించునట్లు చెప్పుటతోడనె నామనస్సు విరిగిపోయెను. అప్పటినుండియు నెట్లయిన నామెనుండి తప్పించుకొనగల్గుదునాయని తలంచుచుంటిని."

ఒకనాడు మాతల్లి నన్ను దరికి జేరబిలిచి "నాయనా ! నీకు ప్రాయమువచ్చినది. ఇక వివాహితుడవై సంసారభారమును నిర్వహింపవలెను. మీతండ్రియు నేనును వృద్ధులమగుచున్నాము. నీకయి చాల సంబంధములు వచ్చుచున్నవి. నీవువివాహమాడఁగా చూచి సంతసింపఁ గోరుచున్నాము. నీయిష్టమేదియో కనుఁగొనకుండ సంబంధము నిశ్చయించుట కిచ్ఛలేక యింతవరకు నూఱకొంటిమి. నీయభిప్రాయ మేమి" యనిప్రశ్నించెను. నేనంతట నేమియు చెప్పక తప్పించుకొనుటకై "ఇప్పుడివివాహము చేసికొనఁ దలంపను. కొంతకాలమైన పిమ్మట చూచుకొనవచ్చు" నంటిని.

ఈవిషయము మనోరమ తెలుసుకొనఁబోచి యెట్లయిన నామెనిశ్చితాభిప్రాయము నెఱుంగఁదలంచి సందర్భవశమున నామెతో "ఈదినమున నేమి జరిగెననుకొంటివి ? మాయమ్మ యెవతెయో ధనికుఁడగు జమీందారుకూతును వివాహమాడుమన్నది" యని ధైర్యముఁదెచ్చుకొని

పల్కితిని. ఆమె మొట్టమొదట వివర్ణవదనయయ్యు ధైర్యముఁదెచ్చుకొని క్రూరవ్యాఘ్రిలీల నన్ను చురచురఁ జూచుచు—అబ్బా! ఆచూపుల దలంచుకొన్న నాయెడలిప్పటికిని కంప మొందుచున్నది—"ఏమి యట్టులనా? నిజముగ వారట్లు తలంచుచుండిరా?" యనిప్రశ్నించుటయు నాధైర్యమంతయు నొక్కమారుగ నన్నువీడ,

"లేదు లేదు. ఊరకయట్లంటిని. కాని, యెప్పటికైన నట్లుజరుగ వలసినదేగదా?" యంటిని.

ఆమెయు "అట్లగుచో నేనేమి కావలసియున్నది?" అనియెను.

"నీవు నాప్రాణమిత్రమవు కాని వివాహితవగుటచే నీకును నాకును మధ్యనంతరాయములు పెక్కులున్నవికదా?"

"అయినచో నేనిదివరలో నీయవసరముఁ గడుపుకొనుటకు కీలుబొమ్మవలె నుపయోగించుకొనుచుంటివి గాబోలు? నేను నీయవసరము దాటినవెనుక విడచివేయఁదగినదానను. నీవిదివరలో నిమిత్తమాత్రపు దాననగుటచే నీవు వివాహమును సుఖపడుసమయము వచ్చినచో నన్నువదలివేయుదువు. నేను మరల నామగనితో వేగుచు, స్త్రీనగుటచే, నాకర్మమింతియేకదా యనియేడ్చుచుండవలసిన దానను గాబోలు. అట్లనితలంపుచుంటివా?"

"నీకు మగఁడు బిడ్డలు నున్నారుకదా?" యనియేదియో చెప్ప బోవుచుండఁగా నామాటలకడ్డమువచ్చి

"అట్లు నామగనితో గడపుచు నీవుచ్చదశయందుండిన చూచుచు నూరకుందుననుకొంటివా? అట్లెన్నఁడు జరుగఁజాలదు"

"మరేమిచేయఁదలంచెదవు?."

"నీవువ్రాసిన లేఖలనన్నిటిని చూపెదను."

ఆ మాటలు నాకు వెఱపు గలుగ జేసిన నింక నేమి చెప్పుదునో యని,

"నిజముగ నీవట్లు చేయుదువు" యంటిని. ఆమెయు

"నా యనస్సాక్షిగ నేనట్లు తప్పక చేసితీరెదను." అనియామె ప్రత్యుత్తరమిచ్చెను

ఇయ్యది జరిగి సుమారు రెండుసంవత్సరములైనను నాకిదంతయు జ్ఞప్తియందున్నది. ఆమెకళావిహీనమగు మొగమును, ఆమెమాటలును, నామనస్సునందు దృఢముగ నాటియున్నవి ఇప్పుడామె చెప్పిన మాటలనే నీకు చెప్పఁగలను. ఆమె "కమలాకరా! నాయీమాటలు నీకాశ్చర్యము గొల్పునని నేనెఱుఁగుదును. నిజముగ నీలోకమందు తమపతులయెడ ద్రోహబుద్ధితో వర్తించు స్త్రీలు తమవిటులను మాత్రమెట్లు తమయెడ బద్ధులైయుండఁదలంచెదరు! అట్లెన్నటికిని జరుగదు. పెనిమిటికను ద్రోహిమై వర్తించువడతి తనమిండఁడు తన్ను పరిత్యజించినను మాటలాడజాలదు. ఎవరితోడను చెప్పజాలదు. చెప్పుటయెట్లు? ఇతరులకెఱుకబరచిన, పాతరంకులు బైటఁబెట్టుకొనుటయేకదా? కనుక నేయది నీతివర్తనులగుపురుషులు సంసారులే తమను ననుకూలించువారని తలంచుచు నట్టివారిని చేరఁదీసినవారికనవసరమని తోచినప్పుడు 'యేరు దాటి తెప్పతగులవేసినట్లు' విడచి పుత్తురు ఆహా! స్త్రీజాతి ధైర్యవిహీనమైనదిగదా! మగవారివంటి సాహసముండిన వారలు శక్తినంత యాలోచించుకొని మనసునకు నమ్మకము చిక్కకయే యితరులవలలఁబడి, తమసంసారమునకు దూరులు కారుకదా? కాని, నేనట్టి యబలనుగాను. ఇదివరలో నెట్టిస్త్రీయైనను చేయనట్టి సాహసకార్యమును నేనుచేయఁగలను. మనమిరువురమును తప్పుచేయుటయు, నందుకొఱకై నేనొక్కతెనే బాధల ననుభవించుటయు, నీవు సుఖమందుటయు తటస్థింపఁజాలదు. నీయిచ్చవచ్చిననారీమణిని వివాహమాడి, యేకష్టమును లేక సుఖముగ కాలముగడపుచుండ నేనధోలోకమునఁబడి, సౌఖ్యమనుమాటలేక కులగౌరవములకంతకును దూరమై యిహమునందును

పరమునందును, సౌఖ్యదుఃఖముల నందుచుండవలెనుగా? అట్లెన్నఁడును జరుగదు.

"ఇదివరకు నుండియు నీవు నావాఁడవైయుంటివి, ఇంకముందు నట్లేయుండవలెను. ఇదివరలో నీకు నేనాత్మగౌరవమునే ముఖ్యముగ జూచుకొందునని చెప్పితినిగాని, యీప్రాణము లంతలీపియని చెప్పియుండలేదు. నీవివాహకాలమున నీసంగతినంతయు నామెనిమిటితో చెప్పివేసి నేనాత్మహత్యఁగావించుకొందును. సమర్థుఁడైనచో పతిఁడే నీరక్తముతో నాపగదీర్చును. కానిచో నామృత్యువునకు నీవే కారణమైన ప్రజలకు తెలియకపోవదు. ఇదిమాత్రముజరిగితీరును. ఇది నా నిశ్చయము. దీనికెన్నఁడును విఘాతములుండవు" అనిరూక్షణవీక్షణపూర్వకభాషణములాడెను; ఇదివినినవారికెట్లులుండునో నీవాలోచింపుము. ఆమెయాత్మగౌరవమునే యధికముగ జూచుకొనుచుండుటచే నిట్లు పలికినదికాని, క్రోధముయొక్కతీవ్రతచే నిట్లుపలుకలేదని నేను, గ్రహించి, చాలకాలముక్రిందటి నుండియు నామె యిందులకు సంసిద్ధమైయున్నదని తలంచితిని; నేనప్పటికి నెట్లయిన నామెకోపోపశాంతికిని, ఆమెనిశ్చయము కొంతకాలమునకైన తిరుగుటకును, "ఇదిమాయమ్మ; పల్కులు నీయభిప్రాయమును దెలిసికొనుటకై యిట్లుపల్కితిని వేరుగాతలంపకు" మంటిని.

"నిజమేనా? ఇంతియేనా? నీవు నిజముగ నిట్లు దలంచియుండలేదా?" యని నావైపునకు చూచి " సరియే అట్లయిన నిఁకెన్నఁడు నిట్టిమాటలను తేకుము " అనికాసించెను.

అప్పటి కట్లేయని తలయూచితినిగాని, నేనెట్లాతలంపునువీడుట? ఇంతలోదైవకృపచే యుద్ధము తటస్థించుటయు, దొరతనమువారు నా కోరికపై నన్నొకచిన్నసేన కధికారిగనియమించుటయు యుద్ధమునంత

పొందినతోడనే: యింటికి తిరిగివచ్చుటయు, నాతల్లి నాకీయానంద మయి నుద్వాహముచేయుటకై నిశ్చయించితిననియు, నామెగుణవతియ నియు, రూపమునం దసమానయనియు, తెలియఁజేసి యామెను జూచు టకు నన్నంపెను; అప్పటినుండియు నేను వారియింటికి వచ్చుచుపోవు చునుండి మనోరమ పూర్వవృత్తాంతమీపాటికిమరువకుండనాయనితలం చి యెట్లయిన నామెసమ్మతిని బడయఁదలంచితిని,

"ఒకదినమున నామెకు రంగాపురారణ్యములోనికి రావలసిన దని యొకలేక వ్రాసితిని. ఆమెయు నిర్ణీతసమయమున కచ్చటికి వచ్చె ను. అంత నీసంగతియామెకు దెల్పితిని. మొదటనించుక కోపముజూ పినను, యేమనితలంచెనోగాని. తానీవార్త నిదివరకే భవానిశంకరు నివలన వింటిననియు, మాసంబంధమింతటితో నంతమొందబోవు చు న్నది గనుక వచ్చెడివారములో నొకదినమున,చీకటిలో తొమ్మిదిగంట లపుడు నన్ను తన పినిమిటి క్రొత్తగ బాగుచేయించిన బురుజుదగ్గర కు రావలసినదనియు, నేనామెకు వ్రాసినలేఖల నన్నిఁటిని తిరుగనిచ్చి వేయుదుననియు, నాకామె వ్రాసినలేఖలనన్నిటిని (మొత్తము 24) తే వలసినదనియు చెప్పెను. నేమను సమ్మతించితిని. గణేశా! అదియే యీనేరము జరిగినరాత్రియని నీకు తెలియునుగదా!"

"ఆనాడు నేను నియమానుసారముగ నెనిమిదిగంటలకు నాభ టులచే నానందకొక లేఖనువ్రాసి సమాధానపూర్వకముగ నామెకడ కు రాజాలనని తెలియజేసితిని. ఒరులెవ్వరును జూడకుండగ పెడమా ర్గమును బట్టిపోవుచుంటిని. ఆహా; ఎంతటి యల్పవిషయములునుగూడ నొక్కొక్కప్పుడు ముఖ్యములగుచుండునుగదా; నేనట్లు నియమితకా లమునకు పోవుచుండఁగ మొదటజూచినయాతఁడు నాకెదురుపడెను. అంత నేనేదియోమిష చెప్పి వెడలిపోయితిని.

"అచటికేగునప్పటికి తెల్లనిదుస్తులనుధరించి మనోరమ నాకై వేచి యుండెను. నేనామెకడకేగినంతనే యామెనాతో "నీకొరకై యెదురు చూచుచుంటిని. ఇంతతడవేలచేసితి"వని హెచ్చరించెను. మఱియు "మనకిరువురకును నేటితో సంబంధముతీరిపోవునుగదా! సరియే; దైవమిట్లు విధింప మనమేమిచేయగలము? నాలేఖలనన్నిటిని తెచ్చితివా? ఇవిగో నీలేఖలు పాతిక"యని లెక్కించి యిరువదియైదును నాకిచ్చివేసెను. నేనును నాకడనున్న యిరువదినాల్గులేఖలు నామెకిచ్చివైచితిని. ఆమె వానిని లెక్కబెట్టుకొని యన్నింటినిచించివైచెను. నేనునట్లుగావించితిని. అంతట నాముక్కలను తగులబెట్టుటకై యగ్గిపుల్లకయి వెదకితిని. కాని, లేకపోయెను. ఆమె యింటిలోనికి పోయి నిప్పులను గొనివత్తుననెను, వలదని వారించి నాతుపాకీలో నొక తూటాను పెట్టి శబ్దము గాకుండునట్లుగ నిప్పుచేసితిని. అంత నాముక్కలన్నిటిని వీతిహోత్రునిపాలు గావించితిమి. నేనును పరులకనుమానము గలుగకుండుటకై నాచేతులతో నాదుమ్మును గాలికెదురుగ నెగురవైచితిని. ఆకారణముననే నాచేతులు కడుగుకొనవలసివచ్చెను. అంతనామె "సరియే. ఇఁకమనకు నేటితోసంబంధము సరిగదా! ఆహా! దైవమెట్లు శాసించెను? కాని, నీకిది న్యాయమని తోచుచున్నదా? మనమిరువురము నత్యంతసుఖముగా విహరించిన యాస్థలములన్నిటిని జూచినంతనే నాకు పూర్వస్మృతిగలిగి నాహృదయమును దహించివేయవా? ఇదిభావ్యమా? నాయందు నిజముగ ప్రేమయుండినచో నన్నేలనివు పరిగ్రహింపకూడదు?" "అనియె. నిజమే. నేనట్లుచేసియుందును. గాని, నీకు మగఁడును పిల్లలును కలరుగదా? నాకెట్లు వీలుపడును?" అంటిని.

అంతనామె "ఆహా! అదియా! నేను వితంతునైయున్నచో మన కార్యము కొనసాగియుండెడిదే కదా? హా! సర్వేశ్వరా? ఎంతటికష్ట

మును దెబ్బ పెట్టితివి? మాయిరువురకును గల్గిన బాలికనుజూచి నేనె ట్లు కాల గడపగలను? ఆమెకిపుడు జబ్బుగ కూడ నున్నదికదా?" యని గట్టిగ నేడ్చుచు

నేనామెనూరకుండునట్లు చేసితిని.

అంత నామెదుఃఖమంతయు కోపముగాపరిణమింప "సరే!. పొమ్ము. నేనితర స్త్రీవలెనైనచో నొకవత్సరములోపల నిన్ను పాదాక్రాంతునిగావించియుండుదును ఇఁక నెద్దియు పలుకనొల్ల. పొమ్మని" చివాలున యింటిలోనికిపోయెను. ఆశ్చర్య, భయ సంభ్రమము లొక్కసారావేశింపఁజాలక నేనట్లే నిలువబడితిని ఆమె బహుశహా, తనమగనితో నీవార్త చెప్పునేమోయని శంకించితిని. నాకు వెఱపుగలెను. నేనంతట నేదియుయోచక నాతుపాకిలో కాలినతూటాను తీసిపారవైచి ధైర్యముఁదెచ్చుకొని వెడలిపోతిని" అని చెప్పెను.

ఇంతవరకును కమలాకరుని విచిత్రవృత్తాంతమును వినుచుండిన గణేశుఁడు కమలాకరునిట్లుప్రశ్నించెను.

"నీవామెను వదలిపోవునప్పటి కెన్నిగంటలయ్యెను?"

"సుమారు తొమ్మిది."

"అప్పుడేకదా యీఘోరకృత్యము జరిగెను. నీకామంటలు కనఁబడలేదా?"

"నేను దట్టమగు చిట్టడవియందుండుటచే నాకామంటలు కనఁబడలేదు"

"తుపాకిధ్వనియైనవినబడలేదా"

"లేదు. అన్యథాయత్తచిత్తుఁడై యుండుటచేతను, విచారభారముచేతను, తొందరగపోవుచుండుటచేతను వినఁబడకుండియుండును. ఇదివినిన గణేశున కిదిసంభవమునితోచలేదు. కమలాకరునియందు దివరకు నమ్మకము చెడియుండినవాఁడగుటచే నాతని కిది యసమంజసముగ

కోచెను. వానినుండి నిజము నారయుఁదలఁచి ముఖశ్రీకాంతము సొక్కు వగ నాతఁడు ప్రశ్నలువేయుట కారంభించెను. కొంతవడికి

"ఇట్లు చెప్పి నిర్దోషిత్వమును స్థాపింపఁదలంచుచుంటివా?" "యనిపల్కెను. ఇది ములుకులవలె నాటుటయు "అది యేనా నమ్మకము. ఇదంతయు సత్యము. ఇది వినినవారికెల్ల మొదట నేను మాట్లాడకుండుటకుగల కారణమును, నేను పోవుచుండగా నెదురుపడినవారు చెప్పినదియు నేరముజరిగిన సమయమును, నేనచ్చటికివచ్చిన సమయము నేకీభవించుటయు, నాతూటాకనఁబడుటకుఁగల కారణమును, నేను నీటిలో మసిచేతులు కడుగుకొన్న కారణమును, తేటతెల్లముగనున్నవికదా! ఇఁక నేనెట్లు నేరస్థుడనుగాఁగలను? ఒకవేళ నా వాక్యములు నమ్ముటకు వీలు లేకుండినను నాకువిచారము లేదు. కాని నేనిపుడన్నిటికి సంసిద్ధుఁడనై యున్నా" నని రోషముతో కమలాకరుఁడు పల్కెను.

ఈమాటలేవియు గణేశునకు విశ్వాసార్హములుగ లేవు. అంత డాతని "మరునాటియుదయమున వారు నీపై నేరము మోపినపుడేమని తలంచితివి? " అని ప్రశ్నించెను.

"మనోరమ తనమగనినిచంపి, తన్మూలముగ నన్ను చేపట్టవలెనని తలంచి యిట్లు చేసెననుకొంటిని"

"ఆహా! ఎంతటి మాటలాడితివి! మనోరమయే నిజనాధునిఁ జంప సమర్థురాలైనని నీవెట్లు తలఁప సాహసించితివి?"

రోషముతో "ఇంకెవ్వ రిట్లు చేసియుండజాలుదు రనుకొందును. వారు చెప్పినవిధముఁ బట్టిచూచినచో నేనుగాని, యామెగాని యీకార్యమును జేసియుండవలెనుగాని యితరులకు సాధ్యము కాదు. ఇఁక నేను చేసియుండని కారణమున నామెయే చేసి యుండవలెను.

"అపుడట్లేల చెప్పవైతివి?"

"ఆ సంగతులు నీకు చెప్పెదను. మొదటి దినమున జరిగిన సంగతి నన్ను పూర్ణముగా తెలియని కారణమున చెప్పనైతిని. తరువాత సీ సంగతి నంతయు విన్నంతనే, నన్నునమ్మి, నాకై తన పతినైనను జంపుకొన సంసిద్ధురాలైన స్త్రీసంగతిని నేనెట్లు బైట బెట్టుటకు సమ్మతింప గలనని యూహించితిని. అంతియేకాక, యెట్లయినను నిజము తేలక మానదనియు, నధమము, మనోరమయైన నేదో విధముగ నన్ను విడిపింపకుండునాయని యుపేక్షించితిని."

ఇట్లు పల్కనతోడనే నిజమునుదాచి, తన్నెట్లయిన మోసగించి, నమ్మునట్లు చేయఁదలంచుచున్నాఁడని కోపముతో గణేశుఁడు

"కమలాకరా! నీవు నిజముగ నిర్దోషిత్వమును స్థాపించుటకై సత్యమును మఱుగుపరచుచున్నావు. నేనడిగిన ప్రశ్నలకన్నింటికిని తగునుత్తరము లీయఁజాలు కథను గల్పించుట చాల కష్టమైనపనియే కాని, తెలివిగలవాఁడవగుటచే నట్లొనర్చితిని. ఇందేదియు కొఱఁత లేదు. గాని, నిజమే కొఱఁతగా కన్పట్టుచున్నది ఇంతవరకు బాహ్యావేశములచేతనే మనోరమ యీగాత్రమస్థుల నందరను పతివ్రతయనినమ్మునట్లొనర్చినదని చెప్పినను నమ్మియుందును. కాని, తన మగనిసిచంపి పూరిపుడకరైనను మిగులకుండునట్లు తనయింటి నంతను తగులబెట్టుకొనెనన్నచో నెట్లునమ్మగలను?" అనియెను.

"కాని నేను చెప్పినది యథార్థము"

"కాదు. ఏలయన, మనోరమ భర్త తుపాకిని పేల్చినవానిని తానుచూచితిననియు. నతఁడు పురుషుఁడగుటమాత్రము సత్యమనియు, చెప్పెను."

"అయియుండవచ్చును అతఁడిదియంతయు తెలిసికొని తన భార్యను రక్షించుటకై యిట్లుపల్కి యుండవచ్చును. అంతియేకాక

మాయిరువురకును వైరముండుటచే నీసమయమున వా పగఁదీర్చుకొనుట కీవన్నుగడ పన్నియుండవచ్చును."

ఇది నిజమగునని ఘటర్జికి తోఁచెను. కాని దానిని ఖండించి "అట్లు కాదు. నిజమగుచో దానిని ఋజువు చేయుము" అనెను.

"లేఖలన్నియు కాలిపోయినవే? యెట్లుస్థిరపరుపఁగలను.

"ఒకఁడొకస్త్రీతో నైదుసంవత్సరములనుండియు సంబంధము గలిగియున్నచో, నాతనికి నిర్ధారణచేయుటకు తగిన దొకయంశమైన నుండదా?"

"నిజమే కాని, యేదియు లేదే?"

"ఇఁక నామాటను రెట్టింపకుము."అనిపల్కి గణేశుఁడు దయార్ద్రహృదయుఁడై గద్గదస్వరముతో "ఓయువివేకీ! నీనిర్దోషిత్వ స్థాపనార్థమై యితరులందు దోషారోపణము చేయుచున్నావనుసంగతి నీకు తోఁచుటలేదా?"

కమలాకరుఁడును చేతులతో గుండెలు మోదుకొనుచు "నీమాటలే నన్నున్మత్తుని చేయఁజాలు"నని పల్కెను.

"నిజముగ నేను నీహితుఁడనైనచో నీమాటల యందు నాకు నమ్మకముండినను తగిన నిదర్శనములు లేనిదే వానిని బెట్టుకొని నేను వాదింపఁజాలను. వాదించినను, నీకు నిదర్శనములు లేనిమాటలన్నియు మేలు చేయుటకుమారుగా హానిచేయునని గ్రహింపు"మనిపల్కెను.

"కానిమ్ము. వానిని బెట్టుకొనియే పోరాడవలెను. అది నిజము"

"అట్లయిన నీవింక న్యాయాధిపతిని చూచుకొనవలసి యుండును"

విచారముతో "హా! దైవమా! ఈతఁడు నన్ను విడచి వేయుచున్నాఁడని" వాపోవ జొచ్చెను. కమలాకరుఁడు,

‘ప్రై[illegible]! కాని యీసమయమున నీతో మాట్లాడ జాలను. నీహృదయ[illegible] చలించి యున్నది. నీవిపుడున్మాదునివలెనున్నావు. సరియగు స్థితిలో లేవు. రేపు మరల వచ్చెదను-ఈలోపుగ నాలోచించు కొమ్మని” చెప్పి కమలాకరుఁడు వానితో నేదియో చెప్పఁబోవుచున్నను వినకయే గణేశచంద్రుఁడు వెడలిపోయెను-కమలాకరుఁడును తనకిఁక ముక్తియాశ లేదని విచారముతో నాపోవుచు దగ్గరనున్నయాసనముపై కూలఁబడెను.

ప్రథమ భాగము

సమాప్తము.



వ్హైట్ అండ్ కో, కాకినాడ.

# సరస్వతీగ్రంథమాల

కాకరపఱ్ఱు,—తణుకు తాలూకా

ఇందు నాటకములు, నవలలు, ప్రబంధములు మొదలగు గ్రంథములు మూడుమాసముల కొకటి చొప్పున వెలువడుచుండును. అవి నైతిక, ఆర్థిక, చారిత్రిక, సాంఘిక, విషయములను తెలుపునట్టివియై యుండును—

దీనికి సంవత్సరపు చందా రు 2—8—0

ఇదివరలోనిందు వెలువడిన గ్రంథములు—

**1924** సం॥న (1) కనకాంగి (Apprvcd by the Text-book committee) షేక్స్పియర్ ఒథెల్లో ననుసరించి వ్రాయబడినది—ఇవి కొలది ప్రతులు మాత్రమే కలవు. వెల. 0—8—0

(2) మదనసుందరీపరిణయము—ఆరంకముల నాటకరాజము వెల. 1—0—0

(3) పేష్వా నారాయణరావు వధ—మహారాష్ట్ర చరిత్రనుండి వ్రాయబడిన నొకవిషాదాంతమగు నవల 0—8—0

(4) సరోజనీ భాస్కరము—షేక్స్పియర్ రోమియోవుజూలియట్ ననుసరించి వ్రాయబడిన నాటకరాజము. 0-12—0

(5) కీచకవధ— ప్రబంధము—ఆశువుగా చెప్పబడినది— 0—2—0

అయిదును ఒకేసారి కొనువారికి 2—0—0 ఖరీదునకు పంపించెదము పోష్టుఖర్చులు వేరు.

**1925.** (1) ప్రహ్లాద. (వేదాంత మార్గమునుబోధించును.) 1—0—0

(2) ఆనందమయి—1 భాగము. (విచిత్రమైననవరాధపరిశోధక నవల. మిగులఆశ్చర్యమును బుట్టించును 0—12—0

రాబోవుగ్రంథము—

ఆనందమయి—రెండవభాగము 0-12—0

## సరస్వతీ బుక్కు డిపోలో దొరకు గ్రంథములు.

### కాకరపఱ్రు—తణుకు తాలూకా.

మ. రా. శ్రీ. వెలగల సుబ్బారెడ్డిగారిచే రచియింపబడిన

| | |
|---|---|
| 1. ధ్రువచరిత్ర. (హరికథ.) | 0-12-0 |
| 2. శ్రీరంగనాథసంకీర్తనలు. | 0-9. |
| 3. మదనగోపాల శతకము. | 0-2½ |
| 4. శ్రీవేణుగోపాలస్వస్వరూప దసరా పద్యములు. | 0-1-0 |
| 5 పంచవింశతిమాల. | 0-1-0 |
| 6. పంచమకుల ప్రబోధ. | 0-2-0 |
| 7. శ్రీవైకుంఠైకాదశవ్రత మహాత్యము. | 0-4-0 |
| 8. భరతమాల స్తవము. | 0-2-0 |

మ. రా. శ్రీ పెన్మెత్స సత్యనారాయణరాజుగారిచే రచియింప బడిన—చంపకమాలినీపరిణయము- (అచ్చతెనుగు ప్రబంధము)
వెల—రు0-10-0

## రెడ్డిరాణి

### సచిత్రమాసపత్రిక.

సం॥నకు చందా రు 3—0—0

| | |
|---|---|
| మధురానురాగము (నవల) | 0—12—0 |
| వారకాంత నాటకము | 0—12—0 |
| వాసంతిక నాటకము | 0—10—0 |
| నరసింహకారికావృత్తి | 1—10—0 |
| ఆంధ్రనామసంగ్రహము | 0—4—0 |

రెడ్డి బ్రదర్సు రాయవరం, గోదావరి జిల్లా.

